

# గోర్కీ జీవితం

అనువాదం: జగన్మోహన్

విశ్వసాహిత్యమాల, రాజమండ్రి

విశ్వసాహిత్యమాల 49.

# గోర్కీ జీవితం

అనువాదం:

మహీధర జగన్మోహనరావు



1951 మార్చి



విశ్వసాహిత్యమాల, రాజమండ్రి.

[వెల రు. 1-8-0.

**The Life of Maxim Gorky, by A. Roskin.** (1944 లో)
**D. L. Fromberg** యింగ్లీషు అనువాదాన్నుంచి 1947 లో
అనువదింపబడి 1951 లో ప్రచురించబడింది.





అవంతీ ప్రెస్, రాజమండ్రి.

ప్రథమ ముద్రణ 500.

# తొలిపలుకు

1948 మే 30 న చీనాకథలు ప్రచురించిన తర్వాత గడచిన మూడేళ్ళూ గ్రహణకాలం! ఈ కాలంలో ఆంధ్రదేశం, కాదు, భారతదేశమే సంపూర్ణంగా అంధకారంలో పడి పోయింది. 1947 ఆగస్టులో బ్రిటిష్ సామ్రాజ్యవాదులు భారత ప్రజావుద్యమానికి తట్టుకోలేక దేశీయ బడా బూర్జువాకు అధికారాన్ని వప్పగించి పోవాల్సి వచ్చింది. దేశప్రజల పేరు చెప్పి, స్వాతంత్ర్య పోరాటాలు సల్పిన త్యాగుల వారసులమంటూ అధికార స్వీకారమొనర్చిన కాంగ్రెస్ పరిపాలనలో ప్రజలు అష్టకష్టాలు పడుతున్నారు.

'చీనాకథల' కు వ్రాసిన పీఠికలో 30-5-1948 ని 'దేశస్వాతంత్ర్యాన్ని, ప్రజాస్వాస్థ్యాన్ని, సాంఘిక పురోగమనాన్ని కూడా విక్రయించి, తాము కోట్లకు గోడలు కట్టుకున్నారు, చైనా జాతీయనాయకులనబడే వినాయకులు,' అని వ్రాసేము. మన దేశంలోనూ సరిగా అదే జరిగింది, జరుగుతూంది.

కాని, ధర్మం జయించి తీరుతుందని మా నమ్మకం........తథాస్తు.

ఈ మూడేళ్ళలోనూ విశ్వసాహిత్యమాలకు కూడా యీ గ్రహణపుతాకిడి పూర్తిగా తగిలింది. సంపాదకుడు డిటెన్యూగా రెండేళ్ళు జైళ్ళలో గడపాల్సి వచ్చింది. అంతేగాదు. విశ్వసాహిత్యమాల స్టాకులన్నీ పోలీసులు అక్రమంగా, అన్యాయంగా స్వాధీనం చేసుకుని తీసుకు పోయేరు. రు. 15,000 ఖరీదు చేసే పుస్తకాలు తీసుకు పోవడంతో ఆగక ప్రభుత్వం 'అవంతీ ప్రెస్' నుంచి రు 2,000 లు ధరావతు కోరింది. కట్టక తీరలేదు. హైకోర్టుకు పోతే కూడ ప్రయోజనం లేకపోగా ప్రభుత్వానికి ఖర్చులు యిచ్చుకోమన్నారు. అసలుకు వడ్డీ!

ఈ రీతిగా కష్టపరంపరలు మాకే గాదు, దేశప్రజ లెందరికో దాపురించే యని చెప్పవచ్చు. ఇట్టి ప్రభుత్వాలనుంచి మేలు కలుగుతుందని ఆశించిన మూర్ఖు లుంటారనీ మేమనుకోము.

ఐతే,-ప్రజలకు మార్గదర్శకముగా వుండాల్సిన రాజకీయపార్టీలలో ముఖ్యమైన కమ్యూనిస్టుపార్టీ కూడా యీ కాలంలో గ్రహణబాధకు లోనైంది. రాహుకేతువుల్లా ట్రాట్స్కీ- యిజం, టిటో యిజం, భారత కమ్యూనిస్టుపార్టీలో తిష్ఠవేసి

కొని కూర్చుని, మూడేళ్ళలో ప్రజాపోరాట జ్యోతిని కొడిగట్టించేసేయి. రణదివే, రాజేశ్వర్రావుల నాయకత్వాన అభ్యుదయ ఉద్యమాలు, శక్తులు పూర్తిగా విచ్ఛిన్నం గావించబడినయ్. ఈ మాట యెందుకు చెప్పాల్సి వచ్చిందంటే, అభ్యుదయశక్తులకు యీ వెన్నుపోటు లేనిచో ప్రస్తుతపు ఈ పరిస్థితు లుండవనియే మా అభిప్రాయము. పోనిండు, యిప్పటికైనను మించినది లేదు. సరియైన రాజకీయ పాలసీతో, నాయకత్వంతో యికనైనను ప్రజాతంత్రవాదు లందరికి ముందు నిలచి దేశాభ్యుదయమునకై కమ్యూనిస్టుపార్టీ పనిచేయగలదని ఆశించుదాం.

ఏ అభ్యుదయముకొరకై, విశ్వశ్రేయస్సుకొరకై సాహిత్యప్రయోజనమో, అట్టిదియే ఆదర్శంగా పెట్టుకొని విశ్వసాహిత్యమాల 1935 నుంచీ పనిచేస్తూ వచ్చింది. ప్రభుత్వం నుంచి యెన్నో దాడులు, యిబ్బందులు వచ్చినవి. అన్నిటిని సహించి, ప్రచురణ కార్యములో ముందుకు సాగుతున్నాము. కాని, యీ నాలుగేండ్లలోనూ ట్రాట్స్కీ-టిటో యిస్టు ముఠాకూడ మా కార్యక్రమానికి చేతనైనన్ని అడ్డంకుల్ని కల్పించింది. ఈ ఆటంకా లన్నిటినీ తట్టుకుని, ధర్మనిర్వహణం చేస్తూ వుంది, సాహిత్యమాల.

ఈ గ్రంధాన్ని 1947 లో వెల్లూరు జైల్లో డిటెన్షన్‌లో వున్నపుడే అనువదించియు, యిప్పటి వరకు ప్రచురింపజాలక పోవుటకు ఆర్థిక రాజకీయ యిబ్బందులే కారణములని వేరే చెప్పనక్కరలేదని తలుస్తా.

తిరిగి మూడేళ్ళకు ఆంధ్రమహాజనుల ముందు నూతన ప్రచురణతో నిల్చుని వున్నామంటే అభ్యుదయపర నిరతులగు మిత్రవరుల సాయమేనని చెప్పాలి. ఆంధ్రప్రజలు మా యీ సదుద్యమమునకు సర్వవిధముల తోడ్పడి, మాకు ప్రోత్సాహ మొసంగ గోరుచున్నాము.

విశ్వసాహిత్యమాలకు మొదటినుంచీ అనేక విధాలుగా తోడ్పడుతూన్న అభ్యుదయకాముకు లందరికీ, మా కృతజ్ఞత తెలుపకుండ నుండజాలము.

రాజమండ్రి,
31-3-1951.

మహీధర జగన్మోహనరావు,
సంపాదకుడు.

సు హృ ద్వ రు లు

శ్రీ ఆచంట సీతారామయ్యగారికి

కృతజ్ఞతాపూర్వకముగ

vii



మాగ్జిం గోర్కీ
(అలెగ్జీ మాగ్జిమోవిచ్ పెష్కోవ్.)

జననం : 1868 మార్చి 14; మరణం : 1936 జూన్ 19.

# గోర్కీ జీవితము

## జననం: గోర్కీ పూర్వీకులు

పెష్కోవ్ కుటుంబం రష్యాలోని అన్ని రైతు కుటుంబాలవంటిదే గాని విశేషంగా చెప్పదగిన చరిత్రగలది కాదు. ఆరోజుల్లో డైరీలు వ్రాయడం గాని, వంశవృక్షాల్ని జాగ్రతగా కాపాడుకోడం గాని, ఫొటోగ్రాఫులు గాని సామాన్యులు యెరగనే యెరగరు.

జీవించి వున్నంతకాలం కష్టపడి పనిచేసుకోడం, అజ్ఞానంలో, కష్టాల్లో జీవయాత్ర గడపడం, చనిపోయేక భూమి మీద యే ఆనవాలూ, స్మృతిచిహ్నమూ లేకుండా వెళ్లిపోవడం,—యిదే మానవుల్లో అత్యధిక సంఖ్యాకులకి విధించి వున్నదీ, జరుగుతూ వచ్చిందీ కూడానని చాలా మంది నమ్మకం.

గోర్కీ పితామహుడు సవ్వాటీ పెష్కోవ్. అతడు సైన్యంలో చాలా కాలం పనిచేసి, ఆఫీసరుగాకూడా అయేడు. క్రిందివారితో అతడు వ్యవ రించే అమానుషవైఖరికి ఫలితంగా ఉద్యోగం ఊడడం, సైబీరియాకి ప్రవాస శిక్ష పడడమూ కూడా జరిగింది.

ఆరోజుల్లో క్రిందివారిని నిర్లక్ష్యంగా, క్రూరంగా చూడడం ఒక తప్పు కానేకాదు. పైగా అటువంటివాళ్లే పెద్దపెద్ద ఉద్యోగాలకి నియమించబడే వారు. అటువంటి రోజుల్లోనే సవ్వాటీని ఉద్యోగం నుంచి తొలగించి, ప్రవాసం పంపేరంటే అతడెంతటి ఘోరమైనవాడో మీరే ఊహించు కోండి!

"ఆలి వున్నవాడు ఆలిని కొడితే, ఆలి లేనివాడు అటకెక్కి బుట్ట కొట్టేడట!" ఆ మాదిరిగా అంతవరకూ తన క్రిందివాళ్లమీద చూపే క్రూరత్వాన్నంతనీ సవ్వాటీ అప్పటినుంచీ తన కుమారుని మీదే చూపించ నారంభించేడు. సవ్వాటీ కుమారుడు మాక్సిమ్ (గోర్కీతండ్రి)

ఈహింసను పడలేక చాల సార్లు యింటినుంచి పారిపోవాలని యత్నించే వాడు. ప్రతీసారీ కుక్కలతో కూడా తరుముకెళ్ళి మాక్సిమ్‌ని వేటాడి పట్టుకుని, చచ్చిపోయేలా బాది వదిలేవాడు, తండ్రి.

సవ్వాటీ చనిపోయేక మాక్సిమ్ కాలినడకనే బైలుదేరి, సైబీరియా అంతా దాటి, వోల్గా నదీతీరానికి వచ్చేసేడు. నిఝ్నీ-నొవోగొరోడ్ పట్టణంలోని వడ్రంగం కార్ఖానాలో చేరి, పని నేర్చుకుంటూ కాలం గడుపుతూన్నాడు మాక్సిమ్. అక్కడే బీరువాలు, కాబినెట్‌లు చేయడం, గృహాలంకరణము, మొదలైన వృత్తులు నేర్చుకుని మంచి పనివా డయ్యేడు.

ఆ కార్ఖానాను అనుకొనే ఒకఅద్దకం కార్ఖానా వుండేది. అది 'కషీరిన్' కుటుంబీకులది. కషీరిన్‌ల ఆడబడుచు, 'వార్యానే' నే తరువాత మాక్సిమ్ పెండ్లాడేడు.

వివాహం అయేక మాక్సిమ్ సవ్వాటియేవిచ్ పెష్కోవ్ * అత్తవా రింట నివాసం యేర్పాటు చేసుకున్నాడు. కషీరిన్ కుటుంబం మధ్య తర గతికి చెందింది. నొవోగొరోడ్‌లోని మారుమూల వీధుల్లో గుబులుగా వుండే ఒక యింట్లో వుండేవారు, ఈ కుటుంబం అంతా. అక్కడే మన కథానాయకుడు 'గోర్కీ' జన్మించేడు. పెష్కోవ్ దంపతులకు యీతడు 1868 సంవత్సరంలో మార్చి 14 వ తేదీన జన్మించేడు. ఆబిడ్డడికి 'అలెక్సీ' అని తలిదండ్రులు నామకరణం చేసేరు. అందరూ అతన్ని 'అలోషా' అని చనువుగా పిలిచేవాళ్ళు.

---

* రష్యన్‌ల పేర్లు గుర్తుంచుకోడానికి కీలకం ఏమంటే, ముందుగా పేరు, ఆఖరున కుటుంబం పేరూ వుండి తీర్తాయి. మధ్యనున్నది 'ఫలానావారి కుమారుడు లేక కుమార్తె' అని. సవ్వాటీ కొడుకు సవ్వాటియేవిచ్. కుమార్తె ఐతే సవ్వాటి యేవ్నా అని వుండాలి. అంతేగాక యింటిపేరులో కూడా పెష్కోవ్-స్త్రీలింగంలో 'పెష్కోవా' అని అవుతుంది. స్త్రీలింగ నామాలన్నీ ఆకారాంతాలే.

మాక్సిమ్, తండ్రిచే వేటాడబడినట్లే, అలెక్సీకూడా చిన్నప్పటినుంచీ మాతామహుడైన వాసిలీ కషీరిన్‌చేత హింసించబడుతూండేవాడు. అలెక్సీ చిన్నతనాన్ని గూర్చి మన కంతగా తెలియదు. గాని 'నా చిన్న తనంలో'* (My Chaildhood)అనే గ్రంథంలో గోర్కీ తండ్రి మాగ్జిమ్‌ని గూర్చీ, తన చిన్నతనాన్ని గూర్చీ కొద్దిగా వ్రాసేడు. పావురాన్ని డేగ వేటాడినట్లుగా తండ్రి నిరంతరం తన్ను వేటాడుతూ, హింసిస్తూ, జీవితాన్ని నరకప్రాయంగా చేస్తున్నా 'మాక్సిమ్' ముఖం సుస్వభావాన్ని వెల్లడించే చిరునవ్వుతోనే వుండేది. ప్రపంచాన్ని అతడు సంతోషంతో, సంతృప్తితో, ఆశతోనే చూసేవాడు. తండ్రి యొక్క ఈ సద్గుణాలే అలెక్సీలో మూర్తీభవించేయి. జీవితంలో యెంతటి కష్టాలైనా చిరునవ్వుతో, ఓరిమితో, భవిష్యత్తునందు నమ్మకంతో తృణప్రాయంగా యెదుర్కొనే ధీరత, తండ్రినుంచే అలెక్సీకి సంక్రమించింది.

అలెక్సీ మాతామహ కుటుంబం వాళ్ళు కూడా, అతని పితామహుని వలెనే బహు క్రూరులు; ప్రతి ఒకడూ మిగిలిన మానవుల నందర్నీ, తనా పరా అనే వివేచనేమీ లేకుండా అసహ్యించుకొనేవారు.

"కషీరిన్‌ల యింట్లో మళ్లీ దొమ్మీ అవుతూందిరా!" అని వీధిలోని అల్లరిమూక కేక లేస్తూండేవాళ్ళు. ఈ కేకలు రోజూ ఒక సారే గాక రెండు మూడు పర్యాయాలుకూడా వినిపించిన రోజులెన్నో! వాళ్లు పోట్లాడుకొనేటప్పుడు పెద్దగోలా, గంద్రగోళం చేసేవారు. ఫలానా వాళ్ళింట్లో జగడమాడుకున్నారని వీధీ, వాడా అంతా తెలిసిపోయేది. కాని, యెవరికేనా యేదైనా ఘాత చేయాలనుకుంటే వాళ్లు కిక్కురు మనకుండా, బహు నిశ్శబ్దంగా పని కానిచ్చేవారు. అలెక్సీ మేనమామలు తమ భార్యల్ని చావకొట్టేటప్పుడు యీ పద్ధతినే అనుసరించేవాళ్లు.

* గోర్కీ రచన 'నా చిన్నతనంలో'అనేది త్వరలో విశ్వసాహిత్యమాలలో వెలువడుతుంది.

పాపం, వాళ్ల చావుదెబ్బలు తిని, ఒళ్లు హూనమైపోయి, స్మారకంకూడా లేకుండా పడివున్నా. రెండోకంటివాడికి తెలిసేదేకాదు!

ఈ విచిత్ర సంసారంలో మాక్సిమ్‌కి కత్తు కలవలేదు. ఇంటి అల్లుడైనా పరాయివాడుగానే వుండిపోయే డాతడు. కషిరిన్ కుటుంబీకులంతా మాక్సిమ్‌ని యెందుకో నిష్కారంగానే ద్వేషించేవారు. మేకపిల్లయేం చేసిందని తోడేలుకు అంత కసి? ఈ సమాజంలో ద్వేషించడం కూడా ఒక స్వభావమే అయిపోయింది. ఒక శీతాకాలంలో కషిరిన్‌లంతా కలిసి, అకారణంగానే మాక్సిమ్‌ని పట్టుకుని కొట్టేసి, నదిలో మంచుక్రిందికి త్రోసేసి, వెళ్ళిపోయేరు. నది పైభాగమంతా మంచుగడ్డ పలకలా వుండిపోతుంది. అక్కడక్కడ పగులగొట్టి, బొరియలుచేసి, అందులోనించి నీళ్ల వాడుకుంటారు, జనులు. ఆబొరియలో యెవరైనా పడితే చావు మూడిందన్నమాటే. అట్లాంటి మంచుబొరియలోనికి తోసేసేరు, మాక్సిమ్‌ని బావమరుదులు. మాక్సిమ్ ప్రాణాలతో బైటికి రావడం పునర్జన్మ యెత్తినట్లే అయింది.

మాక్సిమ్ అతి ఓరిమిగలవాడు. ఈ అఘాయిత్యాన్ని గూర్చి అత్తవారితోనూ చెప్పనేలేదు. అత్తవారిల్లు వదలి, భార్యనూ, పిల్లవానినీ తీసికొని బైలుదేరేడు. వోల్గానదిమీద ప్రయాణంచేసి ఆస్త్రఖాన్ పట్టణం చేరి, అక్కడ పనికి కుదిరేడు.

ఈ పట్టణమంతా మురికి, దారిద్ర్యం, రోగాలు,—మొదలైనవాటికి కాణాచిగా వుండేది. ప్రభుత్వం సురక్షితంగా వుండాలంటే ప్రజలు యీ బాధల్లోనే పడి వుండడం మంచిదని జార్‌చక్రవర్తుల అభిప్రాయం. ఉద్యోగులు ప్రజల్ని కాల్చుకుతింటూ, వాళ్ళలో వాళ్ళకి తగువులు పెడుతూ వుండేవారు. కలరా, మశూచి వగైరాలు యిక్కడికి యేటేటా వచ్చి తమతో కొందరి ప్రాణాలు తీసికొని వెడుతూంటాయి.

మాక్సిమ్ కుటుంబానికి యిక్కడే పెద్దఆపద తటస్థించింది. అలెక్సీకి కలరా వచ్చింది. తండ్రి బాలునికి యెంతో ప్రేమతో పరిచర్యలుచేసేడు. పిల్లవాడు జీవించేడు. కాని, తండ్రికి కలరా సోకింది; యీ విష్ఫురలో కాన్ని వదలి మాక్సిమ్ శాశ్వతవిశ్రాంతి తీసికొన్నాడు. అలెక్సీ నాలుగో యేట, 1872 లో మాక్సిమ్ తన చిన్నకుటుంబాన్ని నిరాధారం చేసి చనిపోయేడు.

అలెక్సీ హృదయంలో తండ్రిని గూర్చి ఒకటే హత్తుకు పోయింది. వర్షం కురుస్తూంది; నేలంతా బురదగావుంది: చెర్చి పెరట్లో నిర్మానుష్యమైన ఒక మూలలో సమాధి పేటికా, దాని మూతమీద రెండు చిన్న కప్పలూ. యిదే తండ్రినిగూర్చి అలెక్సీకి జ్ఞాపకం వున్న దృశ్యం.

అమ్మమ్మ చెప్పి వుండకపోతే, తండ్రినిగూర్చి అతనికేమీ తెలిసేదే కాదు.

అమ్మమ్మ చెప్పిన దాన్నిబట్టి అలెక్సీకి తెలిసిందేమిటి? లోకంలో పిల్లలు యెందుకూ? అంటే రోజూ చావుదెబ్బలు తినడానికేనని; తను రోజూ మాతామహునిచేత దెబ్బలు తినడంలేదూ? తన తండ్రి తాతచేత యమబాధలు పడేవాడని అమ్మమ్మ చెప్పలేదూ?

తండ్రి మరణానంతరం అలెక్సీ. తల్లితోకూడా మళ్లీ నొవో-గొరోడ్ పట్టణానికి, మేనమామల యింటికి చేరాల్సి వచ్చింది. తనతండ్రిని ఖూనీ చేయడానికి యత్నించినవాళ్ళ కుటుంబంలోనే మళ్ళీ కాలం గడపవలసి వచ్చింది.

వోల్గా నదిమీది ప్రయాణం బాలుడైన అలెక్సీ మనస్సుమీద స్థిరంగా ముద్రించబడింది. పసుపురంగుతో ఏటవాలుగావున్న గట్లమధ్యనుంచి, చిన్న బోటులో శిశిర ఋతువులో ఆకురాలి మోడులైన చెట్లతోవున్న అడవులగుండా వెడుతూ, దూరంగా బొమ్మరిళ్లలా కనిపించే ఊళ్ళు

పల్లెలూ చూస్తూంటే అలెక్సీ మైమరచి రెప్పవాల్చకుండా నిలుచునేవాడు. అలెక్సీకి జ్ఞాపకశక్తి అపారం. చిన్నతనంలోనుంచీ చూచినవన్నీ అతని మనోఫలకం జాగ్రతగా అచ్చొత్తి భద్రపరచేది!

కషీరిన్‌లు యిల్లు మార్చేరు. వెనకయింటి కిదేమీ తీసిపోదు. లోచూరు, ముందుకు పొడుచుకొచ్చిన కిటికీలు, పొట్టిగా కుదిమట్టంగా వుండి. జేగురురంగు వేసిన యిల్లది. 'ఇంటిని చూస్తే యిల్లాల్ని చూడనక్కర్లేద' న్నట్లు. యిక్కడకూడా యింటి వైఖరే యింట్లో వాళ్ళ అంతస్థుని వెల్లడి చేస్తుంది. రోజస్తమానం తిట్లు, కొట్లాటలు, ఒట్లు, శాపనార్థాలు, కొరడాదెబ్బల శిక్షలు, దొంగతనాలు, మోసాలు, దేవుడా! అని బుడిబుడి యేడ్పులు.—వీటితో వాళ్ళిల్లు యెప్పుడూ పీడకలలా వుండేది.

అందరినీ మించి తాత, వాసిలీ వాసిలీవిచ్ కషీరిన్ అంటే అలెక్సీకి యిష్టముండేదికాదు. ఎర్రటి జుంజురుగడ్డం, ఆకుపచ్చని కళ్లు, రంగులు తినేయడంవల్ల యెర్రగా రక్తం పూయబడినట్లున్న చేతులు.—ఇదీ అతని రూపం. అతని బూతులు, ప్రార్థనలు, పరిహాసాలు-శ్రీరంగ నీతులు.-యివన్నీ కలిసిపోయి, ఒకటే గందరగోళంగా, నక్కూడుపులా, వినేవారి గుండెలు నీరయేలా చేసేవి. "ఈ దుర్మార్గుడే నీకు పరమ శత్రువు!" అని ఆ బాలుని మనస్సు నిరంతరం ఘోషిస్తూండేది: నిజమే. ఆ కుటుంబం అంతా కూడా బాలుడైన అలెక్సీని బహు క్రూరంగా హింసించేవాళ్లు. అందులోనూ తాతగారు అతని జీవితాన్ని నిరంతర నరకప్రాయంగా యెడతెగని పీడకలలా చేసేవాడు.

అది భయంకరజీవితమే కాని, చుట్టూ పరిసరాలు చూసినా అతనికి అంధకారంగా కనిపిస్తూంది. కిటికీలోంచి వీధులోకి చూస్తే, కుడివైపుగా పసుపు రంగుగా పెద్ద యెత్తైన జైలు బారకీచులు; ఎడమవైపుగా జైలు గేటూ; నాలుగుప్రక్కలా యెత్తైన గోపురాలతో బూడిదరంగు జైలు

భవనాలూ కనిపించేవి. బారకీచులికీ, జైలుకీ మధ్యలో ఒక బురద సముద్రం; అందులో క్రిక్కిరిసి వరసలుగా మట్టిగుడిసెలు. వాటిలో కొన్ని తెల్లగా, కొన్ని ఆకుపచ్చగా, కొన్ని బూడిదరంగుగా- ప్రతీయింట్లోనూ, నిత్యమూ రామరావణ సంగ్రామమే. గంజి అడుగంటిందనో, పాలు విరిగినాయనో, అడుగడుక్కీ పోట్లాడుకునేవాళ్లు. కుండలకీ-మూకుళ్ళకీ, అట్లకీ, రొట్టెలకీ,- యిటువంటి చిన్నచిన్న వాటికై స్వార్థపరులై గుద్దులాడుకోడం,- అట్టహాసంగా, మహా నిష్ఠగా పుట్టినరోజులు, పండుగలు, దినాలూ చేస్తూండడం; పొట్టలు పగిలేదాకా మెక్కడం, గురకవచ్చేదాకా తాగడం,- యిదీ వరస యెక్కడ చూసినా.

నిఝ్నీ-నొవోగొరోడ్‌ను గూర్చి, "రాతికొంపలూ, యినప మనుషులూ" అనేవారు ప్రజలు!

"తమదే అసలైన బ్రతుకనీ, అన్నికాలాలకీ స్థిరంగా వుండేటట్లు వ్రేళ్లతన్నిన జీవితవిధానంలో తాము సుప్రతిష్ఠితులమై వున్నామనీ" ఈ యినపమనుషులే అనుకొనేవాళ్లు.

అలెక్సీకి తానొక గోతిలో వున్నట్లుండేది. అతను బహు చిన్నతనంలోనే వ్యాపారస్తులంటే అసహ్యించుకొనేవాడు. వాళ్ళంతా ఒక పేరకం, రాగిడబ్బుల్లాగ. ఎంతసేపూ "తమ కాయుష్యం, తమ కారోగ్యం" అంటూ అతిస్వల్ప సంకుచిత జీవితాల్ని గడుపుతూంటారు. ఈ జనం నుంచి దూరంగా వుండాలని ప్రయత్నించేవాడు అలెగ్జీ. తనదీ అనేందుకు ఏదో ఒక లోకం సృష్టించుకోవాలని మహాతాపత్రయ పడేవాడు.

కషీరిన్‌ల పెరటిదొడ్లో రంగులతొట్లకీ, గుడ్డలారేసుకునే త్రాళ్లకీ దూరంగా చిన్న పూలతోట వేసి, పెంచనారంభించేడు అలెగ్జీ. అది చక్కగా యెదిగి పుష్పించింది. ఓరోజున మామూలుగా నీళ్లు పోయడానికని అలెగ్జీ తోటదగ్గరికి వెళ్లేసరికి కషీరిన్‌ల పంది తోటంతా ముట్టెతో గుద్దలించి, పువ్వులమొక్కల్ని తొక్కి, తోటంతా చిందర

వందరచేసి పారేస్తూంది. అడ్డుగా కట్టిన తడక విరిగిపడి వుందో వైపుగా. బహుశా వెనకకాళ్ళతో దడి తన్నేసి వుంటుంది!

ఆ మాదిరిగానే, అటువంటి నీచత్వంతోనే, దౌష్ట్యంతోనే యితరులు ఆ బాలుని లేతమనస్సును వికలపరచి నులిపి, కాలిక్రిందవేసి మట్టేసేరు. అతడు ప్రేమతో, అభిమానంతో చూచుకొనేవాటిని నిర్దాక్షిణ్యంగా, నిర్లక్ష్యంగా తొక్కివైచేరు.

కాని, అలెగ్జీ బాల్యంలో సుఖమయంగా, సంతోషంగా గడిపిన ఘడియలు కొద్దిగా లేకపోలేదు. అతని అమ్మమ్మ - అకులీనా ఇవానోవ్నా-అలెగ్జీ బాల్యజీవితంలో ఆశాజ్యోతి, ఆనందమయి। 'నాబాల్యం' అనే గోర్కీ పుస్తకం చదివిన వారి కీ అవ్వ ఆత్మీయురాలై తోస్తుంది.

అబాలుని లేతమనసు కషీరిన్‌ల కలుషిత వాతావరణంలో పొగచూరి నాశనం గాకుండా కాపాడి, మానవుల సౌఖ్యానందాల్లో అతిసహజమైన అత్యద్భుతమైన విశ్వాసాన్ని పాదుకొల్పిన దా వృద్ధురాలే.

చిరకాల బాధాసహనంవల్ల మొరటువారి, బూజువట్టిన లోకసంగ్రహం కా దామెది. అమ్మమ్మతో ఈషణ్మాత్ర పరిచయమున్నవారికికూడా ఆమె సుస్వభావం, దయార్ద్రహృదయం తెలుసును. ఆమె ప్రతిమాట లోనూ, చేతలోనూ, చివరకి ఆమె వెండి పొడుంకాయలోనుంచి ఒక్కపట్టు పొడుం తీసేటప్పుడూ, షికారు పోయినప్పుడు దారిలో యేదో మూలికను పెరికినప్పుడూ కూడ ఆమె సౌజన్యత ప్రకటీకృత మవుతూనే వుండీది.

ఇతరుల కష్టాలంటే ఆమె యెంతో సానుభూతి చూపేది; ఆమె మనస్సు యీ బాధల్ని తలచుకుని యెంతో దుఃఖించేది. మూలికలతో ఆమెకి పరిచయం వుంది. కథలల్లి చెప్పడం ఆమె కెంతో సరదా. తన లోని దయ, సంస్కారం, సంతోషం,—వీటిని తన సంభాషణద్వారా

అలెగ్జీకి అందిచ్చేది. ఆమె మాటలు వినటమంటే అలెగ్జీకి చిన్నతనంలో ఎంతో ఆసక్తిగా వుండేది.

కషీరిన్‌లను గురించీ, గత వృత్తాంతాల్నీ, మూలికల గుణగణాల్ని గూర్చీ, దొంగవాని తల్లి, పేదరాసిపెద్దమ్మ,- వీళ్ళనిగూర్చి అద్భుతమైన, చిత్రమైన, కరుణాపూరితమైన కథలు చెప్పేది. అమ్మమ్మకథలే అలెగ్జీ చదివిన మొదటి గ్రంథం. ఈ గ్రంథం అతని జీవితకాల మంతలోనూ అతడు మరిచిపోనేలేదు!

దాది యౌజెన్యాకూడా యెన్నో కథలుచెప్పేది. అద్భుత సాహస కథలంటే ఆమెకెంతో యిష్టం. దేవుడు, మతగురువులు,- వీరే ఆమెకథల్లో ముఖ్యపాత్రలు. ఆమె దేవుడు భూమిమీదేవుంటూ గ్రామగ్రామాలకీ తిరుగుతూ, యితరులవ్యవహారాల్లో అనవసరంగా జోక్యం కలిగించుకుంటూ, పక్షపాతంగా వ్యవహరించేవాడు. అతనికికూడా తలతిక్క, ఆసూయ, కార్పణ్యం,- యివన్నీ వున్నాయనిపించే దామె కథలు వింటూంటే.

ఆమె కథల్లో యెందరో దుర్మార్గు లుండేవాళ్లు. న్యాయాన్ని ఆదేదో గుడ్డో, బియ్యమోలాగ చీకటిబజారున బెట్టే జడ్జీలు; చాలూమూలం లేని అనవసరపు క్రూరత్వంచూపే భూస్వాములు, పరమలోభులు, దురాశాపరులూ అయిన వర్తకులు,- యిటువంటి పాత్రలకు ఆమె కథల్లో అంతే లేదు. ఓవర్తకుడేంచేశాట్ట!—వెయ్యి రూబుళ్ళకి లోటుంటే భర్తీచేయడానికి భార్యాబిడ్డల్ని యేభై కోపెక్కులకి (అర్థరూబుల్) తార్తారులకి అమ్మేశాట్ట!....

అలెగ్జీ ఆ కథలన్నీ విశ్వసించేవాడు. తాను నిత్యమూ ఆ కథల్లోని వాళ్ళని మించిన లంచగొండి జడ్జీలనీ, క్రూరులైన భూస్వాముల్నీ, లోభుల్నీ, దురాశాపరులైన వర్తకుల్నీ చూస్తూనేవున్నాడు. కషీరిన్‌లు, యిరుగుపొరుగున వున్నవాళ్ళూ కూడా యీ దుర్గుణాల్లో యెవరికి తీసిపోతారు?

ఈ ప్రపంచంలో చెడ్డవాళ్ళేగాక, కొందరు ఉత్తమవ్యక్తులూ, మహాను భావులూ కూడా వుండే తీర్తారని కూడా అలెగ్జికి, అమ్మమ్మ, దాది కధలు విన్నమీదట నమ్మకంగా తోచింది.

ఓరోజున నిజంగానే అటువంటి మంచివాడు దగ్గిర్లోనే కనిపించేడు. కషీరిన్‌ల యింట్లోకి ఒకడు అద్దికి వచ్చేడు. వంటయింటికి ప్రక్కనే వున్న చిన్న గదిలో ప్రవేశించి, దాన్ని ఒక చిన్న లేబలేటరీగా మార్చే శాడు. గుండ్రటి భుజాలూ, కళ్ళజోడూ కలిగి సన్నగా బక్కగావున్న యీ వ్యక్తి రాత్రింబవళ్లు స్పిరిట్ స్టవ్ ముందు కూర్చుని, యేవో పుస్త కాలు చూస్తూ, రాగిత్రాసుతో అదీయిదీ తూచి కలుపుతూ, కాచుతూ,- ప్రయోగాలు చేస్తూనే వుండేవాడు.

అలెగ్జికి వింతగా కనిపించిన దేమిటంటే యితడు నిరంతరం యేదో పనిచేస్తూండడం గాదు; యితనికి ధనార్జనయం దాసక్తి లేకపోవడమే. అసలు డబ్బు ప్రపంచంలో వుందని ఆతడు గుర్తించినట్లేలేదు! అదీ చిత్రం.

ఆతడు బహు శాంతుడు. ఎప్పుడూ ఒంటరిగానే వుండేవాడు. ఏ గొడవా అక్కర్లేనివాడు. అట్లాంటివాణ్ణిచూస్తే కషీరిన్‌లకి ఒళ్ళు దహిం చుపోయీదంటే ఆశ్చర్యం లేదు. వాడు కనిపిస్తేనే కారంరాచినట్లుం దేది, వాళ్ళకి క్రమంగా. చివరికి గది ఖాళీచేయమని ముసలాతడు నోటీ సిచ్చేసేడు.

అతడు త్రాసులు, పుస్తకాలు,- అన్నిటితోసహా వెళ్ళిపోయేడు- ఎక్క డికో యెవరికీ తెలియదు. కాని, అలెగ్జీ, హృదయఫలకంమీద అతని ముద్ర చెరపరానిదై వుండిపోయింది.

కధల్లోవి మంచివాళ్ళు కేవలం కల్పితవ్యక్తులు గాదని నమ్మకం కలి గింది. వాళ్ళని మనం కనిపెట్టి తెలుసుకోవాలంతే. కషీరిన్‌లవంటి వాళ్ళే గాదు లోకంలో అంతా. తాము నివసించే పొలివాయా, కనత్‌నయా

వీధుల్లోని మానవులతో. భేదించే వ్యక్తు లెక్కడ కనిపించినా. వాళ్ళలో వెదకిచూస్తే. మంచివాళ్ళు దొరుకుతారు!

వెదకడమంటే యెల్లాగ? ఇల్లు వదిలి దూరదూరంగా పోవడా? తమయింట అద్దెకున్నవాడు మాయమైనట్లుగానే పోవాలేమో? మురికి. క్రుళ్ళు. కంపెత్తుతూన్న ఆ వాతావరణంనుంచి దూరంగా పారిపోవడానికి ఆ బాలుని మనస్సు తహతహలాడేది. ఎవరితోనైనా సరే. యెక్కడి కైనా సరే పోదామని సిద్ధపడేవాడు.

బూడిదరంగు యూనిఫారాలతో ఖైదీ గ్యాంగులు తరచుగా కషీరిన్‌ల యింటిముందునుంచి వెడుతూనే వుండేవి. పోలీసులమధ్య నడిపించి. వార్ఫుదగ్గర నిలబెట్టి. స్టీమరుమీది కెక్కించి. వాళ్ళందర్నీ యెక్కడికో తీసుకుపోయేవాళ్ళు. అలెగ్జీ "వాళ్ళలాగ వెళ్ళినా మేలేగదా!" అనుకొనేవాడు. ఈ కూపంలో వుండడంకంటె. చేతులకి సంకెళ్లువేసినా. పోలీసులు కాపలావున్నా. ఏమైనాసరే యెక్కడికేనా వెళ్లడమే మంచిదిగా తోచేది....

ఒకరోజున ఖైదీలగుంపు వీధిలోంచి వెడుతూంది. వారిలో ఒకడు చూడ్డానికే భయంవేసేలా వున్నాడు. నుదుటిమీద పెద్ద యెర్రటి గాయం; ఒక చెవి తెగిపోయి భయంకరంగా వుంది. అలెగ్జీ అతనివెంబడే ప్రక్క చప్టామీద నడుస్తూన్నాడు. హఠాత్తుగా ఆ ఖైదీ హుషార్‌గా కేకేసేడు:

"రా! అబ్బాయీ! రా! షికారు పోదాం రా!"

అలెగ్జీ అతనిదగ్గిరికి వెంటనే పరుగెత్తేడు. వార్డరే గనక తరిమి వెయ్యకుండా వుంటే ఆ రోజున వాళ్లతో వెళ్ళిపోయివాడే. ఎక్కడికో వెళ్ళిపోడం. మళ్ళీ తిరిగి రాకండా వెళ్ళిపోడం.- అదే అతని ఆవేదన.

ఇంటికి వెళ్లేక. బ్రతుకు అదేమాదిరిగా భారంగా సాగేది. మార్పు ఒక్కటే. కషీరిన్‌లు యిల్లు మారేరు. ఉస్పెన్‌స్కీ వీధిలోని జేగురు

రంగు యింట్లోంచి, పొలివాయా వీధిలోని పెద్దయింట్లోకి (దీంట్లో సారాయి వుంచేందుకు నేలమాళిగ కూడా వుండేది): దాంట్లోంచి మళ్ళీ కనత్‌నాయా వీధిలోకీ మారేరు. ఆ యిల్లు యెర్రటి గోడలతోనూ, నీలి రంగు తలుపులతోనూ వుండేది. అలెగ్జీకి చిరాకుగానూ, మందకొడిగానూ వుండేది. యీ భావాలనుంచి తప్పించుకోడానికి ఒక్కొక్కప్పుడు అలెగ్జీ మహా చిలిపిచేష్టలూ, అల్లరీ చేసేవాడు. ఇల్లెక్కి పొగగొట్టాల్లో యేదో చెత్త కుక్కేవాడు; పులుసులో యింట్లోని ఉప్పంతా గుమ్మరించేవాడు; పెద్ద గడియారంలోకి కాగితపు గొట్టంతో బూడిద ఊదేవాడు.

ఈ అల్లరి యెందుకు చేసేవాడు? ఏమో, తనకే తెలియదు!

ఒక్కొక్క సమయంలో తనచుట్టూవున్న యీ పశుత్వాన్ని చూసి అలెగ్జీలో దారుణమైన ద్వేషం రేకెత్తేది. ఒకసారి తన సవతితండ్రి తాగివచ్చి, తల్లిని చావబాది, క్రిందపడేసి గుండెల్లో తన్నుతూంటే బాలుడైన అలెగ్జీ చిన్న కత్తినితీసి అతనిపక్కలో పొడిచేసేడు.

అతని పదోయేటనే తల్లి చనిపోయింది. సవతితండ్రి తాగి, జూదం ఆడి సొమ్మంతా పోగొట్టుకున్నాడు; అతని నౌకరీకూడా ఊడింది. తాతగారు కూడా వ్యాపారంలో నష్టంవచ్చి, దివాలా తీసేడు. ఇక ఆబాలునికి తన రెక్కలమీదనే బ్రతకాల్సిన స్థితి వచ్చేసింది, పదోయేట.

పొట్టకూటికై ఒక జోళ్ళదుకాణంలో నౌకరీకి కుదిరేడు. అక్కడ కూడా అలెగ్జీ చుట్టూ పశుత్వాన్నీ, రాక్షసత్వాన్నీ చూడక తప్పలేదు. యజమాని పోర్ఖునోవ్ యెప్పుడూ ఆడవాళ్ళనిగూర్చి అసహ్యకరమైన కథలు చెపుతూ, బూతులపంచాంగం విప్పుతూండేవాడు; గుమాస్తా దబాయిస్తూ, నిరంతరం బాధిస్తూనే వుండేవాడు; సాషా,- యితడూ కషీరిన్‌ల పిల్లవాడే,- బూట్లలో సూదులు గుచ్చుతూండేవాడు: ఎందుకో తెలుసా? జోళ్లు తుడిచి శుభ్రపరచడం అలెగ్జీ పనుల్లో ఒకటి జోళ్ళు తుడిచే

టప్పుడు చేతుల్లో గుచ్చుకోవాలనే వాడి పని చేసేవాడు. ఈ అకారణ శత్రుత్వానికి ఆ బాలుడు ఖేదపడిపోయేవాడు.

ఒకరోజున మంచు కురుస్తూంది. వీధుల్లో జనసంచారం అంతగా లేదు అలెగ్జీ కౌంటరు వెనక నిల్చుని, కిటికీలోంచి బైటికి చూస్తూ న్నాడు. మంచునీటి ప్రవాహల్లోంచి గుర్రాలు, అప్పుడప్పుడు కాళ్లీడ్చు కుంటూ, మెల్లిగా నడుస్తూన్నాయి. దగ్గరలో యెక్కడో చెర్చిలోంచి దిమ్ముగా వినిపిస్తూంది, ఘంటారావం. యజమాని అడుసుకళ్ళతో, మస కగా చూస్తూన్నాడు. అలెగ్జీకి అక్కడపనిచేయడం దుస్సహమైతోచింది. నౌకర్లని పని మానిపించడానికి అస్తమానూ యేదో నెపం దొరికే యజ మానికి, తన విషయంలో కూడా యేదో కారణం దొరికితే బాగుండు ననిపించేది. కాని, అలెగ్జీ కోరిక యెంతకీ నెరవేరలేదు. చివరికి యజ మానిద్వారా గాకపోయినా పనిమానే సంఘటన జరగనే జరిగింది. ఒక రోజున యేదో కాచుతూ, గిన్నె తిరగబడి అతని చేతులు రెండూ బాగా కాలి, తొడుగూడిపోయింది. హాస్పిటలుకి పంపించేరు. నయమయేక అలెగ్జీ మళ్లీ జోళ్ళదుకాణానికి బోలేదు.

తరువాత అలెగ్జీ అమ్మమ్మకు బంధువైన సెర్జియేవ్ అనే డ్రాఫ్ట్సమన్ దగ్గర పని నేర్చుకోడానికి కుదిరేదు. ఇక్కడి పని, జోళ్ళషాపులోకంటె కనాకష్టమైపోయింది. పనిలోని మెలుకువలేమీ అతడు చెప్పేవాడేగాదు. కట్టెలు కొట్టడం, మొయ్యడం, అంట్లుతోమడం, యిల్లు కడగడం, తుడ వడం, కూరలు, కిరాణాసరుకులూ తేవడం, కబుర్లూ - ఉత్తరాలూ మొయ్యడం,- యిల్లాంటిపనులతో అతని ప్రాణాల్నే తినేసేవాళ్లు; అయినా అలెగ్జీ యిందుకేమీ బాధపడలేదు. యేపని చెప్పినా బహు ఓరిమితో మన స్ఫూర్తిగానే చేసేవాడు. అయినా డ్రాఫ్ట్సమన్ భార్యా, అత్తగారూ కూడా ఆ బాలుని వేధించుకుతినడమే గాక తిట్టడం, చావబాదటం నిత్యకృత్యమై పోయింది యాజమాన్యం, బాంధవ్యం,- యీ రెండుహక్కుల్నీ పురస్క

రించుకుని. వాళ్లు అతని బ్రతుకు దుర్భరం చేసేవాళ్ళు. జోళ్ళషాపులో ఐతే యజమాని మానిపిస్తాడా? అని యెదురుచూసేడు గాని యిక్కడ అటువంటి భ్రమ పెట్టుకోకండా "శీఘ్రబుద్ధిః పలాయనం" అనుకుని గాదెక్రింది యెలకలా చల్లగా జారిపోయేడు.

చాల రోజులవరకూ నొవోగొరోడ్ వీధుల్లో రికామీగా తిరుగుతూ, పడవలరేవుల్లోనూ, రేవు కూలీల్లోనూ ద్రిమ్మరుతూండేవాడు. కొన్ని వారాలపాటు తిరిగేక 'డోబ్రీ' అనే స్టీమ్‌లాంచిమీద పాత్రలు కడిగే పనికి కుదిరేడు. అదొక "ఖైదు ఓడ". ఖైదీ గ్యాంగుల్ని జేరవేసే పడవల్ని అటూయిటూ లాక్కెళ్ళడమే దీనిపని. అలెగ్జికి ఖైదీలపనే బాగుందని పించేది. తెల్లవారగట్ల ఆరు మొదలుకొని అర్ధరాత్రివరకూ తీరికేవుండేది గాదు. కుండలూ, మూకుళ్లూ, కంచాలూ, గిన్నెలూ, గ్లాసులూ, చాకులూ, ఫోర్కులు కడగడం, శుభ్రం చేయడం,- ఊపిరి తిరిగేదేకాదు.

అయినా, జోళ్ళషాపు, డ్రాఫ్టుమన్ ఆఫీసులో నౌకరీలకంటె ఈపనే మేలనిపించేది. అలెగ్జికి. ఎదురుగా విశాలమైన ప్రశాంత నదీప్రవాహం; యెటుచూసినా చీకటిగుంపుల్లా నల్లని అడవులూ; విశాలమైన పచ్చికబీళ్లూ పచ్చని చేలూ; అక్కడక్కడ బొమ్మరిళ్లలాగ చెదరివున్న పల్లెటూళ్లూ, చిన్న పట్టణాలూ; ప్రకృతి సౌందర్యం 'నన్ను చూసేవా' అంటూ యెట్టయెదుటే నృత్యంచేస్తూన్నట్లుండేది. తను స్వతంత్రంగా అడవుల్లో అమ్మమ్మతో కూడాతిరిగే దినాలు అలెగ్జికి జ్ఞాపకంవచ్చేవి. తన చిన్నతనంలో వేసవికాలంలో అమ్మమ్మతో అడవికి పోయి, పుట్టకొక్కులూ, మూలికలూ యేరడం, ఉడుతలు దాచిన కాయలకోసం వాటి గూళ్లువెతకడం,- యివన్నీ నేర్చుకునేవాడు. అడవుల్లో యీ సంచారమంటే అలెగ్జీ కెంతో ఆహ్లాదం! తిరిగి ఆడవుల్లో యెప్పుడు స్వేచ్ఛగా తిరుగగలనా యని అతడు ఓడమీదనుంచే అనిమిషనేత్రుడై చూస్తూండేవాడు.

ఈ ఓడమీదే "శూర్కీ" అనే వంటవాడుండేవాడు. అతడొకప్పుడు మిలిటరీ గార్డ్సులో నాన్-కమీషన్డ్ ఆఫీసరుగా వుండేవాడు. ఇనప గొలుసులతో బిగించిన కాబిన్ ట్రంకు తెరిచి, అందులోంచి రకరకాల పుస్తకాలు తీసి యిస్తూండేవాడు. వాటిపేర్లు మహా తమాషాగా వుండేవి; ఓమిరేవ్ నీతిబోధలు; సిపాయి జీవితఘట్టాలు; లార్డ్ సిడెన్‌గల్లీ జాబులు.- యిత్యాది. ఏదేలాగున్నా అలెగ్జీకి మొదటి గురువు ఓడమీది వంటపుట్టెనని ఒప్పుకోవాలి. ఎందుకంటే పుస్తకాలంటే ప్రీతికలిగించిం దాతడే.

కొద్దికాలంలోనే ఓడమీది నౌకరీకి నీళ్లువదలి, స్వతంత్రమైన మరో వృత్తిలోకి దిగేడు. వల, బోనులు, వుచ్చులు వగైరాలన్నీ కొనుక్కుని, పంజరాలు కూడా తయారుచేసేడు, అలెగ్జీ, బోయవానివలె తయారై, అడవుల్లో మాటులొగ్గుతూ, పిల్లిలా నడుస్తూ, వ్యాధ ధర్మాన్ని నెరవేరుస్తూండేవాడు. బంగారు పిచికలు, మార్టిన్‌లు, మైనాలు, తిత్తిరిలు.. రకరకాల పిట్టల్ని పట్టుకుని, పంజరాల్లో బెట్టి, అమ్మమ్మచేత బజారులో అమ్మించేవాడు. ఈ విధంగా కొంతకాలం అలెగ్జీ, అమ్మమ్మ జీవించగలిగేరు.

వేసవికాలం వెళ్ళిపోతూంది. పక్షులన్నీ దక్షిణానికి యెగిరిపోయేయి. అలెగ్జీ తిరిగి పట్టణంలోనే పని చూచుకోవాల్సవచ్చింది. ఎందరిదగ్గరో నౌకరీచేస్తూ, తన స్వేచ్ఛను పోగొట్టుకొన్నా, అమ్మమ్మను వదలివుండడం అతనికి మరీ కష్టంగా వుండేది. ఒక్కటిగిని, కొన్ని మాసాలవరకూ ప్రేమాస్పదురాలైన ఆ వృద్ధురాల్ని చూడడమే పడేదిగా దాతనికి.

అలెగ్జీ జీవితంలో యిప్పుడు మరొక ఊత దొరికింది. అదే గ్రంధపఠనం.

పుస్తకాలయం దాతనికింత ఆసక్తి, సుఖమూ యెట్లాకలిగేయి? దానికి కథ చాలావుంది. మొదట్లో తాత, చెర్చినుంచి పాతపుస్తకాలు తెచ్చి,

చదివించేవాడు. తర్వాత తల్లి 'ఐహిక' గ్రంధపఠనం చేయించింది. చిన్నతనంలో యీ విద్యాభ్యసనమంతా అతనిలోనికి బెదిరింపులు, తిట్లు, గుద్దులు, బెత్తాలు,- వీటి సాయంతోనే జొప్పించబడింది. ఇదేమంత సుఖదాయకమైనదీ గాదు; జోళ్ళషాపులో, డ్రాఫ్ట్సుమన్ ఆఫీసులో, యితర యజమానుల దగ్గర పొందిన అనుభవంకంటె యిదేమీ ఆహ్లాదకర మైనదీ గాదు.

అలెగ్జీ వెళ్ళిన స్కూలులో పిల్లలు యితన్ని దుయ్యబట్టుకుని, యేడిపించేసేవాళ్ళు— పీలికలవాడు, బికారీ,- యిత్యాది పేర్లుపెట్టి పిలుస్తూ వెంటబడేవారు; యింక మేష్టారుకూడా గీసిన కందగడ్డలా మొఖం పెట్టుకుని, యెప్పుడూ ధుమధుమ లాడుతూనే వుండేవాడు. అతనికీ అలెగ్జీ మీదే కన్నుండేది. అస్తమానూ యితన్నే పిలిచి, యేదో నెపంపెట్టి గూబలు కదలేస్తూనే వుండేవాడు.

ఆ గండాలన్నీ గడిచి, ప్రస్తుతం పుస్తకప్రపంచంలో బడినపు డాతనికిందులో యేదో మహత్వం, ఆనందం, సుఖం కనిపించసాగింది. అతడు సంపాదించిన మొదటిపుస్తకం 'హన్స్ ఆంధర్సన్' వ్రాసిన "అద్భుత కథలు". అందులో 'నైటింగేల్' అనే కథ తీసేడు. మొదటివాక్యం నుంచే యెంతో తమాషాగా వుందనిపించింది.

"చైనాలోని ప్రజలందరూ చైనీయులే; అక్కడి చక్రవర్తి కూడా చైనీయుడే!"

అహఁ! అల్లాగేం? ఆశ్చర్యమే!

ఆ పుస్తకం అలెగ్జీకి యేదో గాలివాటుగా దొరికిందే గాని అతను తెలిసి యెంచుకున్నది గాదు. చేతికి దొరికిన పుస్తకమల్లా చదవడం ఆరంభించేడు. ఎవరేనా మనసుకుదిరి యిచ్చినవీ, పాతపుస్తకాలషాపుల్లో కొన్నవీ,- ఏవేవో చదివేసేవాడు!

ఆతడు తన జీవితంలో యెన్నితరహాల మనుష్య వ్యక్తుల్ని కలుసుకున్నాడో, అన్నిరకాల పుస్తకాల్ని పసితనంనుంచీ చదివేవాడు.

పుస్తకాలు యెవరిదగ్గర దొరికితే వాళ్ళదగ్గర- స్కూలు పిల్లలు, భజంత్రీ కుర్రాళ్ళూ, దుకాణాలవాళ్ళూ, బొమ్మలవాళ్ళూ-- యీ బాపతు జనంనుంచి, రష్యన్ భాషలోకి అనువదించబడిన, వ్రాయబడిన పుస్తకాలు పుచ్చుకుని చదివేసేవాడు. ఈ నానాగోత్ర వాఙ్మయంలోనే అనేక ఉత్కృష్టగ్రంధాలుకూడా అలెగ్జీ చదివేడు. గొప్ప ఫ్రెంచి రచయితలు, బాల్జాక్, ఫ్లాబర్ట్ మొదలైనవాళ్ళ గ్రంధాలీ రకంగానే బాల అలెగ్జీ చదివేసేడు.

ఒక ఆదివారంరోజున యిల్లెక్కి జాగ్రతగా యెవరికీ కనపడకుండా దాగుకొని, ఫ్లాబర్ట్ రచించిన "వంటకత్తె" కధ చదువుతూన్నాడు. అందులో ఒకతె తన కష్టజీవితాన్ని యెల్లాంటి ఆశలూ, ఆశయాలూ లేకండానే యెల్లాగడిపిందో అతి సహజంగా వర్ణించబడి వుంది. "సాధారణమైన మాటలే, చిన్నవాక్యాలుగా కూర్చబడితే, వాటిల్లోకి యింత అసాధారణ సౌందర్యం, అలౌకిక ఆకర్షణా యెట్లావచ్చినాయి చెప్మా" అనుకుంటాడు, అలెగ్జీ. ఇదేదో గొప్ప మాయగానే వుందని నిశ్చయించుకున్నాడు, చివరకి.

ఎన్నోసార్లు పుస్తకం పట్టుకునే దీపంవెలుతురులో కూర్చుని, పంక్తుల్లోకి శూన్యదృష్టులతో చూస్తూనే, చదవకుండా వుండిపోయేవాడు. ఆ పుస్తకంలోని కీ ఆకర్షణ రావటానికి ఆ పంక్తులమధ్య నేమైనావుందేమో చదవడానికి యత్నిస్తున్నాడా ? అనేటట్లుండేది. అహఁ ! అటువంటిదేం లేదు. ఆ రహస్యం అలెగ్జీకి అప్పుడు దొరకనే లేదు.

క్రమంగా కొత్తతరహా పుస్తకాలు చదువుతూ వచ్చేడు. వంటవాళ్లూ, దుకాణదారులూ, భజంత్రీలూ, మేళగాండ్రూ చదివే గ్రంధాల స్థానంలోకి నిజమైన సాహిత్యం,- పుష్కిన్, గొగోల్, తుర్జనేవ్, లెర్మాం

టోవ్ మొదలైన అతిరధ మహారధుల రచనలు మహా ఆప్యాయంగా, ప్రేమతో చదివేవాడు. నిజమైన సాహిత్యంయందు ప్రీతిని అలెగ్జీ బహు చిన్నతనంలోనే అభివృద్ధి చేసుకున్నాడు.

ఆ రోజుల్లోనే పీటర్స్‌బర్గ్‌నుంచి వెలువడే ఒక చమత్కార పత్రికలో అలెగ్జీ ఒక చిన్న కధ చదివేడు. అది యెంతో ఆకర్షకంగానూ, ఆహ్లాద కరంగానూ వుంది. రాసినదెవరా ? అని చూస్తే, "అంతోషా చెఖోంటీ" అని లేఖినీ నామం (పెన్-నేమ్) మాత్రం వుంది. తన నేస్తుడైన విద్యార్థి నొకణ్ణి అడిగేడు 'యీ రచయిత యెవరా ?' అని. అతడూ మహా బడాయిగా "ఆ ! యెందుకురా, యీ హాస్య పత్రికలూ గట్రా చదివి, కాలం వృధాచేస్తావు ? అల్లాంటి చెత్త చదవకపోతే యేమైనా ఘట్టి పుస్త కాలు చదవరాదట్రా !" అన్నాడుట.

ఈ 'చెఖోంటీ'యే అప్పటికింకా ప్రఖ్యాతినొందని 'చెఖోవ్' ! అప్పటి నుంచీ యీ "చెఖోంటీ" రచనలని, అలెగ్జీ మహాసక్తితో చదివేవాడు. తర్వాత "గోర్కీ", "చెఖోవ్"లు ప్రాణస్నేహితులుగా అయేరు.

జైల్లో ఊచలవెనక కూర్చున్న ఖైదీలకు బైట పక్షుల సంగీతా లెంత ఆకర్షకంగానూ, ఆహ్లాదకరంగానూ ఉంటాయో, అంతటి ఆకర్షణీయంగా, ఆహ్లాదకరంగా వుండేవి పుస్తకాలు అలెగ్జీకి.

ఒకసారోపత్రికలో "ఫారడే" యొక్క జీవితాన్ని గూర్చి చదివేడు. సాధారణ కార్మికుని స్థితినుంచి అతడొక గొప్ప శాస్త్రజ్ఞుడు కాగల్గేడు ! ఎంత ఆశ్చర్యం ! ఇది నమ్మతగినదిగా కనిపించలేదు, అలెగ్జీకి. కార్మికు లుగా వుండి అంతటి ప్రఖ్యాతిగాంచిన వాళ్లు యింకా యెవరేనా వున్నారా? ఈ ప్రశ్న అతని మనస్సులో మాటిమాటికీ బైలుదేరేది. అన్వేషణ ప్రారంభించేడు. అతినికి పత్రికల్లో మరేమీ యీ విషయమైన భోగట్టా దొరకనేలేదు. చివర కెవరో చెప్పేరట. లోకోమోటివ్ (రైలు) యింజ నును కనిపెట్టిన 'స్టీవెన్‌సన్' కూడా కార్మికుడుగా తన జీవితాన్ని ప్రారం

భించినవాడే నని! అలెగ్జికి కావల్సింది పేరు కీర్తులని భ్రమపడరాదు సుమా! అతడు కేవలం మానవుని కర్షమైన జీవితం గడపాలనే వాంఛించినది

తనకు జీవిత ఆకర్షణ నాటకరంగంమీద వుందని అతడు కొంత కాలం అనుకుని, ఆ దారినికూడా పడ్డాడు. అతడు మొదటిసారి నాటకాన్ని ఒక తిరునాళ్ళలో యాదృచ్ఛికంగా చూసేడు. ఆ నాడు- షెరిడిన్ మహా కవి రచించిన "గొలోవ్లియోవ్ కుటుంబం" అనే నాటకాన్ని, ఓ పెద్ద యెర్రటి హాలులో ఆడుతూన్నారు. సుప్రసిద్ధ నటకుడు "అంద్రియేవ్ బుర్లాక్" అనునతడు "జూడాస్ గొలోవ్లియోవ్" పాత్రను ధరించేడు. నాటకాన్ని చూస్తుంటే అలెగ్జికి కన్నీరు ధారాప్రవాహంగా వచ్చేస్తూంది. ఎప్పటికప్పుడు వెళ్ళి "జూడాస్"ను పట్టుకుని పీక నులిమెయ్యాలనేటంతటి ద్వేషం పుట్టుకొచ్చేది. నాటకరంగానికి మానవ హృదయంమీదెంత ప్రభావమున్నదీ, అప్పుడే తెలిసికొన్నాడు అలెగ్జీ.

నాటకం ఐపోయేక ఒంటరిగా రాత్రంతా వీధుల్లో తిరుగుతూవుంటే- ఒక త్రాగుబోతు అలెగ్జిని పనిమాలా పిలిచి, నెత్తిమీద కొట్టేడు. కాని, నాటకధ్యాసలో మునిగివున్న అలెగ్జీ అదేమీ పరిగణించేస్థితిలోనే లేడు. తానుకూడా నాటకరంగంమీదికి వెడితే! అతనిలో తీవ్రమైన కోరిక పుట్టింది. ప్రయత్నం యించుమించు ఫలించిందే. థియేటరులో నౌకరీ సంపాదించేడు. నటకుడుగాకాదు సుమండీ! సూపర్‌గా అంటే మాట్లాడ నక్కర్లేకండా ఊరికేవచ్చి నిల్చునిపోయే (ఎక్స్ట్రా) అప్రధానపాత్రధారిగా చేరేడు.

అలెగ్జీ నటించిన మొదటినాటకం "క్రిస్టోఫర్ కొలంబస్" లేక "అమెరికాను కనిపెట్టుట". అందులో అన్నీ పాటలూ, నాట్యాలూను. అలెగ్జికి రెడ్ యిండియన్ పాత్ర యిచ్చేరు. అతను చేయవలసినదల్లా ఒక కర్ర బల్లెంతో స్పానియార్డులను పొట్టలో సరదాగా పొడుస్తూండటం. తాను

చివరకో కత్తితో పొడవబడినపుడు క్రింద పడిపోవడం: కాని, తన్ను కత్తితో 'పొడిచి'నప్పుడు అలెగ్జీ క్రిందపడాలనే విషయమే మరిచి పోయేడు!

అలెగ్జీ నటకుడు కాలేదు. చూచేవారికి నాటకాలెంత ఆకర్షవంతంగా వున్నా, నటకుల జీవితాలుమాత్రం ఎంతో విరసంగానూ, విర్జీవంగానూ వుండేవి. ఒక క్షణంముందే తన ప్రాణేశ్వరిముందు మోకరిల్లిన కధా నాయకుడే, తెరవెనక నాయికాపాత్రధారిణితో "ఏమిటే! ఏమిటీ వెధ వాలస్యం! ఊరిఖే వళ్ళంతా గుండుసూదులు యెంతసేపు గుచ్చుకుం టావే?" అని అరిచేవాడు.

కూతురు దురవస్థకి కన్నీరువిడుస్తూన్న ప్రియ జనకుడే "ఓసిమొద్దా! నీ పోర్షన్ మళ్ళీ మరిచిపోయావుటే?" అని కొట్టబోయేవాడు, తెర వెనక!

ఇంక రిహార్సల్సులో సూపర్లని బానిసలుగానే చూసేవాడు, స్టేజి డైర క్టరు. అలెగ్జీ నాతడు "కొరమాలిన కొరివీ" "పాపిష్టి వెధవా" "అనా కారీ" అని తిడుతూండేవాడు. ప్రేక్షకులు కూర్చునేది అగాధమైన చీకటి సొరంగంలా వుండేది. చివరకి తన ఆశలు భగ్నమై అలెగ్జీ, నాటక రంగాన్ని వదిలేశాడు.

మళ్ళీ చదువు సాగించాలనుకున్నాడు.

ఒక విద్యార్థిస్నేహితు డాతణ్ణి, కాజాన్ నగరం వెళ్ళమన్నాడు. అక్కడ యూనివర్సిటీ వుందికూడాను. అంచేత జన్మస్థానాన్ని వదలి, అలెగ్జీ, కాజాన్ వెళ్ళిపోయేడు. చీకటికొంపలు, అంతకంటే చీకటిగా వున్న మనుష్యులు వున్న ఆ నొవోగొరోడ్‌ను వదలడం అంటే అలెగ్జీకి ఏమీ పరివేదన కలగలేదు.

అప్పటికి అలెగ్జీకి పదిహేను సంవత్సరాలుంటాయి.

21

## 2 వ ప్రకరణము

# కా జా న్ లో

### 1. కుతార్కికుడు

"ఎవరేనా కనక 'వెళ్ళిచదువుకో. కాని ఒక్కషరతు. ప్రతిఆదివారం నికోలయేవ్‌స్కీ స్క్వేర్‌లో నిన్ను బహిరంగంగా బెత్తాలుపుచ్చుకుని చావబాదుతాను' అనిఅన్నా కాని నేను చదువుకునేందుకు సిద్ధపడే వాణ్ణే!" అన్నాడు గోర్కీ 'నా జ్ఞాపకాలు' అనే గ్రంథంలో.

అతనికెంత అభిలాషవున్నా చదువుకోడం విషయంలో ఏమీ కార్య కారి కాలేదు. కాజాన్‌కి వచ్చేక తెలిసిందా బాలునికి, తలదాచుకునే దిక్కునాలేని నొవోగొరోద్ బీదబాలునికి ద్రిమ్మరిగా వుండడానికేతప్ప, యూనివర్సిటీలో చదువుకొనే యోగ్యతలేదని!

ఆ బాలుని నుదుటివ్రాత మరోలా వుంది. పట్టణం బైటనున్న సెల్లార్‌లు (నేలలోపల సారాయం జాగ్రతచేసేందుకు కట్టే కొట్లు), నదీ తీరానవున్న వార్ఫ్‌లు, రహస్య రాజకీయసంఘాలు, దేశద్రిమ్మరులతో సాంగత్యం, పోలీసులు, విప్లకారులుతో సాన్నిహిత్యం,- యీ చదువు లోకి దిగేడు. అదే అతనికి యూనివర్సిటీ. ఈయూనివర్సిటీలోని చదువు నాతడు తన జీవితంలో యెప్పుడూ మరిచిపోలేదు!

నిరంజనమైన ఓ పోరంబోకలో కూలిపోగా మిగిలిన శిధిలగృ హంలో నేలక్రింది అంతస్థులో మకాం; ఉస్థ్యా వార్ఫులమీద రోజుకో యిరవై కోపెక్కుల కూలిమీద పని; అతని కొత్త నేస్తు లెవరంటే, వార్ఫులమీద పాతకాపులుగా ఉండే రకంవారీసరుకు,-రేవుకూలీలు, జేబు దొంగలు, బిచ్చగాళ్లు - యింకా 'అద్దాలమేడ'లో నివసించే అనామక అవర్ణనీయవ్యక్తులంతాను. అతనుండే యింటికీ పేరు యెందుకో పెట్టడం

జరిగిపోయింది. బహుశా అక్కడి కిటికీఅద్దాల్లో పగలని దొకటీలేదనో, మరెందుకో చెప్పలేము.

కాజాన్‌లోని బికారీలందరికీ 'అద్దాలమేడ' స్వగృహం. ఇక్కడ మనుష్యుల్లో జాతిమతవర్గభేదాలేమీ లేవు. సర్వం జగన్నాధం. యూనివర్సిటీ నుంచి తరుమబడ్డ విద్యార్థి, పదేళ్ళు శిక్ష అనుభవించివచ్చి వీధుల్లో పీలికలు యేరేవానితోనూ, పూర్వాశ్రమంలో 'పశువుల డాక్టరు'గా వుండిన ప్రస్తుతపు బిచ్చగానితోను, ఓ రాష్ట్రగవర్నరు దగ్గర బట్లరుగా పనిచేసి ప్రస్తుతం ద్రిమ్మరిగావున్నవానితోనూ భుజాలు రాసుకుంటూ తిరుగుతాడు. భూతకాలంలో వాళ్ళ హోదాలు యెంత భిన్నంగావున్నా వాళ్ళ వర్తమాన అవస్థమాత్రం ఒకటే. ఆకలితో అసహ్యమైన జీవయాత్ర గడపడంలో వాళ్ళంతా సహచరులే.

అలెగ్జీకి వాళ్ళంతా చాల విచిత్రంగానూ, విడ్డూరంగానూ కనిపించేవాళ్లు. ఏదెట్లావున్నా చిన్నచిన్న కొంపల్లో కాలక్షేపంచేస్తూ, రెండేసి తాళాలువేసిన ట్రంకుపెట్టెలూ, అద్దాలకిటికీలూ, గోడకి రంగులకాగితాలూ అంటించుకుని వాటిని చూచి మురుస్తూ బ్రతుకుతూన్న జనంకంటె వీళ్లేనయం। వీళ్ళు తాగుతారు, యుద్ధాలుచేస్తారు. కాని వాళ్ళలో ఒకడూ లోభి, నీచుడు కాడు. తమ అదృష్టానికి ఖేదపడి దుఃఖించేవాడు ఒకడూకాదు. పైగా తమకంటె 'అధికుల' మనుకునేవాళ్ళని చూస్తే వాళ్ళంతా పరిహాసం చేసేవాళ్ళు.

చిత్రం, ఓమాటు వాళ్ళల్లో ఒకడు వేటాదేవాళ్ల బూట్లు యెత్తుకొచ్చాడు. వాటినిఅమ్మేసి అందరికీ పానీయాలు కొనేయాలని అంతా నిర్ణయించేరు. అంతలో మరోడు,-కొద్దిరోజులక్రిందటే పోలీసులచే చావదెబ్బలుతిని, జబ్బుగావున్నాడు,- "పైజోళ్ళని అమ్మి డ్రింకులు తాగుదాంకాని, మిగిలిన లోబూట్లు ఆవిద్యార్థికుర్రాడికిద్దాం. పాపం, వాడు

జోడులేకండానే తిరుగుతున్నాడు. శీతలం తగిలిందంటే మూటకట్టే స్తాడు. యింతకీ వాడుమాత్రం మనవాదేకదూ?" అన్నాడు.

వాళ్ళంతా పుస్తకాల్లో చదివిన సాహస ఔదార్య విక్రమార్కుల్లా అనిపించేవారు, అలెగ్జీకి!

సాహసులు, ఉదారులేగాక మరో తరహామనుష్యులతో కూడా అలెగ్జీ కీచోట పరిచయం కలిగింది. దాని ప్రాముఖ్యత యెంతో వుందని ఆతడు గుర్తించేడు. అట్టివాళ్ళని కలుసుకోవాలనే ఆదుర్దాతో కొత్త చోట్లకు వెళ్ళాలనీ, కొత్తవాళ్ళతో పరిచయం చేసుకోవాలనీ అలెగ్జీ ఆశించేవాడు.

అలెగ్జీ స్నేహితులు ఒకరోజున అతన్ని పట్టణం బైటవున్న ఒక చిల్లరదుకాణానికి తీసికొనిపోయేరు. దుకాణదారుడు ఆంద్రీ రెంకోవ్, విప్లవకారుడు. పంచదార, సబ్బులు, కొవ్వొత్తులు, మిఠాయిదినుసులు,- యివన్నీ అమ్మి, కాస్తోకూస్తో సంపాదించేవాడు. వెనక గదిలో ఓగోడని 'హెర్ట్‌జన్' పటం ఒకటి వ్రేలాడుతూంటుంది. దాని వెనకే రహస్యంగా యేర్పరచిన అలమరలో నిషిద్ధగ్రంధాలెన్నో దాచి వుంచేవాడు!

అంతవరకూ చదువుతున్న నవలలు, అద్భుతకధలు,- అబాపతంతా వదిలేసి, యిప్పుడు విప్లవకారులు, శాస్త్రజ్ఞులు, మహామేధావులు రచించిన గ్రంధాలు చదువనారంభించేడు, అలెగ్జీ.

ఆదుకాణం ద్వారానే రహస్యంగా పనిచేస్తున్న విద్యార్థి సంఘాలతో పరిచయం కలిగింది, ఆలెగ్జీకి. వీళ్ళంతా రాజకీయాలు, అర్ధశాస్త్రం, చరిత్ర గ్రంధాలు చదువుతూ, చర్చిస్తూ, వ్యాసాలు వ్రాసి చదువుతూ, రష్యాలో విప్లవంయొక్క గతినిగూర్చి తెగ చర్చించుతూండేవాళ్లు.

విప్లవకరయువకుల స్వాతంత్ర్య విశ్వవిద్యాలయం, యిది. బోధన ఉచితంకూడాను. అంచేత యిందులో అలెగ్జీకి చదువుకోడానికి నేర్చుకో

దానికీ అవకాశం దొరికింది. కాజాన్ ఇంపీరియల్ యూనివర్సిటీలో చేరినా, అలెగ్జీకి యింత పరిజ్ఞానం వచ్చివుండేదికాదు!

ఆడమ్ స్మిత్ సిద్ధాంతాలు, చెర్నిషేవ్‌స్కీ రచనలు, కారల్‌మార్క్స్ గ్రంధాలు-యివన్నీ అతనికిక్కడే 'కొట్టినపిండి' ఐపోయేయి. మార్క్స్ వ్రాసిన 'కాపిటల్' ఆరోజుల్లో చాలా అపురూపం. ఆగ్రంధం మొదటి ప్రకరణంయొక్క అనువాదం వ్రాతప్రతి.-అదే చేతులు మారుతుండేది!

ఒకసారి కాజాన్ పోలీసులు అలెగ్జీమకాం సోదాచేసేరు. అతని సామానులో ఒక నోటుబుక్కు దొరికింది. దానినిండా యేవేవో వ్రాతలే వున్నాయి. కాని, అదృష్టవశాత్తూ అందులో మార్క్సు పుస్తకాలనుంచి గాక అమాయికంగానూ, విరాపదగానూ కనిపించే మరో గ్రంధంలోంచి వ్రాసిన వున్నాయి. మిర్టోవ్ లవ్రోవ్ రచించిన "నీతులు, వాని చారిత్రక పరిణామం గూర్చిన అధునిక సిద్ధాంతాలు" అనే పుస్తకంలోంచి ఉద్ధృతాలే ఆ నోటుబుక్కులో వున్నాయి!

అయినా, యీ విషయాన్ని కూడా అధికారులకి పోలీసులు రిపోర్టు చేయడం మానలేదు. కట్టెలుకొట్టీ, మూటలుమోసీ, వార్ఫులమీద కూలీ-నాలీ చేసికొని, పొట్టపోసుకొనే యీమనిషి, శాస్త్రీయ గ్రంధాలు చదవడం, వాటిల్లోంచి నోట్సు రాసుకోవడమూ విచిత్రంగా లేదూ? అదీ వాళ్ళకి సమస్య! అనుమానం!

ఈ రహస్యసంఘాల్లో అలెగ్జీకి పేరు, 'కుతార్కికుడు.' అతని స్వరం దట్టంగా, బొంగురుగా, ఉచ్చారణ నిండుగా వుండేది. తనూ వ్యాసాలు చదువుతూ, తెల్లవారేదాకా వుండే చర్చల్లో చివరకంటా వదిలేవాడు కాడు. అతను వెలిబుచ్చే భావాలు కేవలం పుస్తకాల్లోనివేకాదు; పరిపక్వ భావాలే, అవి. మానవునిగూర్చి ఆయువకునిలో తోటివారికంటె యెక్కువ పరిచయజ్ఞానాలున్నాయి. అనుకోని, తీవ్రతరమైన వాదనలను తెచ్చి, తోటివారిని ఆశ్చర్యాద్భుతాల్లో ముంచేవాడు.

తనకు సలహాలిస్తూ, పాఠాలుచెప్తూన్న విద్యార్థినే ఒకసారి అలెగ్జీ మందలించేడు. "కామ్రేడ్ ! నువ్వు దారితప్పేవోయ్ !"

గ్రంథాల్లో చదివిన విషయాలు అతనికి పూర్వపరిచితములుగా కనిపించేవి. కార్మికుల బహుదీన నికృష్టస్థితిని గూర్చి, అర్థశాస్త్రజ్ఞులు, రాసేరు. అదంతా అలెగ్జీ స్వయంగా చూసినదే గాదూ ?

కాజాన్ నగరంలో వుంటూ బహుకష్టతరమైన జీవితాన్ని గడుపుతూ అమూల్యమైన అనుభవజ్ఞానాన్ని, ఏ యితర యూనివర్సిటీలోనూ లభించనిదాన్ని అతఁడు సంపాదించుకున్నాడు. *

## 2. బేకరీలో నౌకరీ

"కథంతా రొట్టెలపిండి వాసనేస్తూ, బిస్కట్ల సువాసనతో వుంది''

(చకోవ్, గోర్కీకి వ్రాసిన జాబు)

ఆకురాలు కాలం వచ్చింది. ఆఖరిస్టీమర్లుకూడా తమతమ శీతకాలపు మకాములకి వెళ్ళిపోయినాయి. వార్ఫులమీద జనసంచారమేలేదు. కూలిపనే దొరకడం మానేసింది. అలెగ్జీ, నిశ్శబ్దంగావున్న 'ఉస్ట్యా' వీధుల్లో తిరుగుతూ, శూన్యంగా వున్న గుడిసెలూ, చెక్కలుకొట్టి మూసేసిన భవనాలూ చూస్తూ, కడుపు మాడుతూ తిరుగుతున్నాడు. తలదాచుకోడానికి యెక్కడ చోటు దొరికితే అక్కడే. నదీతీరాన్న బోర్లా పడివున్న పాతపడవలక్రిందో, మరి అటువంటి చోట్లలోనో అతని కాశ్రయం. గృహవిహీనులైన బికారీలకి శీతాకాలమే గడ్డు. కాస్త తలదాచుకొనేందుకు వీలిచ్చేదైతే యేపనైనా చేయడానికి సిద్ధంగావున్నాడు అలెగ్జీ. చివరకి, సెమ్యోనోవ్ బిస్కట్ల కార్ఖానాలో నెలకి మూడు రూబుళ్ళ జీతంమీద 'బేకర్' (బిస్కట్లు కాల్చేవాడు) కి సాయం చేసేపనిలో కుదిరేడు.

* 'నా విశ్వవిద్యాలయాలు' అను గోర్కీ రచనను విశ్వసాహిత్యమాల త్వరలో వెలువరించబోతూంది.

ఆ బేకరీ ఒక యింటి క్రింది అంతస్థులో వుండేది. ఒకవైపు కిటికీలు వీధిసందులోనికి వున్నాయి. పనివాళ్లు రొట్టెలు, బిస్కట్లూ బిచ్చగాళ్ళకి యివ్వకుండా కిటికీలకి యినపవల వేయించేసేడు, యజమాని. ఈ గుహ్యంలో వుండి, రోజుకి పధ్నాలుగుగంటలు, పిండిని 'B' ఆకారంగల 'ప్రెట్‌జల్స్' గా చేస్తూండాలి. శరీరకష్టాని కాతడు చాల రోజులుగా అలవాటుపడి వున్నా కానీ, వయస్సుకి మించిన బలం, వంగుబాటూ వున్ననూ, సెమ్యోనోవ్ బేకరీలోని పని అతనికి రోజూ నడుం విరగ్గొట్టేసేది. ఒక్కొక్కప్పుడు, తాము పనిచేస్తూన్న మేడ మూడంతస్థులూ తన భుజాలమీదే మోస్తూన్నానా? అనిపించేటట్లుండీది.*

ఆ మేడలో నివసించేవాళ్ళంతా బేకరీ కార్మికుల్ని 'జైలుపక్షులు' అని పిలిచేవాళ్ళు. దానికి తగినట్లుగానే సెమ్యోనోవ్ కూడా తన పనివాళ్ళని, తిట్టడం, గదమడం, కొట్టడం, జుల్మానాలు వేయడం,-యీ రకంగా జైలులోలాగే శిక్షించేవాడు. యజమాని పశుప్రవర్తన చూస్తే అలెగ్జీకి ఆశ్చర్యం కలగలేదు. అతడు చిన్నవాడైనను యెంతో చూసే వున్నాడు. పనివాళ్ళు ఆ దౌర్జన్యాల నన్నింటినీ కిక్కురుమనకుండా సహించడం, పైగా ఒక్కొక్కపుడు యజమానిచేసే లుచ్ఛాపనులు వర్ణించుకుంటూ తన్మయులు కావడం,-యిదే అతనికి ఆశ్చర్యంగా వుండేది. అతనికి యజమానులంటే వేరభిప్రాయాలుండేవి. వాటిని నిర్భయంగా తోడి పనివాళ్ళ దగ్గర వెలిబుచ్చుతూనే వుండీవాడు.

ఒకసారి అలెగ్జీ మాటలు చాటునవుండి యజమాని విన్నాడు;

"ఏమిట్రా! వాకుడుగుల్లా! ప్రేలుతూన్నావు?" అంటూ, ఒక వారం వారం అంతా రొట్టెలపిండి మర్దించడంలో పెట్టేడు. అదే శిక్ష!

---

* ఇక్కడి జీవితాన్నిగూర్చి వ్రాసిన 'ఆరాధిత' అనే కథ గోర్కీరచనల్లో అత్యుత్తమమైనది. విశ్వసాహిత్యమాల ప్రచురించిన గోర్కీకథల్లో యీ కథ ముద్రితమైవుంది.

కాని, అలెగ్జికి తెలుసు, తన హక్కులకోసం నిలబడేదెట్లో. సెమ్యో నోవ్ తన నౌకర్లలోనే కొరకబడని, వంగని వాడొకడున్నాడని త్వర లోనే తెలుసుకున్నాడు. ఈ బరువు పని కూడా అతన్ని పుస్తకాలనుంచి దూరంగా వుంచలేకపోయింది. ఆ చెక్కా, యీ ముక్కాతో యేదో రకంగా ఓ పుస్తకాలస్టాండ్ తయారు చేసేడు. ప్రెట్జల్స్ చేస్తూనే ఓ ప్రక్క పుస్తకం చదువుకోడానికి వీలుగా వుండేటట్లు యేర్పాటు చేసేడు.

ఒకరోజు హఠాత్తుగా యజమాని లోపలికి వచ్చి, అలెగ్జి చదవడం చూసేడు. అది టాల్‌స్టాయ్ గ్రంథం. ఆ పుస్తకం లాక్కొని గాడి పొయ్యిలో పారేద్దామనుకున్నాడు. కాని, యింతలో అలెగ్జి అతని రెక్క దొరకబుచ్చుకుని, "నీకు దమ్ములుంటే పొయ్యిలో పడేయి, చూస్తా!" నన్నాడు. అతని స్వరం విన్నాడు, యజమాని, కిక్కురు మనకండా పుస్తకం యిచ్చేసి, బైటికి వెళ్ళిపోయేడు.

మరోసారి యజమాని బండబూతులు తిడుతూ, కార్మికుల్ని దబా యించేస్తున్నాడు. ఆ రోజు శృతిమించిపోయింది. ఎంతకీ వదలడం లేదు. అలెగ్జి తిన్నగా వెళ్ళి, అతని చెవి పుచ్చుకుని, గట్టిగా మెలి త్రిప్పుతూ, యీవలికి లాగేశాడు! తన్నెన్ని తిట్టినా కిక్కురుమనకుండా పడివుండడానికి అలవాటుపడివున్న కార్మికుల్ని చూచిన సెమ్యోనోవ్‌కి కోపంకంటె ఆశ్చర్యమే కలిగింది!

తనకోసమేగాక, స్నేహితుల కోసం కూడా అలెగ్జి పోరాడేవాడు. వాళ్ళకి ఆత్మవిశ్వాసం కలిగించడానికెంతో ప్రయత్నించేవాడు. తన పెట్టెలోని పుస్తకాలు చదివి, వినిపిస్తూండేవాడు. ఒక్కొక్కపుడు సెమ్యోనోవ్ 'జైలు పక్షులు'కి,-ఒక కవి గీతాల్లోంచి,-

"ఓ మానవుడా! నీ అదృష్టమెంత, ఉన్నతోన్నతమో, గుర్తిం చేవా?...., అనేది చదివి, వినిపించి, యజమానికి తామూ మానవులమే

ననేవి జ్ఞాపకం తెచ్చేలా ప్రవర్తించమని చెప్పేవాడు. వాళ్ళచేత సమ్మె చేయించడానికి యత్నించేడు, గాని చివరకి ఏమీ కాలేదు.

విప్లవకారులతో అతనికున్న స్నేహం మూలంగా సెమ్యోనోవ్ నౌకరీని త్రోసి పారేసే అవకాశం కలిగింది. అంద్రీదీరెంకోవ్ ఒకబేకరీ తెరిచేడు, దానిమీద వచ్చే లాభాలు విప్లవకార్యక్రమానికి వినియోగించ దానికి నిర్ణయం. అందులోకి పనివాళ్లు కావాల్సి వచ్చేరు. అలెగ్జీ అందుకు తగినవాడు. సెమ్యోనోవ్ పనికి సొద్దుకొట్టి, దీరెంకోవ్ బేకరీకి సామగ్రితో సహా వచ్చి చేరేడు. పిండి మర్దించడం, రొట్టెలుచేసి కాల్చి, విద్యార్థుల హోస్టల్సుకి సప్లైచేసేవాడు. రొట్టెల బుట్టల్లో తరచుగా విప్లవ సాహిత్యాని పెట్టుకుని వెళ్ళి, జాగ్రతగా అందించి, వచ్చేవాడు.

దీరెంకోవ్ బేకరీకి ప్రక్కనే పోలీసుస్టేషన్ వుంది. నీలిరంగు యూనిఫారాలతో పోలీసువాళ్ళు తరచుగా గోడదూకి, రొట్టెలకోసం వస్తూండేవాళ్ళు, బేకరీలోకి. బేకరీ నిఘాలో పడింది.

నికిఫోరిచ్ అనే ఓ పోలీసువాడోరోజున అలెగ్జీని ప్రశ్నించేడు. "నీకు చదవడం అంటే యిష్టమా? ఐతే, నీకేలాంటి పుస్తకాలు యెక్కువ యిష్టం?"

అతడు తరచుగా అలెగ్జీని తన సెంట్రీ బాక్సు దగ్గిరికి పిలిచి, బాతాఖానీ కొడుతూ, సంభాషణని విద్యార్థుల మీదికీ, ప్రజా శత్రువులమీదికీ త్రిప్పడానికి యత్నిస్తూండేవాడు.

"రష్యా అంతటికీ చక్రవర్తి, జార్ అలెగ్జాండర్ ది థర్డ్; ఆ సార్వభౌముల హృదయంనుంచి అదృశ్యతంతులు, సాలీడు దారాల్లాగా బైలుదేరి వ్యాపించి వున్నాయి. మంత్రులద్వారా, వివిధ రాష్ట్రాల గవర్నర్-జనరల్స్ ద్వారా, వారిసేవలో వున్న ఆఫీసర్లూ, సేవకులూ మొదలుకొని మామూలు సోల్జరుదాకా అందర్నీ కలిపి వుంచేదీ, బంధించి

వుంచేదీ యీ సూత్రమే. చక్రవర్తి రాజ్యాన్ని, ప్రజల్ని యెల్లవేళలా, యెల్లకాలానికీ విడదీయరానిదై బంధించివుంచుతూన్నది యీసాలిగూడే. తెలిసిందా ?"

అలెగ్జికి తెలిసింది. ఈసూత్రం యేమిటో యిప్పుడిప్పుడే అర్ధమవుతూంది. గూఢచారులు, ఆచోకీ తీసేవాళ్లూ,- యిదే అతంతువు! సూత్రం!

ఈ సాలిగూడుతో దేశం యావత్తూ కప్పబడి పోయి వుంది. తన గూఢచారి శాఖలద్వారా ప్రభుత్వం విప్లవకారుల్ని, రాజద్రోహుల్ని మూల మూలలనుంచి పైకీడ్చి తెచ్చి, జైళ్ళలోను, లేబరుక్యాంపుల్లోనూ, సైబీరియాలోనూ పడేసి వుంచుతూంది.

జరుగుతూన్న అన్యాయాల్ని చూసి, గ్రహించికూడా, వాటిని యెదిరించే సాహసంలేని పిరికిగుండె గలవాళ్ళని కూడా యీ వల, ఉచ్చు బిగించుతూనే వుంది. చుట్టూ యేదో ఖాళీప్రదేశం వున్నట్లూ, అది అంత కంతకి మూసుకొస్తూన్నట్లూ వుండేది. అలెగ్జీ కూడా తనచుట్టూ ఖాళీ జాగా మూసుకుపోతూన్నట్లు గ్రహించేడు.

ఇక్కడ పని పరిస్థితులు కొంత నయమైనా రోజంతా పని చేయవలసే వచ్చేది. ఒక్కొక్కపుడు రాత్రి ప్రొద్దుపోయేదాకా కూడా పని చేయాల్సి వచ్చేది. అలిసిపోసి, రాత్రి ఆలస్యంగా తన మకాంకి,- అదో చిన్న గుహ,-వచ్చి చిన్న నూనిదీపాన్ని దగ్గరగా తీసికొని, పండుకొని, ఆ నీలి వెలుతురులో చదువ నారంభించేవాడు.

ఈ రాత్రి గంటల్లోనే అలెగ్జీ యెంతో విజ్ఞానాన్ని కూడబెట్ట గలిగేడు. బోర్లించిన పెట్టెలొకటి టేబిల్‌గా, మరొకటి స్టూల్‌గా ఉపయోగించేవి. పుష్కిన్ గ్రంధం,- ఆ ప్రక్కనే శరీరశాస్త్రజ్ఞుడు శచినోవ్ వ్రాసిన "మెదడుయొక్క రిఫ్లెక్సులు",- అల్లాగే రకరకాల గ్రంధాలు వుండేవి.

ఏదో పుస్తకం పూర్తిచేసి మూసిపెట్టి, పడుకుని, యెక్కడో వుండి తీరిందని విశ్వసించే సుఖజీవనం,- సంస్కారపూరితం, ఆకర్షనీయం

ఐన సుఖజీవనాన్ని గూర్చి సుఖస్వప్నాలు గంటూండేవాడు. తన యీ ఆలోచన లెవరితోనైనా చెప్పుకోవాలనే తహతహ అతనిలో బైలు దేరింది.

ఒకమూల బెదురు, ఒకమూల ఆశతో విండిన హృదయంతో ఆలెగ్జీ, అందులోని ఆపదలను లక్ష్యపెట్టక, తనజీవితాన్ని, విప్లవంకోసం అర్పించిన జీవితాలతో జతచేసేడు.

రహస్య సంఘాల్లో యితనిని సానుభూతితోనే చూసేవాళ్లు. కాని, అందులో యేదో అనుగ్రహం ద్యోతకమవుతూండేది. సాధారణంగా విద్యావంతులు, స్వయంగా విజ్ఞానార్జన చేసినవారిని యిట్టి దృష్టితోనే చూస్తారుగదా!

"స్వయంగా విద్యాభ్యాసం గావించినవాడు.... సామాన్య ప్రజల్లోంచి వచ్చేడు!...."

అతన్ని చూసి ఆశ్చర్యపడేవాళ్ళు, అంతా. కాని అతనుచెప్పేదాన్ని నిర్లక్ష్యంగా వింటూ, పరిహాసాలు చేస్తూండేవాళ్ళు కూడా.

ఏదో విషయాన్నిగూర్చి మాట్లాడి, ఆఖరున సమీకరణ చేయబోతూంటే, యెవరో చటుక్కున అనేసేవాళ్ళు:

"ఆఁ! సరే! ముగించవోయ్!"

అంతే, దానితో ఆలెగ్జీ మానేసి, కూర్చునేవాడు.

ఎప్పుడూ ఒక నోటుపుస్తకం వుంచుకుని, దానిలో తాను చదివిన పుస్తకాల్లోంచి కొన్ని పేరాలు వ్రాసేవాడు. వాటిమధ్యలో తాను వ్రాసిన పద్యాలు, పాటలు వుంచేవాడు. తన స్నేహితుడు, అదృష్టహీనుడైన 'అనటోల్'ని గూర్చీ, పైన కురిసిన మంచు కరిగి, చిన్న కాలవగా క్రింది అంతస్థులోకి కారటాన్ని గూర్చీ, తాను ప్రేమించే వోల్గానదిని గూర్చీ పద్యాలు రచించేవాడు. కాని, ఆ పుస్తకం యెవరికీ చూపించేవాడు గాదు.

## 3. మకర్ జీవితంలో ఒక సంఘటన

"ఏమమ్మా, నువ్వు పన్నుసలుపుకి మందు యెరిగేవుంటావు. నిస్సందేహంగా. ఏమంటావు? కాని, నాకీ పన్నుసలుపు గుండెల్లో పట్టుకుంది. అది మహాచెడ్డ బాధ పెడుతూంది. ఐతేనేం, రెండుతులాల సీసం, బెర్ట్ హోల్డ్ ష్వార్ట్జ్ కనిపెట్టిన పళ్ళపొడి కాస్తా కలిస్తే, దాన్ని టక్కున కుదురుస్తుందిలే."

—హీన్‌రిష్ హీనీ.

అమ్మమ్మ చనిపోయినట్లు నొవోగొరోడ్‌నుంచి జాబు వచ్చింది. ఆమెతో, అతనికి అప్పులు అంతా కడతేరినట్లే.

ఆకురాలుకాలం వచ్చింది. వర్షం ఏకధారగా కురుస్తూంది. ప్రకృతంతా యేదో బాధపడుతూన్నట్లు. సాలిగూడు అల్లినట్లుగా వుంది. దీనిలోంచి విముక్తి వుందా? అనిపిస్తూంది.

అలెగ్జికి గతం అంతా తలపుకి వచ్చింది. ప్రేమాస్పదురాలైన అవ్వ. తామిద్దరూ అడవుల్లో తిరగడం. తన పుస్తకాలు.. జీవితంలోని సుఖమయ ఘట్టాలన్నీ అతని కళ్ళముందర గిరగిర తిరిగిపోతున్నాయి. అదేదో తన జీవితంలో స్వల్పమే కాని కష్టాలూ, కష్టదినాలూ మాత్రం అంతులేని యీ శీతకాలం లాగే తరగనివిగా తోస్తూన్నాయి.

హృదయం భారంగా తోచింది. ఏమీ తోచక ఫిడేలు వాయించడం నేర్చుకున్నాడు. రాత్రులు అలెగ్జి 'గుహ'నుంచి శోక, కరుణారస గీతాలు ఆలాపించబడుతూండేవి.

ఆ సంవత్సరం శీతకాలంలో చాలమంది ఆత్మహత్యలు చేసుకున్నారు. ఒక విద్యార్ధి తను చనిపోతూ "జీవితాన్నుంచి శీఘ్ర నిష్క్రమణ" అంటూ జాబువ్రాసేడు. అలెగ్జి స్నేహితులు కొందరుకూడా యీవిధంగా "శీఘ్ర నిష్క్రమణ" గావించేరు. దట్టమైన తలకట్టు, విచారమైన ముఖం గల ముజికాంత్‌స్కీ అనే విద్యార్ధి తన్నుతానే కాల్చుకున్నాడు....

1887 డిసెంబరు 14 తేదీని "వాల్గ్స్కీ - వెస్ట్నిక్" అనే కాజాణ పత్రిక యీ క్రింది ఉదంతాన్ని యిచ్చింది.

"డిసెంబరు 12 వ తేదీ సాయంత్రం 8 గంటలకు పోద్ల్యుఝునయా వీధిలో, కజాంకా నదీతీరాన, అలెగ్జీ మాగ్జిమోవిచ్ పెష్కోవ్ అనే నిఝునీ-నొవొగొరోడ్ వాస్తవ్యుడైన కార్మికుడు, ఆత్మహత్య గావించు కొనే ఉద్దేశ్యంతో యెడమరొమ్ములో రివాల్వరుతో కాల్చుకున్నాడు. అతణ్ణి వెంటనే హాస్పిటలుకు తీసుకుపోయేరు. డాక్టర్లు చాల ప్రమాద కరమైన గాయమన్నారు. అతనేవ్రాసి జేబులోవుంచుకున్న జాబునుబట్టి, యితరులెవరూ అతని మరణానికి కారకులు గారని తెలుస్తూంది."

తానెందుకు ఆత్మహత్యాప్రయత్నం చేసిందీ పాతిక సంవత్సరాల తర్వాత "మకర్ జీవితంలోని ఒక సంఘటన" అనే కథలో గోర్కీ వెల్లడి చేసేడు. ఇదొక సంఘటన మాత్రమే; కాని, చాల దుఃఖకర మైన సంఘటనమాత్రం ఔను. అతని పూర్వజీవితంలో యెంతటి కష్టాల్ని యెదుర్కొన్నదీ, యెంతటి దుఃఖాన్ని భరించిందీ తెలుపుట కిదొక దృష్టాంతంగా వుంటుంది.

ఆత్మహత్య చేసుకోవాలని నిశ్చయించుకుని, అలెగ్జీ బజారుకుపోయి మూడు రూబుళ్లుపెట్టి బరువైన 'తూలా' రివాల్వరు కొన్నాడు. ఆ రాత్రే నగరం బైటికిపోయి, నదీతీరాన కాల్చుకున్నాడు. మంచులో నదిగట్టునే పడివుండటాన్ని చూసి, యితన్ని హాస్పిటలుకి చేర్చేరు. అతని జేబులో యీ క్రిందిరీతిగా వ్రాసిన జాబు దొరికింది.

"నా మరణానికి పూచీఅంతా జర్మన్ కవి 'హీనీ'దే. 'గుండెల్లో పన్నుసలుపు'ను, దానికి మందును కనిపెట్టినదాతడే. ఇందుతో నా ప్యాస్ పోర్టును జతపరుస్తున్నాను. దీన్ని ప్రతేకంగా యిందుకోసం సంపాదిం చేను. నా శరీరాన్ని కోసి, యిటీవల నన్ను పట్టుకు వేధిస్తూన్న పిశాచం యేమిటో తేల్చండి."

"నా ప్యాస్‌పోర్టులో నేను అలెగ్జి పెష్కోవ్ నని వుంటుంది. కాని, దీనివల్ల తెలిసేదేమీ వుండదని తలుస్తాను."

డాక్టర్లు చెప్పడం, అతడు మూడురోజుల్లో చనిపోతాడని. మగతగా వున్న అలెగ్జీ మనస్సుకి యీ మాటలు వినిపించేయి.

"అహం! నేను చావను!" అన్నాడు.

డాక్టరుకి కోపంవచ్చింది. చావుకి సిద్ధంగావున్న ఆ మనిషికి మర్యాదగా మాట్లాడడం తెలియదని. చివరకి సంతృప్తిపడి ఊరుకున్నాడు.

చివరకి అతడు చావలేదు.

తిరిగి పూర్తిగా ఆరోగ్యవంతుడు కావడానికి చాలారోజులు పట్టింది. అతని స్నేహితులంతా వచ్చి చూసి వెడుతూండేవాళ్లు. సెమ్యోనోవ్ బేకరీ కార్మికులు కూడా వచ్చి చూసి, వెళ్లేవాళ్ళు. అన్నిటికంటె వాళ్ళ అమాయిక, ప్రేమపూరిత మృదువాక్యాలు అతనికి యెంతో ఆశను గొల్పేవిగా వుండేవి. అతని 'పన్నుసలుపు' తగ్గి, మళ్ళీ జీవించే వుండాలనే కోర్కె అతనిలో బలపడింది.

## 4. పల్లెటూరి దుకాణంలో

తిరిగి దీరెంకోవ్ బేకరీకి వెళ్లేడు. కాని యెంతోకాలం అక్కడ వుండలేదు.

మైకేల్ అంటోనోవిచ్ రోమస్ అనునొకడు తరుచుగా బేకరీకి వస్తూండేవాడు. ఇతని తండ్రి ఒక కమ్మరి; యితడు ఒకప్పుడు రైల్వే కార్మికుడు. విప్లవ కార్యక్రమాల్లో పాల్గొని పదేళ్లు ప్రవాసం అనుభవించి వచ్చేడు. అతణ్ణి చూస్తే సామాన్యుడుగా తోచడు. గొప్ప బల సాహసాలు, ధీరనిశ్చయం గల ప్రశాంత సౌమ్యమూర్తి, అతనిది.

రోమస్‌కి అలెగ్జీయం దభిమానం గలిగింది. అతనికి కొంత తరిఫీదు యిచ్చి, మార్గంచూపాలని నిశ్చయించుకుని, తనతో వుండమని ఆహ్వానించేడు. వోల్గా తీరాన్నే క్రాస్నోవిదోవో అనే గ్రామంలో అతడొక చిన్న దుకాణం పెట్టుకుని, కాలం గడుపుతూ, రైతుల్లో విప్లవ కార్యక్రమం సాగించుతూండేవాడు. అలెగ్జీ అతనితో బైలుదేరేడు.

క్రాస్నోవిదోవోలో వుండి, గ్రామీణ జీవితాన్ని మొట్టమొదటిసారిగా అలెగ్జీ చూసేడు. అక్కడ దినాలు గడవడం బహుదుస్తరం అవుతూ వచ్చిందాతనికి. హృదయంలో బరువుతో రోజులు నడుస్తూన్నాయి.

అతడు చదివిన పుస్తకాల్లో రైతులు అమాయికులుగానూ, ఆశతో జీవితాన్ని గడిపేవాళ్ళుగానూ వర్ణించబడ్డారు. కాని అతనికి కనిపించింది వేరు. వాళ్ళలో గ్రుడ్డిద్వేషాలు, దురాశలు, సంకుచితత్వం, క్రూరత్వం,- యివి స్పష్టంగా చూడగల్గేడు. ఒకసారి మూడు కుటుంబాలు కర్రలూ, రోకళ్లూ పుచ్చుకుని ఘోరంగా యుద్ధం చేసేరు. ఒక ముసలమ్మ చెయ్యి విరిగింది; ఒక పిల్లవాని బుర్ర రెండుచెక్కలై పోయింది. ఇంతా యెందుకో తెలుసా ? ఒక పగిలిన మట్టికుండ కోసం ! అట్లాటి అఘాయిత్యం జరగని వారమే వుండేదికాదు.

ఆ గ్రామంలోని ధనికులు, రోమస్‌నీ, అతని షాపునీ మింగేయాలని చూసేవాళ్లు. రోజూ సాయంత్రాలు షాపుదగ్గర చాలమంది చేరేవారు. అతన్ని వెక్కిరిస్తూ, తిడుతూండేవాళ్ళు.

అలెగ్జీ అక్కడికి వెళ్లేక ధనికరైతులు కార్యక్రమాన్ని జోరుచేసేరు. రోమస్‌తో స్నేహంగావుండే పల్లెవాడు 'ఇజాట్' అనేవాడు ఒకరోజున బుర్రపగిలి, చనిపోయి వోల్గానది ఒడ్డున పడివున్నాడు.

మరోరోజున యెవరో రోమస్‌నే తుపాకితో చాటునుంచి కాల్చేరు!

చివరకి రోమస్ యింట్లో నెగడి పెద్ద చప్పుడుతో భళ్ళున ప్రేలిపోయింది. ఏంచేసేరంటే, ఓ దుంగలో తుపాకి మందు కూరి సీల బిగించేసి మామూలుగానే వుంచేరు; దాన్ని రోమస్ వంటచెరుక్కు వెళ్ళినప్పుడు యిచ్చేటట్లు ఏర్పాటు చేసేరు. అది పొయిలో మండుతూన్నప్పుడు హఠాత్తుగా యీ ప్రేలుడు జరిగింది.

ఇల్లూ, దుకాణమూ కూడా ఓ రాత్రి అంటించేరు. అలెగ్జీ మిద్దె అటక మీద పండుకుని వున్నాడు. మంటలు చుట్టుముట్టేవరకూ అతనికేమీ తెలియదు. చటుక్కున గొఱ్ఱెతోలు కోటు కప్పుకుని, కిటికీతెరిచి, అందులోంచి బైటికి ఉరికేసి, ప్రాణాలు కాపాడుకున్నాడు, అలెగ్జీ.

రోమస్ యిల్లు భస్మమైపోయింది. అలెగ్జీ ఆశ్రయహీనుడై, మళ్ళీ తలదాచుకొనే చోటు వెతుక్కుంటూ బైలుదేరేడు.

క్రాస్నోవిదోవో గ్రామాన్ని వదలి, స్నేహితుడైన బరినోవ్‌తో కలిసి నది దిగువగా వున్న అస్ట్రఖాన్‌కి బైలుదేరేడు. కొంతదూరం స్టీమ్‌బోటు మీదా, మరికొంతదూరం నాటుపడవల్లో పనివాళ్ళుగా పనిచేస్తూనూ, చాల రోజులు ప్రయాణంచేసి, చివరకి కాస్పియన్ సముద్రం చేరుకున్నారు.

3 వ ప్రకరణము

# రైల్వే వాచ్ మన్‌గా

ఆస్ట్రఖాన్‌లో అత డెంతోకాలం వుండలేదు. త్వరలోనే తిరిగి కాజాన్ నగరానికి వచ్చేసేడు. కాస్పియన్ తీరాన్నుంచి వచ్చేక కాజాన్‌ను చూస్తే చాలా చలిగానూ, అనాకర్షణీయంగానూ కనిపిస్తూంది దీరెంకోవ్ షాపు మూసేసివుంది. పాత స్నేహితులు కూడా చాలమంది మాయమైపోయేరు. పట్టణంలో పనేమి దొరకలేదు. ప్రయత్నించి చివరకి దూరంలో దోబ్రింకా అనే ఒక చిన్న రైల్వేస్టేషనులో వాచ్‌మన్‌గా కొలువు కుదిరేడు.

చిన్నప్పుడు అనుకొనేవాడు, పట్టణాలు వదలి దూరంగా యెక్కడో అడివిలో యే గుడిసెలోనో, ఓ మారుమూల రైల్వేస్టేషన్‌లోనో వుండాలని. ఆ మనోరథం యిప్పటికి ఈడేరింది. కాని, యిక్కడా అతనికి జీవితంలో శాంతి కనుపించలేదు.

ప్రతిరాత్రీ, సాయంత్రం ఆరు మొదలు తెల్లవార 6 గంటలవరకూ చేతులో దుడ్డుకర్ర పుచ్చుకుని, సామాను షెడ్ల చుట్టూ తిరుగుతూ కాపలా కాస్తూండాలి. పిండిబస్తాలు మొదలైనవి చుట్టుప్రక్కల 'స్థానిత్సా' (యుక్రేయిన్ మండలంలోని కోసక్కుల గ్రామాలు) ల లోని కోసక్కులు యెత్తుకుపోకండా చూస్తుండాలి. కాని, వచ్చిన చిక్కేమిటంటే పిండి యెత్తుకుపోయేవాళ్ళు ఒక్క కోసక్కులే గాదు. బెల్లంముక్కని చూస్తే బ్రహ్మదేముడు మాత్రం ఊరుకుంటాడా ? స్టేషన్ మాస్టరుకూడా తనకి కావలసిన సరుకు 'తీసుకుంటూండడం' మామూలే. మిడిగుడ్లూ, నల్లటి గడ్డం, మాంచి ఒడ్డూ-పొడుగూ గలిగి చెయ్యెత్తుండేవాడేమో, స్టేషన్ మాష్టరును అంతా 'ఆఫ్రికన్' అని పిలిచేవాళ్లు. దక్షిణాన్నుంచీ, కాస్పియన్ ప్రాంతాన్నుంచీ సామానుతో వాగన్లు వెడుతూ స్టేషన్ ఆగినప్పు

దల్లా 'ఆఫ్రికన్' వాటిల్లో దూరి, దోపిడీ చేసేవాడు. వాటినిండా పరిష్యన్ పిల్కాలు, తూర్పుదేశాల తీపివంటకాల పార్శిళ్లు.- వగైరా లుంటాయని వాళ్ళకి బాగా తెలుసునాయెను! వాటినమ్మి, విందులూ, త్రాగుడుపార్టీలూ స్టేషన్ మాష్టర్ యేర్పాటుచేసేవాడు. అలెగ్జీని కూడా వాటిల్లోకి రమ్మని బలవంతంగా లాక్కుపోయేవాడు.

కాని, అదృష్టవశాత్తూ అలెగ్జీ అక్కడ కొద్ది నెలలు మాత్రమే పనిచేసేడు. 'ఆఫ్రికన్' దగ్గర వంటది పెద్ద 'అంబారీ' అంతమనిషి. అతనంత కళేబరమూనూ! ఆమెకీ అలెగ్జీకీ పడేదికాదు.

"ఉండవోయ్! కుర్రాఁడా! నీ మందకొడి వదలకొడతా!"

అంటూ ఆమె అతణ్ణి పగలల్లా యిళ్లూ వాకళ్లూ తుడిపించడం, కట్టెలు కొట్టి, నెగడి మండేలా చూస్తూండడం, టేబిల్-పాత్రలు శుభ్ర పరచడం,- యీమాదిరిగా యేదో పని చెపుతూనే వుండీది. రాత్రంతా 'డ్యూటీ' చేసివచ్చి, పగలు యీ పనులు చేయడం అంటేమాటలా? అలెగ్జీకి మండిపోయిూది.

రైల్వే హెడ్ ఆఫీసుకు అలెగ్జీ పిటిషన్ పంపించేడు. హెడ్డాఫీసు వాళ్ళు అసలు యీ విషయం చూసేవాళ్లేకాదు. ఎవరో వాచ్‌మన్, వంట దానిమీదో, మరో అనామతరువుమీదో ఫిర్యాదుచేస్తే. విచారించడానికేనా యేమిటి రైల్వేకంపెనీ, ఆఫీసంటూపెట్టింది? కాని, ఓ తమాషా జరిగింది. అలెగ్జీ పిటిషన్ వ్రాయడమే కొత్తపద్ధతిలో వ్రాసేడు. అదంతా పద్యాలతో అల్లి పంపేదేమో, విసిగిపోయివున్న రైల్వే ఆఫీసర్లకి కొంచెం వినోదకరంగా తోచి, 'పాపం! వీడి గొడవయేమిటో చూద్దాం!' అనిపించింది. అలెగ్జీని 'బోరిసోగ్లిబ్స్క్'కి బదిలీచేసి, బస్తాలు, టార్పాలిన్‌లూ కాపలాకాచే పనిలో పడేసేరు. ఈ చిన్న పట్టణంలోని జీవితం అతనికెంతో ఆశ్చర్యంగా కనిపించింది.

పట్టణానికి ఒక మేయరు, అతడు తరచుగా చెర్చిల్లో ప్రార్థనలూ, పూజలూ యేవో యేర్పాటు చేయిస్తూండేవాడు. ఎందుకో తెలుసా? ఏ నూతులోనో, గుంటలోనో వుందనుకొనే యే పిశాచాన్నో ఉచ్చాటన చేయించడానికట! స్థానిక పాఠశాలలోని ఉపాధ్యాయుడొకడు ప్రతి శని వారమూ వాళీగా భార్యను లాక్కెళ్లి పబ్లిక్ బాత్‌హౌస్‌లో (ప్రజలంతా వెళ్ళి స్నానాలుచేసే పెద్దయిల్లు) బెత్తాలు తీసికొని చావకొడు తూండేవాడు.

ఆ చెర్చి ప్రార్థనలుగాని, యీ బాత్‌హౌస్ బాదడాలు గాని ఆ వూరి ప్రజలికి ఆశ్చర్యాన్నిగాని, అసహ్యాన్నిగాని కలిగించేవేగాదు!

బోరిసోగ్లిబ్‌స్కీలోని జీవితాన్నిగూర్చి గోర్కీ రచించిన 'వాచ్‌మన్' అనే కథలో యిట్లా వర్ణించేడు :

"ఏదో కీర్తితెచ్చే సాహస కార్యాన్ని చేయకపోతానా? అనుకొంటూ, జీవితంలోని సుఖకర విషయాల్ని గూర్చి ఆశలల్లుకుంటూ, కాపలా కాస్తూండేవాణ్ణి. బస్తాలు, టార్పాలిన్‌లు, కట్టెలు, స్థంభాల లాట్లు.-యీ బాపతు ఆస్తిపాస్తుల్ని ఆ చుట్టుప్రక్కల స్థానిత్సాల కోసక్కులు దొంగి లించకండా చూడాలి. ఏవో పుస్తకాలు చదువుకుంటూ, కాలక్షేపం చేయాలి- హీనీ, షేక్స్పియర్,- మొదలైనవాళ్ళ గ్రంథాలు నాకు సాయంగా కాలాన్ని గడిపేవి. కాని ఒక్కొక్కప్పుడు హఠాత్తుగా పుస్తక ప్రపంచంలోంచి నాచుట్టూవున్న యధార్ధ ప్రపంచంలోకి పడి పోయేవాణ్ణి; ఉలిక్కిపడి చూస్తూ, ప్రపంచంలో యెంత కుళ్ళు వ్యాపి స్తూందో చూసి, మెదడులో శూన్యంతో, బుర్రమీద గట్టిగా కొడితే దిమ్మెత్తిపోయినట్లుగా, గంటలకొద్దీ అల్లాగే కూర్చోడమో, పడుకోవడమో చేస్తూండేవాణ్ణి!"

అదివరకు కాలేజీలోనూ, యూనివర్సిటీలోనూ చదువుకున్నవాళ్ళు, అర్థికశాస్త్రజ్ఞులు, ఆర్మీఆఫీసర్లు,- యెందరో విద్యావంతులు అక్కడ

రైల్వేలో పనిచేస్తూండేవారు. వాళ్ళలో కొందరు అదివరకే జైలుకో, ప్రవాసానికో వెళ్ళి వచ్చినవాళ్ళే. "వీరంతా అనుమానించదగినవాళ్లు"గా ప్రభుత్వ రికార్డులోకి యెక్కేరు. పట్టణంలోని ధనాశాపరులైన వర్గాన్ని గూర్చి, తన భావాల్ని యీ బాపతువాళ్ళతో వెలిబుచ్చుతూండేవాడు అలెగ్జీ. అసహ్యంతో వాళ్ళూ నవ్వి ఊరుకునేవాళ్లు. అతని కథలన్నీ విచిత్రకథలుగా కనిపించేవి, వాళ్ళకి. అంతే.

వీళ్ళ వైఖరి చూస్తే అలెగ్జీకి అసహ్యం వేసేది.

కాజాన్‌లో వుంటూన్నప్పుడే, విప్లవసంఘాల్లోని విద్యావంతులను చూసి, తనకూ వారికీ మధ్య యేదో అభేద్యమైన గోడ అడ్డుగా వుందని భావించేవాడు. తనకు వాళ్లు యెంతో మనోవేదనను కలిగించినా కానీ వాళ్ళంటే గౌరవమే అతని మనసులో వుండీది. ఇక్కడ, యీ విద్యావంతుల్లో సంకుచితత్వాన్నీ, దౌర్భాగ్యతనూ మాత్రమే చూస్తూంటే అతనికి చాల విచారం కలిగింది.

అక్కడి విద్యావంతుల్లో 'బొరిసోవ్' అనే ఒకడు మాత్రం, అలెగ్జీ చెప్పిందంతా విని, "ఎంత భయంకరంగా వుంది? అయ్యో!" అన్నాడు.

అతని వైఖరినిచూసి, అలెగ్జీ కాతని యందెంతో గౌరవం కలిగింది.

అలెగ్జీ మెదడంతా అశ్లీలభావాలతో నిండిపోయి. ప్రజలంటేనే తీవ్రంగా కోపం, అసహ్యం కలిగేది. ఈ ప్రపంచంలో తానొక్కడే ఏకాకిగా వున్నాడనిపించేది. కాని, క్రమంగా అతనిలో యీ నిరాశా భావం, క్రమంగా తొలగిపోయింది. దానికి, ఆ రోజుల్లో అతడు చదివిన పుస్తకాలే కారణం. మానవజీవితంలో దుర్మార్గం, స్వార్థమేగాకుండా త్యాగం సుఖసంతోషాలూ కూడా వున్నాయని అతడు తెలుసుకోగల్గేడు.

మానవ జీవితంలోని వెలుగును చూడగల్గి, దానియందెంతో విశ్వాసం కలిగిన యీతనికి మరో హృదయాఘాతం కనిపెట్టుకునేవుంది. అక్కడ

నుంచి యితన్ని 'కృతయా' స్టేషన్‌కి 'చెక్‌వేమన్' (రైలుపట్టాలు సరిచూచేవాడు) గా బదిలీ చేసేరు.

ఎటుచూచినా దిగంతాలవరకూ బట్టబయలే. అందులో అణిగివున్న యీ చిన్నస్టేషన్‌లో వుంటే, బ్రహ్మాండమైన గాజుగిన్నె బోర్లించినట్లూ దానిక్రింద తనున్నట్లూ వుండేది. నిరాధారంగా, దిక్కూ దారీ తోచనట్లుగా హృదయం బాధపడేది.

దోమలు సంగీతాలు పాడుతూండేవి చిమ్మటలూ, చీరండలూ కీచుమంటూండేవి. మర్మాట్‌లు (కొండయెలకలు) యీలలు వేస్తూండేవి. అప్పుడప్పుడు ఒక్కొక్క ట్రెయిన్ దడదడ పోయేది. మళ్ళీ అంతా నిశ్శబ్దం, నిశ్చలం; అంతే. బోరిసోగ్లిబ్‌స్క్‌లో ఐతే పుస్తకాలేనా వుండేవి. ఇక్కడ అవీలేవు. ఉక్కచెవుల్లా వ్రేలాడే 'నీవా' పత్రికసంచికలు మాత్రం కొద్దిగా వున్నాయి.

ఒకరోజున 'బోరిసోగ్లిబ్‌స్క్'లో తన ఏకైక స్నేహితుడు బారినోవ్, తుపాకితో కాల్చుకుని, చెర్చి ఆవరణలోనే చనిపోయేడనీ, తన కడపటి జాబులో తన పుస్తకాలన్నీ కృతయాస్టేషన్‌లో వున్న 'మాగ్జిమ్....' కిమ్మనీ వ్రాసిపోయేడనీ తెలుసుకున్నాడు.

అతని ఆవేదన కంతులేదు. ఈ ప్రపంచంలో యితరులకంటె మంచివాళ్ళే యీ విధంగా త్వరగా యీలోకంలోంచి 'తప్పుకు' పోతూన్నారే! అనుకుని చాల బాధ పడేవాడు.

* * * *

అది 1889. అలెగ్జికి 21 సంవత్సరాలు నిండుతూన్నాయి. ఇంక వెళ్ళి మిలిటరీ సర్వీసుకి రిపోర్టు చేసుకోవాలి.

కృతయా వదలి, కాలినడకనే నొవోగొరోద్‌కి బైలుదేరేడు. అది వేసవికాలం. కాని ఆకురాలు కాలంవరకూ గమ్యాన్ని చేరలేనని అతడు భావించేడు.

## 5 వ ప్రకరణము

# దే శా ట న ము.

"ఇతడు చాలా అనుమానించ దగినవాడు-ఎందుకంటే, బాగా చదువు కున్నవాడు, మంచి వ్రాతగాడు, రష్యా అంతా తిరిగి వచ్చినవాడును (చాలాభాగం కాలినడకనే) కూడాను."

(గోర్కీని గూర్చిన పోలీసు ఫైల్సులోనుంచి)

అలెగ్జీ కాలినడకనే వోల్గానది ననుసరించి ప్రయాణమారంభించేడు. త్సరిత్సిన్ (స్టాలిన్‌గ్రాడ్) దగ్గర నదీతీరాన్ని వదలి మైదానానికి అడ్డ పడి నడక పుచ్చుకున్నాడు.

కొద్దిరోజులు రాస్టోవ్‌లో వున్నాడు. ఖంగాళీగా వుండే అక్కడి రేవులో యేదో పని దొరికేది. పచ్చి చర్మములు దిగుమతీ చెయ్యడం, పొగాకుచట్టలు దింపడం.-(టర్కిష్‌స్టీమర్లలోనుంచి) రోజుకి పదిహేను గంటలు పనిచేయాలి. కూలిమాత్రం బాగానే దొరికేది. అలెగ్జీ ఇక్కడ రోజుకి యాభై కోపెక్కులు సంపాదించేవాడు. సెమ్యోనోవ్ బేకరీలో రోజుకి యిన్నిగంటలూచేయించుకుని పది కోపెక్కు లిచ్చేవాడు. ఇదొక పెన్నిధిలాగే తోచిందాతనికి.

పనిలో మధ్య కాస్త కాళీ చిక్కినప్పుడల్లా కూలీలంతా వార్ఫులమీది చౌకహోటల్సుకి వెళ్ళి పడేవారు. కొంచెం బాగా సంపాదించినరోజున అలెగ్జీ అక్కడికి దగ్గరలోనేవున్న కాస్త మంచి హోటలుకి వెళ్ళేవాడు. దాని పేరుకూడా తమాషాగా సమస్యలా వుండేది. "ఈషాప్" అని దాని పేరు. దీనిలో యెప్పుడూ రేవుకూలీలు, బళ్ళవాళ్లూ నిండివుండేవారు.

అలెగ్జీ నివాసం రేవుకి దగ్గర్లోనే. ఒక క్రింది అంతస్థుగదిలో ముస లమ్మ తనగదిలో ఒకమూల పడుకోనిచ్చినందుకు రాత్రికి అయిదు కోపెక్కులు పుచ్చుకునేది. కొద్దిరోజులక్కడుండి, యుక్రెయిన్ రాష్ట్రం

లోనికి కాలినడకను బైలుదేరేడు. అక్కడనుంచి బెస్సరేబియాగుండా, డాన్యూబ్ నదీతీరానికీ, రుమేనియా సరిహద్దులకంటాను నడిచేడు. అక్కడికెందుకెళ్ళేడో మనకైతే తెలియదు. కాని ఉన్నారుకాదూ, పోలీసువాళ్ళు! మనకంటె యెక్కువగా మన సంగతుల్ని గూర్చి శ్రద్ధ పుచ్చుకొనేవాళ్ళు! పోలీసులు పీటర్స్‌బర్గ్‌కి పంపిన రిపోర్టులో యిట్లా రాసేరు :

"నిఝ్నీ-నొవోగొరోడ్ నుంచి కాలినడకను అలెగ్జీ, బెస్సరేబియాకి వెళ్ళడంలో అతని అభిప్రాయం ఒకటే, సరిహద్దు దాటి రుమేనియాకు వెళ్ళి, అక్కడినుంచి ఫ్రాన్సుకు పోదామనే. కాని, సరిహద్దు దగ్గర ఆటకాయించటంవల్ల మళ్లీ వెనకతిరిగి, క్రిమియాగుండా ట్రాన్స్-కకేషియాకు పోయేడు."

బెస్సరేబియానుంచి ట్రాన్స్-కకేషియాకు వెళ్ళడం మాటలుగాదు. వేలకొద్దీ మైళ్ళ దూరాన్ని నడవాలి. ఈ ప్రయాణంలో అలెగ్జీ నల్లసముద్రపు అంచునే ప్రయాణం సాగించేడు.

చాలకాలం.-సుమారు రెండు సంవత్సరాలు దేశాటనం చేస్తూ తిరిగేడు. గ్రామాన్నుంచి గ్రామానికీ, పల్లెనుంచి పల్లెకీ నడుస్తూపోయి, మోల్దావియా, క్రిమియా, కూబాన్, జార్జియా,-దేశాలన్నీ చూసేడు. ఎన్నో విషయాలు అతని మనసుమీద ముద్రించబడినాయి.- సముద్రాలు, రేవులు, ఓడలు, గుర్రాలమందలు, మైదానాల్లో నెగళ్ళు, దూరంగా మబ్బుగా కనిపించే పర్వతపంక్తులు, జిప్సీల మకాములు, తార్తార్ గొర్రెల కాపరులు, మతగురువులు, దొంగవ్యాపారులు, పల్లెవాళ్ళు, దేశద్రిమ్మరులు, యాత్రికులు,.....

ఒకసారి కెర్ష్ జలసంధిలో మునిగిపోయేడు, జార్జియాలోని మిలిటరీ హైరోడ్డుమీద ప్రయాణంచేస్తూ మంచుతుపానులో చిక్కుకుని బిగిసుకుని కొయ్యబారిపోయేడు.

కష్టాలు, ఆకలిదప్పులు.-అతనిని బహు అభిమానంతో వెంటాడుతూ వుండేవి. సుభిక్షంగా వుండే దేశంలోనే ప్రయాణంచేస్తున్నా, అతని కెప్పుడూ అన్నవస్త్రాలకి లోపమే. అతని వీపుమీది వలాసంలో మరు సటి నాటికవి కాస్త రొట్టె కూడా యెప్పుడూ వుండేదికాదు. అట్లా జాగ్రత పడడం నేరంగా భావించేవాడు; అంతేగాక ఆరొట్టె వుందీఅంటే ఆలోచించవలసిన అవసరం, అవకాశం లేకండా చేస్తుందని అతని భయం.

అబ్ఖాజియాలో ప్రయాణం చేసేటపుడు అలెగ్జీ కేవలం అడవితేనె మీదనే బ్రతికేవాడు. తేనెటీగలు అజీలియా, లారెల్ పుష్పాలనుంచే తేనెను పోగుచేసేవి. చెట్లతొర్రల్లో పట్లకోసం వెతికి పట్టుకుని, యెప్పుడూ చేతులోవుండే లోటాలోకి పిండి, త్రాగేసేవాడు.

గడవదని తోస్తే యేపనికైనా అతడెప్పుడూ సిద్ధమే. అనేకచోట్లలో అనేక రకాల పనులు అతడు చేసేవాడు. చెర్కేషియన్ గ్రామాల్లో (కకేషస్‌లో) వ్యవసాయకూలీగానూ, యుక్రేన్‌లోని యూదీయ రైతుల క్రింద కూలీగా, వంటవాడుగా, ఉప్పుగనుల్లో కూలీగా, రోడ్లువేసేపనిలో బంటాపనివాడుగా ; పల్లెకారుల గ్రామాల్లో వలలు లాగడానికి తోడ్పడీ.- ఆరోజుతిండి సంపాదించుకొనేవాడు.

ఒకసారి ఓ గ్రామంలో యేపనీ లేకపోయింది. ఎవరో చచ్చి పోయేరు. రాత్రి ప్రార్థనలు చదివే పనికి అలెగ్జీ కుదురుకున్నాడు. తెల్లవార్లూ శవందగ్గర కూర్చుని ప్రార్థనలు చదువుతూనే వున్నాడు. తెల్లవారేక వాళ్ళిచ్చిన పెద్దరొట్టెని మాత్రం తీసుకుని, డబ్బు యిస్తూంటే వద్దని నిరాకరించి, మళ్ళీ దారినిపడి నడక ప్రారంభించేడు.

అతనిని ముందుకు తీసుకుపోతూన్న శక్తి, ఆశ,-యేది? అతనికే ఆశ్చర్యం కలిగేదొక్కొక్కపుడు, తన యీ ప్రయాణాలు తలచుకుంటుంటే.

టర్కిష్ ఫెలుక్కాలు (నావలు) చాపలెత్తుకుని సముద్రంలోకి మెల్లగా పోతూంటే చూడడం; స్టెప్పీలో మోకాలిబంటిగడ్డిలో పొలం యెలకలు చెరలాడుతుంటుంటే చూడడం; కొండరాళ్ళమీదినుంచి దుముకుతూ, నురగలుగ్రక్కిన నీటిమీద పండుటాకుల్ని గిరగిర త్రిప్పుతూ మోసికొనిపోవు పెలయేటి ప్రవాహాల్ని అనిమిష నేత్రాలతో చూడడం; చెట్లమీద పురుగులకోసం, వడ్రంగిపిట్టలు చుట్టూ తిరుగుతూ 'టకటకటక!' పొడవటం,-యివన్నీ పరికిస్తూంటే బాగానేవుంటుంది.

దానికంటెనూ, ప్రతిరోడ్డుమీదా ప్రయాణిస్తూ, అగడగిలిన వాళ్ళందరితోనూ మాట్లాడుతూ, యెన్నో రకాలమనుష్యుల్ని అర్థం చేసుకోడానికి ప్రయత్నిస్తూ, అంతులేకండా తిరగడం అంతకంటే బాగుంటుంది.

నొవోగొరోడ్‌లో వుండగానే అతడు పొమ్యలోవ్‌స్కీ గ్రంథాలన్నీ చదివేసేడు. అతని పుస్తకాలంటే అలెగ్జీకెంతో యిష్టం. "జీవితంలోని అన్ని రంగాల్లోనూ మానవ ప్రవర్తనని పరిశీలించాలి; వ్యాపారులు, దేశద్రిమ్మరులు, వంటవాళ్లు, బిచ్చగాళ్ళు, రైతులు, అందరినీ"-అని ఒక నవలలో పొమ్యలోవ్‌స్కీ రాసింది అలెగ్జీకి జ్ఞాపకమే.

అలెగ్జీ అనేక వృత్తుల్లో పనిచేసే స్త్రీ పురుషుల జీవితాల్నీ, యే పనీ చేయని తిరుగుబోతులు, బిచ్చగాళ్లూ, మొదలైనవారి జీవితాల్ని గూర్చి, స్వానుభవంతోనే, దగ్గరలో నుంచే వారిలో ఒకడుగావుండే చూచి, పరిశీలించి, మనోపేటికలో భద్రపరచుకున్నాడు. ఎందరో సామాన్య ప్రజల్ని గూర్చి ఉపన్యాసాలిచ్చేవారికి, వారి జీవిత సమస్యలుగాని, వారి మనోభావాలుగాని, ప్రవర్తనారహస్యంగాని తెలియదు. అట్టి అవకాశాలు అలెగ్జీకి కలగడం ఎంతో మేలే అయింది.

అనేకసార్లు, అనేక సంఘటనల్లో ప్రేక్షకుడుగా వుండడంతో సంతృప్తిపడక, వాటిల్లో పాల్గొనేవాడు. రక్తం వుడుకెత్తిపోయి, అస

హ్యంతో మండిపోతూ, అత్యాచారాన్ని యెదిరించాలనే వజ్రసంకల్పంతో మనసు వురుకెత్తేది.

యుక్రేన్‌లో పోతూండగా ఒక గ్రామంలో 'బండిలాగించే' శిక్షను అలెగ్జీచూసేడు. ఇదొక అమానుషశిక్ష. భర్తకు ద్రోహం చేసిందని అనుమానించబడిన స్త్రీలకీ శిక్షనక్కడ విధించడం పరిపాటి.

సన్నగా, నాజూకుగా వున్న ఒక యువతిని,-ఆమెను యింకా కౌమారి అనే చెప్పచ్చు,-నగ్నంగా చేసి, బండికి ఒక గుర్రానికి బదులుగా కట్టేరు. రెండవవైపు గుర్రాన్నే కట్టేరు. ఆమెభర్త, ఎర్రటి మిడిగ్రుడ్లు, పీచుజుట్టు గలిగిన రైతు ఆ బండియెక్కి, కొరడాతో గుర్రాన్నీ, భార్యానీ కొడుతూ పరుగెత్తిస్తున్నాడు. పాపమా స్త్రీ నగ్నశరీరంమీద కొరడాదెబ్బలు పడి, రక్తంకారుతూంది. బండివెనక్కాలే గోలచేస్తూ, వేళాకోళాలాడుతూ పెద్ద గుంపుచేరి, పరుగెత్తుతూంది. ఆ గ్రామస్థులకిది ఒక ఘోరం కానేకాదు. సామాన్యమైన శిక్షే; అందరూ చేసేదే; మామూలు నిత్యకృత్యంగా యెంచబడే విధివిహితాల్లో ఒకటి.

పీచు జుట్టున్న ఆ బండరైతు చేసేది ఒక దారుణపుపని అనీ, రాక్షసకృత్యమనీ, ఆమెపక్షాన వాదించి, యీ దురంతాన్ని అరికట్టాలనే ఆలోచనే యెవరికీ తట్టలేదు.

తర్వాత 'బండిలాగే శిక్ష' అనే కథలో గోర్కీ యిట్లావ్రాసేడు :

"నేను దీనిని నా కళ్ళారా చూసేను. 1891 జూలై 15 వ తేదీని నికోలయేవ్ ఉయేజద్, ఖెర్సన్ గుబర్నియా, ఖాండిబోవ్‌కా గ్రామంలో యిది చూసేను."

కాని, అక్కడ వాళ్ళలో ఒకేఒకడు, పాపం ఆ స్త్రీ పక్షాన మాట్లాడి, కలుగచేసుకున్నట్లు వ్రాయలేదు! ఆ స్త్రీ పక్షం వహించినది అలెగ్జీయేనని వేరే చెప్పాలా?

ఆ మూకని వ్యతిరేకించి, ఏకాకిగా తానొక్కడే నిలబడ్డాడు. వాళ్ళ రాక్షసత్వం యితన్నిగూడా చుట్టుముట్టింది. అతన్ని పట్టుకుచావబాదుతూ గ్రామం వెలుపలదాకా యీడ్చుకొచ్చి, రోడ్డుప్రక్క బురదకాలువలో పారేసి వెళ్ళిపోయేరు. అలెగ్జీ స్మృతిలేకండా అక్కడే పడివున్నాడు.

అదృష్టవశాత్తూ ఆ సమయానికే ఉత్సవాన్నుంచి వస్తూ, ఆ దారిని పోతూన్న భజంత్రీవాళ్ళు రక్తసిక్తమై పొదల్లో పడివున్న మనిషినిచూసి, బ్రతికేవున్నాడని, అతన్ని తమ బండిలో పెట్టుకుని నికోలయేవ్ పట్టణానికి తీసికెళ్ళి, హాస్పిటల్‌లో చేర్పించేరు. అతడు స్వస్థుడవటానికి యెంతోకాలం పట్టింది. ఖాండిబోవ్‌కా పల్లీయులు అతన్ని కొనప్రాణంతోనే వదిలేరు.

ఈ సంఘటన నాతడు యాదృచ్ఛికంగానే చూచింది. అతడు తరచు రోడ్డు వదలి, ప్రక్కబాటలనుబడి చుట్టుప్రక్కల గ్రామస్థు లెట్లు జీవిస్తున్నదీ చూడబోయేవాడు.

ఒకసారి కూబాన్ గ్రామాల్లో పోతూ మైకోప్ పట్టణంలో 'దొమ్మ దొమ్మి' జరిగిందని విని అక్కడికి వెళ్లేడు.

అక్కడి పశువులన్నీ దొమ్మరోగంతో విపరీతంగా చస్తున్నాయి. దాన్ని నివారించడానికి ప్రభుత్వోద్యోగులుగాని, వెటిరినరీ సర్జన్సుగాని తగిన యేర్పాట్లు చేయడం లేదు. ప్రజల ఓరిమి నశించింది. చివరకో రోజున ప్రభుత్వోద్యోగుల్నీ, పశువుల డాక్టర్లనీ పట్టుకు చావబాది వదిలేరు. సైన్యాల్ని పిలిచేరు. కోసక్కులు గ్రామస్థులమీద పడి విచ్చలవిడిగా తుపాకులు కాల్చేరు. ఎందరో చచ్చిపోయేరు. ఇదీ దానికథ.

అలెగ్జీ అక్కడికి వెళ్ళేటప్పటికి కోసక్‌లు అట్టహాసంగా వీధుల్లో స్వారీలు చేస్తున్నారు. ప్రజల్లో భీతాహం వ్యాపించివుంది. చనిపోయిన వారి బంధువులు గోడుగోడున యేడుస్తున్నారు.

ఎవడో కొత్తవాడు వచ్చేడనడంతోనే పోలీసువాళ్ళు పసికట్టేరు. అలెగ్జీని అరెస్టుచేసేరు. అప్పటికే జైలంతా నిండిపోయి వుండడంచేత అతన్ని సిపాయీల బారకీసుల్లో ఒకగదిలో నిర్బంధించి వుంచేరు.

పోలీసు ఆఫీసరొకడు అతన్ని పరీక్షిస్తూ, యీ గందరగోళంలో అక్కడికి కేమి పనిమీద వచ్చేవని అడిగేడు.

"రష్యాదేశాన్ని చూడాలని వచ్చేను" అన్నాడు అలెగ్జీ.

ఆఫీసరు తిడుతూ, ప్రారంభించేడు :

"రష్యా కాదురా, యిది పందులదొడ్డి !"

ఇతన్నిగూర్చి అంతా అనుమానాస్పదంగానే వుంది. పేరేమో పెష్కోవ్ అంటాడు; యేపనీ లేకండా దేశాలమ్మట బికారిగా తిరుగుతూన్నాడు; సంపాదనా లేదు, డబ్బూలేదు; వలాసంలో పుస్తకాలు కూడాను, ఓడి బ్రతుక్కి సాయం; పైగా పద్యాలు, గీతాలు రాసిన నోటుబుక్కు; పోలీసు వాళ్ళంటే భయమేలేదు; అడిగినప్రశ్నలకి నిర్భయంగా, పొగరుబోతుగా సమాధానాలు చెపుతూన్నాడు.

కాని, యితన్ని శిక్షించడానికి నేరం యేమీ కనిపించలేదు. చివరకి కొన్ని రోజులు ఖైదులోవుంచి, వదిలేసేరు. అతని కష్టమయ జీవితంలో మైకోప్ బారకీసులు రెండో జైలు.

## 6 వ ప్రకరణము

# పలిత వృక్షం (గీతికలు)

డ్రాన్ తీరప్రదేశం అంతా కాలినడకనే భ్రిమ్మరుతూ, తాంబోవ్, రియాజాన్ ప్రాంతాలు దాటేడు. గ్రామాల్లోనూ, స్థానికాస్పల్లోనూ, విహారాల్లోనూ, సత్రాల్లోనూ ఆగుతూ, దారిలోనే అగదగిలిన పనులు చేసి పొట్ట పోసుకోడానికి సరిపడ సంపాదించుకుంటూ పోతూన్నాడు.

రష్యాగుండా అతని మొదటిప్రయాణం యిదే.

1889 సెప్టెంబరులో మాస్కోకి చేరేడు.

మహాకవి టాల్‌స్టాయ్ నివసించే హవేళీ (ఖామోవ్నికీ జిల్లా) కి వెళ్ళేడు, సరాసరిగా ఆయన్ను చూడాలని. ఇంటిదగ్గర ఆయన లేడు. ఆయన భార్య సోఫియా అండ్రియేవ్నా, అలెగ్జీని ఆహ్వానించి యింట్లోకి తీసుకునిపోయి, రొట్టెలు, కాఫీ యిచ్చి ఆదరించింది. ఆ మాటా యీ మాటా ఆడుతూ, ఆమె,-

"లియో (టాల్‌స్టాయ్) కోసం యెందరో వస్తూనేవుంటారు. పనికి మాలినవాళ్లూ, సోంబేరీలు, దొంగముండాకొడుకులూ, బికారీలుకూడ యెందరో, వేళాపాళా అనకండా వస్తూనేవుంటారు" అంది. మర్యాదగా 'ఔను' అని ఒప్పుకోక తప్పిందిగాదు, అలెగ్జీకి!

అక్కడినుంచి ముందుకుపోవాలి. నొవోగొరోడ్ యింకా చాల దూరం వుందాయెను. సెప్టెంబరులో ప్రకృతి బహురమ్యంగా వుంటుంది. ఋతు వర్షాలు పుష్కలంగా కురుస్తున్నాయి. మోడులతో నిండివున్న చేలన్నిటినీ శీతల పవనాలు పరామృశిస్తూన్నాయి. అడవులు పండుటాకులతో బంగారు కాంతితో ప్రకాశిస్తూన్నాయి. ఋతువైతే రమ్యంగానే వుంది గాని, కాలినడకను దేశాటనం చేయడానికిమాత్రం, అందులోనూ చిరుగుల జోళ్ళతో,- యేమంత సులభంగాదు; సుఖంగానూ వుండదు.

మాస్కో రైల్వే స్టేషన్‌కి వెళ్ళి ఓ గూడ్సుట్రెయిన్ గార్డుని మంచి చేసుకుని ట్రెయిను యెక్కేడు. ఓ వాగన్‌లో యెక్కించేడు. గార్డు. అతనికి తోడుగా ఆ వాగన్‌లో యెనిమిది చెర్కాస్ గిత్తలు ప్రయాణం చేస్తున్నాయి. నొవోగొరోద్ కబేళాకి వాటిని పంపిస్తూన్నారుట. వాటిల్లో మూడిటికి మాత్రం యెందుకనో అలెగ్జీఅంటే మహా మంటగావుండి. చిఱ్ఱూ బుస్సూమంటూనే వుండీవి. దారిపొడుగునా అతన్ని బెదిరిస్తూ. తమ ఆశయం సఫలమైనపుడల్లా అవి మహాసంతోషంగా బుసకొడుతూ రంకెలు వేసేవి.

గార్డు విచిత్రమైనవాడు దొడ్డికాళ్ళు. పొట్టి విగ్రహం; మీసాలు చిమ్మటలు కొరికేసినట్లుగా వుండేవి. అతడు అలెగ్జీని ఊరికే కూర్చోనీయడం ఎందుకని గిత్తల్ని మేపే పని అప్పచెప్పేడు. అగినప్పుడల్లా తలుపు సందులోంచి సందెడు గడ్డి లోపలికితోస్తూ "వాటిని మేపు" అనేవాడు !

'అటువంటి సహవాసులు మళ్ళీ యీ జన్మలో దొరుకుతారా !' అనుకుంటూ. ముప్పైనాలుగు గంటలు ప్రయాణంచేసి. గమ్యస్థానం చేరేడు.

ఇంటికి వెళ్ళేసరికి అతని వలాసంలోని నోటుబుక్కునిండా పద్యాలే. 'పలిత వృక్షం' అనే కావ్యం ఒకటికూడా అందులోవిదే. ఈ కావ్యం అంటే అలెగ్జీకెంతో ప్రీతి యేర్పడింది. అది ప్రచురించబడితే 'తప్పక అందరినీ ఆకర్షించి తీరుతుందని అతని కెందుకో తరగని విశ్వాసం యేర్పడింది.

చివరకి. సిపాయిగా అతన్ని చేర్చుకోనేలేదు !

"పటాలంలోకి పనికిరాడు; ఊపిరితిత్తులు చిల్లులు పడ్డాయి." అన్నాడు పటాలం డాక్టరు అలెగ్జీని పరీక్షచేసి.

ఇంకేదో పనిచూసుకోవాల్సి వచ్చింది. ఒక సారాదుకాణంలో పనివాడుగా కుదిరేడు. ఏవో యితరపనులతోబాటు. వచ్చినవాళ్ళకి 'బవేరియన్ క్వాస్' అమ్ముతూండడం కూడా యితనేచేయాలి.

ఈతని విచిత్రవేషం చూసి అంతా తిరిగిచూసేవాళ్లే. నాటకాల్లో దొంగలూ వాళ్లూ పెట్టుకునేలాంటి వెడల్పుచూరు టోపీ; వంటవాళ్ళ తెల్ల అంగీ; పోలీసు ఆఫీసరులా నీలి పంట్లాం.- యిదీ అలెగ్జీ దిరీసు.

అతని వేషం ప్రజల్ని ఆకర్షిస్తే. మరో లక్షణం పోలీసువాళ్ళని ఆకర్షించింది. ఆ రోజుల్లో నొవోగ్రాడ్‌లో చాలామంది విప్లవకారులు నివసిస్తూండేవాళ్ళు. కాజాన్‌లో యితని స్నేహితులు కొందరు కూడా వాళ్ళలో వున్నారు. కాజాన్ యూనివర్సిటీలో జరిగిన గందరగోళాల తర్వాత అక్కడినుంచి వాళ్ళని ప్రభుత్వం తరిమేశింది.

వారి రహస్య సమావేశాలకి యితడూ హాజరవుతూండేవాడు. కాజాన్ ప్రవాసు లిద్దరితో.- ఛెఖిన్ అనే స్కూలు టీచరు. సోమోవ్ అనే పాత విద్యార్థి.- వీరితోబాటు అలెగ్జీ బస చేసేడు.

దీనితో పోలీసువాళ్ళ అనుమానం బలపడింది. అతని యిల్లు నిఘాలో వుండేది. ఈ కూలీవాడు, అలెగ్జీ పెష్కోవ్ యెక్కడెక్కడ. ఏమేమి చేసేడో భోగట్టాకోసం అన్ని పట్టణాలకీ ఎంక్వయిరీలు వెళ్ళేయి.

కొద్దిరోజులకే సోమోవ్ అరెస్టుకోసం పీటర్సుబర్గు నుంచి వారంటు వచ్చింది. కాని, పాపం, పోలీసులు కొంచెంలో తప్పిపోయేరు. అప్పటికే సోమోవ్ కనిపించటం లేదు. ఏమైనాదో! వాళ్ళు అలెగ్జీని అడిగేరు. ఆ తర్వాత పోలీసువాళ్ళు ఆఫీసరుతో యిట్లా చెప్పేరు:

"క్రాస్ పరీక్షలో పెష్కోవ్ తిరస్కారభావంతోనూ, పెంకితనంతోనూ సమాధానాలు యిచ్చేడు."

అలెగ్జీని అరెస్టుచేసి, నొవోగ్రాడ్ జైలులోని నాలుగు గుండ్రగోపురాల్లో ఒకదాంట్లో పెట్టేరు. పోలీసు అధికారికి అలెగ్జీని చూచి చాలా కోపం వచ్చింది;

"నువ్వు యేలాంటి విప్లవకారుణ్ణనుకుంటూన్నావేమిటి?" అంటూనే మళ్ళీ తగ్గేడు. "ఓహో! నువ్వు పద్యాలు గట్రా కూడా రాస్తావేమిటి?....

(మర్యాదగా) నిన్ను వదిలేశాక యీ సరుకు ఓ మాటు కొరొలెంకోకి చూపించు. నువ్వు అతన్ని యెరుగుదువా ?"

చివరకి జైలునుంచి వదిలేసేరు. అప్పుడు మళ్ళీ ఆఫీసరు.-

"ఏమోయ్ ! నువ్వు చేయాల్సిందేమిటంటే, చదవాలి, బాగా చదవాలి. వ్రాయి, దానికేం వ్రాయనూవచ్చు. బాగానేవుంటుంది. అంతేకాని, యీ మాదిరి పనులు యెందుకంటా ?...."

"ఈమాదిరి పనులు" అంటే విప్లవ కార్యక్రమమని అతని అభిప్రాయం. తాను వ్రాయమని అమాయికంగా సలహా యిచ్చిన యీమనిషి వ్రాతలే, ఆ తర్వాత తనకూ, తన డిపార్టుమెంటుకూ నానాతిప్పలూ తెచ్చిపెట్టినాయి !

అలెగ్జి ఆ ఖైదులో ఒక నెల వున్నాడు. తర్వాత ఒదిలిలెట్టినా, "నమ్మదగని వ్యక్తి"గా పోలీసు నిఘాక్రింద నిరంతరం వుంచుతూ వచ్చేరు.

అలెగ్జి విప్లవ కార్యాల్లో పాల్గొనడం మానలేదు. కాని, ఆ పోలీసు ఆఫీసరు సలహా యిచ్చినట్లుగా కొరొలెంకోను కలుసుకున్నాడు.

వ్లాడిమిర్ కొరొలెంకో ఆ రోజుల్లో నొవోగ్రాడ్‌లోనే నివసిస్తూండీ వాడు. అతడొక సుప్రసిద్ధ రచయిత. అతని నవలలు, కధలు దేశంలోని విద్యావంతులలో చాల ప్రశంసించబడీవి. అతని వ్రాతలలోని వ్యంగ్య విమర్శనలకు ప్రభుత్వోద్యోగులూ, వర్తకులూ గిలగిలా కొట్టుకు చచ్చేవాళ్ళు.

ఆతన్ని గురించి ప్రజల్లో చిత్రమైన కధలు వ్యాప్తిలో వుండీవి. జారుప్రభుత్వంతో పోరాడడానికి కొరొలెంకోను విదేశాలనుంచి యెవరో పంపించేరనీ....యింకా యేమిటేమిటో, యిట్లాగే.

కంగారుగా, మొహం అదోలా పెట్టుకుని, తన వ్రాతపతిని కొరొలెంకో ముందర వుంచేడు, అలెగ్జి.

కారొలెంకో ఆ లావాటి పుస్తకాన్ని ఒక్కొక్క కాగితమే తిరగేస్తూ న్నాడు: మధ్యలో ఆగి, మెల్లిగా,-

"ఇదిగో యిక్కడ 'గబిజిజి' అని రాసేరు. పొరబాటే అయి వుంటుందిలేండి. కాని అటువంటి మాట వుండదు. 'గజిబిజి' అని వుండాలి."

'గబిజిజి' పొరపాటు కానేకాదు. కాని ఆ యువక రచయిత యొక్క ఆత్మవిశ్వాసాన్ని దెబ్బకొట్టకండా వుండడానికే కొరొలెంకో అట్లా అన్నది. అలెగ్జీ అతనికి కృతజ్ఞత తెల్పేడు.

కొరొలెంకో ఆ పుస్తకంయొక్క ఔచిత్య విచారంచేస్తూ, దానిలో నడక సరళంగా సాగలేదనీ, పద్యాలకి గమనిక ముఖ్యమనీ అన్నాడు.

"నేనీ ప్రపంచంలోకి రాజీపడడానికి రాలేదు; అది కారణంగా అందు వల్ల ...." అంటూ వుందందులో.

" 'అది కారణంగా అందువల్ల'- అబ్బే, అది బాగావుండదు! అటు వంటి ప్రయోగం వికారంగా వుంటుంది. చూచేరా? "అది కారణంగా అందువల్ల"- "ఆ కారణం వల్ల" రెండింటికీ తేడా తెలిసిందా? ధ్వనిలో యెంతో యింపు వుండాలి. పద్యాలకి ప్రాణం పదప్రయోగమే."

అట్లాంటివెన్నో చూపేడు. అలెగ్జీ వాటిని కనిపెట్టనేలేదు. అతనికి అవి తప్పులనీ, అందంగా లేవనీ తెలిసికోడాని కిదే ప్రథమం.

కొద్ది రోజుల తర్వాత ఆ వ్రాత ప్రతిని కొరొలెంకో తిరిగి పంపేస్తూ, దాని అట్టమీద యీ రీతిగా వ్రాసేడు :

"ఈ 'గీతిక' నుంచి, మీ శక్తి సామర్థ్యాల్ని కొలవడానికి అవకాశం లేదు. మీలో రచనాశక్తి ఉన్నదనే నా అభిప్రాయం. మీ అనుభూత విష యాలమీద దేనినైనా రచించి, నాకు చూపించండి. అసలు నాకు పద్యాల్ని విమర్శించే సామర్థ్యం లేదు. మీ పద్య భావమే నాకు అర్థంకావడం కష్ట

మైంది. కాని, మీ పద్యాల్లో కొన్ని అద్భుతంగానూ, శక్తివంతంగానూ వున్నాయి."

"ఇంకెప్పుడూ,- పద్యాలూ లేవు- గద్యాలూ లేవు. ఏదీ రాయను" అని నిశ్చయించుకున్నాడు, అలెగ్జీ నిరాశతో.

ఇంక రాయకూడదని ఊరికే అనుకోలేదు, అలెగ్జీ. నొవోగ్రాడ్‌లో వున్న రెండేళ్ళలోనూ ఒక్కసారికూడా మళ్ళీ కలం పట్టుకోలేదు.

కాని, రోజంతా బీరు పీపాలు దొర్లించడం, గ్లాసు లందించడంతోనే జీవితానికి పరమావధి అనుకోలేదు, అలెగ్జీ. ఏదో చెయ్యాలి! జీవితాన్ని నిండుగా తోపించడాని కేదో చేస్తూండాలి. అదేమిటి? ఏమో!

అంతా శూన్యంగా తోచేది. బ్రతుకే భారం అనిపించేది, కృతయాలో అనిపించినట్లుగా. మళ్ళీ యేదో నిరాశ అలెగ్జీని ఆవహించనారంభించింది. విద్యావంతులైన విప్లవకారుల పఠనబృందాలకు యితనూ వెళ్ళేవాడు. అక్కడ అత్యద్భుతమైన వ్యక్తులుండేవాళ్ళు. కాని వాళ్ళల్లో ఉత్తమోత్తముడైనా కానీ, యదార్థజీవితంతో, ప్రజాసామాన్యంతో ప్రత్యక్ష సంబంధం, అనుభవం లేనివాడేననే భావం ఆతనిలో బలపడజొచ్చింది. వాళ్ళంతా పుస్తకాలు తెగచదువుతారు, బాగా మాట్లాడగలరు, యుక్తిగా వాదించగలరు. కాని,-అంతే.

అలెగ్జీ అన్వేషిస్తూన్నది, మరోదానికై. యదార్థజీవితం, సహజమైన భావములు,-యివీ అతను అర్థం చేసుకోవాలనుకొనేవి....

ఎక్కడికేనా వెళ్ళిపోతే బాగుంటుందనుకున్నాడు. చాలదూరం, కొంతకాలందాకా తిరిగిరావాలి. టొపోగ్రాఫికల్ ఎక్స్పెడిషన్ (దేశపట రచనార్థం బైలుదేరే నిపుణులసంఘం) తో వాలంటీరుగా వెళ్ళడానికై ప్రయత్నించేడు. దానిలోని ఆఫీసరు నొకణ్ణి అలెగ్జీ యెరుగును. పామీరు పర్వతప్రాంతాలకి తీసుకువెడతానని ఆతడు అలెగ్జీకి వాగ్దానం చేసేడు.

కాని, యీతని దరఖాస్తును ప్రభుత్వం మంజూరు చేయలేదు. అతడు "నమ్మదగనివ్యక్తి" గా పోలీసు రిపోర్టు వుందిగదూ ?

ఆ వేసవిలో ఒక రోజురాత్రి కొండమీదికెక్కి రాతిబెంచీలమీద కూర్చున్నాడు. అక్కడినుంచి వోల్గానదీ, నదికావల పొగమంచులో మసగ్గావున్న మైదానాలూ బాగా దూరందాకా కనపడుతూన్నాయి. ఉంగ రాలు తిరిగిన గడ్డంతో వున్న ఆగంతుకు డొకడు వచ్చి, అతని ప్రక్కనే చతికిలపడ్డాడు.

"ఏమయ్యా ! నువ్వు యేమేనా రాస్తున్నావా ?" అనే ప్రశ్నతో ఉలిక్కి పడి చూచేడు, అలెగ్జీ. ఆగంతుకుడెవరో కాదు మహాకవి కొరొలెంకో !

"లేదు. ఏమీ రాయడంలేదు."

"అయ్యయ్యో ! అదేమి ? మీకు రచనాకౌశల్యం వుందనే నా అభి ప్రాయం. ఎంతపనిజరిగింది ? మీరు యేదో చిరాకులో వుండివుంటారు, బహుశా."

నిజమే ! అలెగ్జీ మనసు మనసులోలేదు. తన రచనాకౌశల్యయందు తనకే విశ్వాసం నశించింది. విద్యావంతులైన విప్లవకారుల అంతంలేని చర్చలు అతనికి వ్యర్థంగానూ, విసుగ్గానూ వున్నాయి. అంతేగాక అతను ప్రేమవ్యాపారంలో పడ్డాడుకూడాను. అతని జీవితంలో మొదటి సారిగా గాఢంగా ప్రేమించ నారంభించేడు అలెగ్జీ. కాని, అతను ప్రేమిం చిన స్త్రీ, వివాహిత ! ఆమె యితనికొరకై తన భర్తనూ, సంసారాన్నీ విడిచిపెట్టడానికి సిద్ధంగా లేదు.

అలెగ్జీ నొవోగ్రాడ్‌ను వదలి, తిరిగీ దేశాటనానికి బైలుదేరేడు. రెండు సంవత్సరాలకి పూర్వం ఆయేకాకి రైల్వేస్టేషన్‌ను వదలి, దేశాట నానికి పోయినట్లే, యిప్పుడూ వలాసం భుజానవేసి, కర్ర చేతబట్టి రోడ్లు దుమ్ము చేయడానికై బైలుదేరేడు.

## 6 వ ప్రకరణము

## మొదటి కథ

అలెగ్జీ పరిభ్రమణలు చివరకి కకేషస్‌లోని టిఫ్లిస్ పట్టణంలో సమాప్తమైనాయి. ఇక్కడకూడా అతనికి సుఖదినాలు రాలేదు. వెనకటి విసుగుదలజీవితం, మకాముకై చిన్న చీకటికొట్టు, పోలీసులతో నిత్యమూ తగువులూ, వెన్నువిరిగే బండచాకిరీ,-యివన్నీ తప్పనేలేదు. కాని, అతని జీవితంలో యివి మంచిదినాలు, అతని యౌవనదశలోనే ఆశాకరమైన దినాలు అని చెప్పితీరాలి.

టిఫ్లిస్‌లో అతనికి కొత్త స్నేహితులు, కొత్త మనుష్యులు దొరికేరు.

అక్కడి రైల్వే రిపేరువర్కు-షాపుల్లో చేరి పనిచేస్తూ, విప్లవోద్యమంలో పనిచేసే కార్మికులూ, విద్యావంతులూతో సంబంధాలు కలిసేయి. వీరాతనియందు వాత్సల్యతచూపి, తరిఫీదు చేస్తూన్న ఉపాధ్యాయుల్లాగ కాక తోటి సోదరులలాగ చూసేవారు. వారితో కలిసి విప్లవకార్యక్రమంలో పాల్గొంటూ, రైల్వే కార్మికుల్లో ముఖ్యంగా పనిచేస్తూ, యెప్పటికప్పుడే 'యిత్తడి బొత్తాముల' (పోలీసులు- మన ఎర్రటోపీల లాగే) దాడికై యెదురుచూస్తూ జీవితాన్ని ఉత్సాహంగా గడిపేస్తున్నారు.

అతనిలో దేశాటన చేయాలనే కోరిక తిరిగి తిరిగి ఉవ్వెత్తుగా రేగుతూ, విజృంభిస్తూండేది. ఒకసారి వీధినాటకాలువేస్తూ, తిరగాలని తోచింది. వీపున వలాసంతో, గ్రామాన్నుంచి గ్రామానికి తిరుగుతూ, రాత్రిళ్లు చిన్న నాటకాలాడుతూ, దేశం అంతా పర్యటనం చేయడానికి కొందరు నటకుల్ని కూడా పోగుచేసేడు।....కాని యెందుకనో అతని కోరిక నెరవేరనేలేదు. దీనికి ముఖ్యకారణం అలెగ్జీకొక గొప్ప స్నేహితుడు లభించడమే నని చెప్పాలి.

ఆ కొత్త స్నేహితునిపేరు అలెగ్జాండర్ మిఖోదియేవిష్ కలూఝ్నీ. ఇతడు 'నరోద్నయా వోల్యా' అనే రహస్య సంఘంలో సభ్యుడు. అప్ప

టికే తన రాజకీయ జీవితానికై ఆరుసంవత్సరాలు జైలులో గడిపి వచ్చినవాడు. అతని దయాపరత పారంలేనిది. మానవుల్లో అరుదైన మానవత్వం అతనిలో మూర్తీభవించింది. ఇతరులతో యెల్లా మెలగాలో అతనికి చక్కగా తెలుసు. ఎవరేమి చెప్పినా బహు శ్రద్ధగా వింటాడు; మనుజుల స్వభావాల్ని కనిపెట్టడంలో, నిర్ణయించడంలో, వారిలోని నిగూఢ శక్తిసామర్థ్యాల్ని మేల్కొల్పి, తమంతతామే వాటి అభివృద్ధికై కృషి చేసేటట్లు చేయడంలో అతనంతటివాడు మరి లేడనే చెప్పాలి.

కలూఝనీతో కలుసుకొన్న మొదటి దినాల్లో తాను బెస్సారేబియా, వోల్గాతీరదేశాలలో ద్రిమ్మరిన విశేషాల్నిగూర్చి, జీవితాన్నిగూర్చి చెప్తూంటే, అతడు మౌనంగా వింటూ, అలెగ్జీవైపే చూస్తూండేవాడు. కలూఝనీ యితడు కేవలం మామూలు మొరటుమనిషి మాత్రమే కాదనీ, విచిత్రానుభవాలు సంపాదించిన దేశద్రిమ్మరి మాత్రమేకాదనీ, పుర్రెకి పుట్టినబుద్ధి ప్రకారంగా స్థిరచిత్తం లేకండా తిరుగుతూ, ముఖం మీద అసంతృప్తి, భీకరత తాండవించే బికారీగాదనీ, అతని కధలు చెపుతూన్న వైఖరే అతనొక గొప్ప కళావేత్త, నిగూఢ శక్తివంతుడూ, విశాలహృదయుడూ అని సువ్యక్తం చేస్తూన్నాయనీ గ్రహించేడు.

కదాచిత్కంగా కలిసిన యీపరిచయమే వీరిద్దరిమధ్య గాఢమైత్రిగా పెంపొందింది. అలెగ్జికి సాహిత్యంలో మంచి భవిష్యత్ వుందని కలూఝనీ పసికట్టేడు. నిరంతరం అతనితో అంటూండేవాడు :

"రాయవోయ్ ! నీ అనుభవాలన్నీ రాయి. అదేపెద్ద కళాఖండం ఐతీరుతుంది."

అలెగ్జీ చెప్పేకధలు వింటూంటే కలూఝనీ తన్మయత్వం పొందేవాడు. అలెగ్జీ మిత్రుని ప్రోత్సాహంవల్ల వ్రాయనారంభించేడు గాని, కలూఝనీ అనుకున్నది మాత్రం గాదు.

ఇప్పటికే అలెగ్జీ మనోఫలకంమీద అసీమమైన అనుభవాలూ, అను

భూతినీ భద్రపరచివుంచేడు. కష్టమయమైన జీవితయాత్ర అతన్ని అనేక తరహాల మానవులతో-, చీకటికొట్లలో, కార్ఖానాల్లో, రేవుల్లో, ఓడల మీది గదుల్లో, రైతుల కొయ్యగుడిసెల్లో, పట్టణవాసుల వెచ్చని చిన్న యిండ్లలో, గుర్రపుసాలల్లో, ధాన్యపుగాదులక్రింద, వాచ్‌మన్‌ల చిన్న కొంపల్లో,-యెందరో విచిత్రవ్యక్తులతో కలిపి కూర్చి, రాపాడించింది. పీలికలు యేరేవాడిగా, వంటపుట్టిగా, విగ్రహాలు చేసేవాడుగా, బేకర్‌గా, ఓడకూలీగా, సొరియావాడుగా, రైల్వేకూలీగా, బికారీగా, పల్లెకారీగా,- అదీయిదీ యేమిటి చెప్పన్నవృత్తులూ అంటే యేమిటో స్వయంగా తెలిసికోగలిగేవాడుగా జీవితమే చేసి విడిచింది. రష్యాదేశం ఏమిటో అతడు చూసేడు. అంగుళం అంగుళం కాలితో మట్టి, ధూళి మేఘాలు లేపుతూ, కొండనుంచి కొండకు, కోననుంచి కోనకు చూసి విడిచేడు కూడా. ఈ అనుభవాలేమీ సామాన్యమైనవి గావు.

అతనింక చేయవలసిందేముంది, తననుగూర్చి, తన అనుభవాల్ని గూర్చి, తన భావాల్నిగూర్చి రాసేయడమే ! కాని, వచ్చిన చిక్కేమి టంటే, అలెగ్జీ కలంపట్టుకుని రాయడానికి కూర్చోగానే అతని అమూల్య ప్రత్యక్షానుభవాలుకరిగి, మరుగైపోయినట్లుయి, తనుచదివిన పుస్తకాల్లోవి మాటలు వాటంతటవే కాగితంమీదికి వచ్చి కూర్చునేవి. అలెగ్జీ రాసే వన్నీ అతని మాటలుగాదు; ఇంగ్లీషుకవి బైరన్ పద్యాలవంటి, యిటలీ కవి లియోపార్డీ గీతాలవంటి మాటల తోరణాలు అతని లేఖిని నుంచి వెలువడేవి !

ఫలితం యేమంటే, వినడానికి యింపుగా, గంభీరంగా వుండే మాటలప్రోవులేగాని, భావంమాత్రం నీరసంగా వుండేది. కలూఝనీ యిదంతా గ్రహించేడు.

"నువ్వేమిచూసేవో, అనుభవించేవో అదే రాస్తూండు మరేదీ మన సులో ప్రవేశించనీకు, కలంనుంచి వెలువడనీయకు" అని, నిరంతరం స్నేహితునాతడు హెచ్చరిస్తూనే వుండేవాడు.

ఒకరోజురాత్రి చాలమంది కూర్చునివుండగా, అలెగ్జీ తన ప్రయాణానుభవాల్ని వర్ణిస్తూన్నాడు. బెస్సరేబియాలో తిరుగుతూ, ఒకరోజున జిప్సీలమకాంకి వెళ్ళేడు. వాళ్ళలో ఒకవృద్ధుడు, మకర్ ఛూద్ర అనే వాడు 'రాధా-లోయికోజోబర్' ల గాధను చెప్పేడు. ఆకధ చెపుతూంటే అందరూ మంత్రముగ్ధుల్లా కదలకండా వింటున్నారు. అలెగ్జీని యీ ఉదంతాన్ని కధగా రాయమని కలూఝునీ ప్రోత్సహించేడు. ఆ జిప్సీ వృద్ధునితో తన సమాగమాన్ని కధారూపంలో రాసిపెట్టేడు, అలెగ్జీ.

టిఫ్లిస్‌లో 'కవ్‌కాస్' అనే ఒక ప్రసిద్ధవార్తాపత్రిక ఆఫీసుకు యీ కధను తీసికొని, కలూఝునీ వెళ్లేడు. సంపాదకుడు యీ కధవిని, సంతృప్తిపడ్డాడు. కధచివర సంతకం మాత్రం యెవరిదీ లేదు. యెవరు రాసిందీ సంతకం పెట్టమన్నాడు, సంపాదకుడు. అలెగ్జీ అక్కడే వున్నాడు, వింటూ ఆలోచించేడు....

"మాగ్జిమ్ గోర్కీ...." (గోర్కీ-అంటే 'కటు' వని అర్ధం 'ఉగ్ర' మొదలైన వాణీనామాలవంటిదే)

అని అక్కడే అప్పుడే సంతకం చేసేడు.

1892 సెప్టెంబరులో 'మకర్ ఛూద్ర' అనే మొదటికధ, 'గోర్కీ' పేరుతో టిఫ్లిస్‌నుంచి అచ్చులో వెలువడింది.

ఇంతటినుంచీ 'అలెగ్జీ'కి మారుగా 'గోర్కీ' అని వాడవచ్చు మనం.

'గోర్కీ' అయేటప్పటి కాతని వయస్సు 24 దాటింది. అంతే.

ఆ సంవత్సరమే ఆకురాలుకాలంలో బైలుదేరి, గోర్కీ తన స్వస్థలం నిఝునీ-నొవోగ్రాద్‌కి వెళ్ళిపోయేడు.

వెళ్ళేటప్పుడు అతని హృదయంలో కలూఝునీయొక్క చిరస్మృతిని భద్రపరచి, తీసికొనివెళ్ళేడు.

'అలెగ్జీ' లోని 'గోర్కీ' ని కనిపెట్టి, వెలుతురులోనికి తెచ్చింది, విప్లవకారుడు 'కలూఝునీ' యే.

## 7 వ ప్రకరణము

## ఎ గూ ది ల్ ఖ్లా మి దా.

గోర్కీ తిరిగి ఒంటరిగా రాలేదు. తనతో కూడా ఓల్గాను తీసికొని వచ్చేడు. ఆమె రూపం అతనెక్కడికి వెళ్ళినా అతని మనోనేత్రంముందు నుంచి చెరిగిపోలేదు. టిఫ్లిస్‌లోనే ఆమె ఉన్నట్లు ఒక రోజున తెలిసి, అతను మూర్ఛపోయేడు. అతని జీవితంలో మూర్ఛపోవడానికి అదే మొదటిసారి. ఆమెమీద గోర్కీకి అంత అధికప్రేమ కలిగింది.

అప్పటికి ఓల్గా మొదటి భర్తతో విడిపోయి, ఒంటరిగానే వుంటూంది. ముందునుంచి తామిద్దరూ భార్యాభర్తలుగా వుండవచ్చునని వారు తలచేరు. ఆమె అతనితో కూడా నొవోగ్రాడ్‌కి వచ్చేసింది.

ఒక పూజారి తోటలోని చిన్నయింటిని అద్దెకి తీసికొని అందులో వారు కాపురం పెట్టేరు. ఆపూజారి త్రాగుబోతు. ఆ చిన్నయిల్లు పూర్వం స్నానగృహంగా వుండీది. శీతకాలంలో ఆ యిల్లు చాలా చల్లగా వుండీది. నెగడి వెలిగిస్తే యిల్లంతా సబ్బువాసనా, భూర్జ పత్రముల వాసనా * తో ఉక్కిరిబిక్కిరి చేసేసేది.

నొవోగ్రాడ్‌లోని ఒక వకీలుదగ్గర గుమాస్తాగా చేరి పనిచేస్తూండీ వాడు. గోర్కీ. అతనిపేరు లానిన్; అతడు ఉదారభావములు గలవాడు. క్లయింట్లకు అప్లికేషన్‌లు, అపీళ్లూ రాస్తూ, దస్త్రాలు పట్టుకుని కోర్టుకు హాజరవుతూ, రోజంతా యేదో జంఝాటంలో మునిగివున్నా, రాత్రిళ్ళు

* ప్రతి గ్రామానికీ ఒకటికంటె యెక్కువే పబ్లికు స్నానగృహాలుంటాయి. ఆ దేశంలో అందరూ అక్కడికివెళ్ళి వేడినీటితో స్నానం, అభ్యంగనం వగైరాలు చేస్తారు, డబ్బు చెల్లించి. ఆవిరిస్నానాలుకూడా రోగుల కేర్పాట్లు చేస్తారు. రక్త ప్రసరణ బాగుపడి, ఆరోగ్యం కలగడానికై స్నానం చేసేవాళ్ళు భూర్జవృక్షపు రెమ్మలతో శరీరాన్ని తాడనం చేసుకుంటారు.

దీపం పెట్టుకుని కూర్చుని, బాల్జక్ మొదలైన వారి గ్రంథాల్నీ, తత్త్వ శాస్త్రాన్నీ పఠిస్తూండేవాడు. దూరదేశాలకి అందులోనూ యిండియా, సిలోన్ మొదలైన ప్రాగ్దేశాలకి వెళ్లాలని కలలుకంటూండేవాడు గోర్కీ నిరంతరం.

అతడు తరచుగా కథలు వ్రాస్తూండేవాడు. కాని వాటిని ప్రచురణకు పంపడాని కెంతో సందేహిస్తూండేవాడు. అంటే అదేదో తనకందరాని ఒక ఉన్నతలోకంగా భావించి, తన రచన లెంత పేలవముగాఉన్నవో అనుకుని అతడు వాటిని తిరిగి మూల బడవేసేవాడు.

ఒకసారి అతను 'ఎమిలియన్ పీలై' అనే కథను వ్రాసేడు. తాను, ఎమిలియన్ అనే మరొక బికారీతో కలిసి నల్లసముద్రపు వంచనేబడి, ఆకలితో ద్రిమ్మరిన కథంతా అందులో వర్ణించేడు. ఓరోజురాత్రి మైదానంలోనే పడుకుని ఉండగా ఎమిలియన్ తాను ఒకసారి ధనికునొకణ్ణి నెత్తిమొత్తి డబ్బు తీసుకోడానికి చేసినయత్నం యేవిధంగా విఫలమైందో చెప్పేడు.

గోర్కీ స్నేహితుడొకడు యీ కథను తీసికొనివెళ్ళి, మాస్కోలోని 'రస్కీయా విదోమోస్తీ' అనే పత్రికకు యిచ్చేడు. ఆ పత్రికలో తన కథను చూసి గోర్కీ ధైర్యం పొందేడు. అప్పటినుంచీ తాను రచించిన కథల్ని 'వాల్ఘుస్కీ విస్త్నిక్' అనే 'కాజాన్' పత్రికకు పంప నారంభించేడు.

కాజాన్ నుంచి గోర్కీకి ముప్పైరూబుళ్ళకు చెక్కు వచ్చింది. ఆ చిన్నమొత్తమే, అతనికి పెన్నిధిగా తోచింది. ఒక్కసారి ముప్పై రూబుళ్ళు!

గోర్కీ కథలను కొరొలెంకో చదివి, ఆశ్చర్యపడ్డాడు. ఈ చిత్రపు పేరుతో రాస్తూన్న యీ కొత్త రచయిత యెవరైవుంటారా? అని

అతడు తల బ్రద్దలుచేసుకుని ఆలోచించేడు. చివరకి అతన్ని కలుసుకోవాలని, భోగట్టా తెలుసుకుని, పట్టణంబైట నున్న కొయ్య యింటికి వచ్చి తలుపు తట్టేడు. 'పలితవృక్షం' కావ్యాన్నివ్రాసి తనకు చూపించిన ఆ యువకుడే 'గోర్కీ' అని తెలుసుకుని అతడు చాల ఆనందాన్ని పొందేడు. పుస్తకాలు, పత్రికలు, పువ్వులుతో నిండిన ఆ చిన్న గదిలో కూర్చుని, సాహిత్యమును గూర్చి, రష్యానుగూర్చి, దారిద్ర్యం-అశాంతి పీడించగా దిక్కూ-తెన్నూ తోచక రోడ్డమ్మట బికారీగా తిరిగే అసంఖ్యాకులగు తమ సోదర మానవులనుగూర్చి, తమదేశ దౌర్భాగ్యాన్నిగూర్చి.- ఎంతోసేపు వారిరువురూ మాట్లాడుకున్నారు.

గోర్కీని కొరొలెంకో యెంతో శ్లాఘించేడు.

"నీ శైలిలో ప్రత్యేకతవుంది. అంతా స్పష్టంగా తెలుస్తూంటుంది. కాని లోపాలు లేకపోలేదు. కొంచెం మెరుగులు దిద్దాల్సి వుంది. ఐనా, మొత్తంమీద అద్భుతంగా వున్నాయి, కథలు" అన్నాడు.

"ఐతే నేను రాయగలనంటారా?" అనడిగేడు గోర్కీ.

"రాయగలనా? అంటారూ! అదేంప్రశ్న! అప్పుడే రాసేస్తేనే! ప్రచురణ కూడా అవుతూంది. మీకు కావలసిందేమిటింక? సలహా కావాలంటారా? తేండి, వ్రాతప్రతులు యిట్లా తీసుకురాండి, చూద్దాం." అన్నాడు, కొరొలెంకో. అతనెంతో శ్రద్ధతో, సమర్థతతో గోర్కీకి గురుత్వాన్ని నెరపేడు. కొరొలెంకో వంటి గొప్ప కళావేత్త, కవి, సలహా, సహాయంకంటె కోరదగిందేముంటుంది, గోర్కీకి?

కొరొలెంకో సలహాలు చాల సాధారణమైనవేగాని, అత్యవసరమైనవీ, రూపురేఖలు దిద్దగలవీకూడా ఐవుండీది. వాగాడంబరం వుండే సమాసాలూ, మాటలూ దొర్లించవద్దనీ భావప్రకటన కవసరమైనంత వరకే పదప్రయోజనమనీ, అనవసరంగా మాటలు ఖర్చుచేయకుమనీ,

ఎప్పుడూ మానవుల్ని ఆదర్శంగా, లోపరహితంగా చిత్రించవద్దనీ,- యిట్లాటి సలహాలెన్నో యిచ్చేడు. వాటిని గురూప దేశాలుగా స్వీకరించి, యువకుడు గోర్కీ తన మనస్సులో భద్రపరచుకొన్నాడు.

కడపట స్నేహపూర్వకంగా గోర్కీ నాచిన్నపట్టణం వదలివేయమని సలహా యిచ్చేడు. గోర్కీ యొక్క ఆర్థికదుస్థితి, పురాతన స్నాన గృహంలో అతని దుర్భరనివాసం, గృహస్థజీవితంలోని అసమాన అసహజ సంబంధాలు,- యివన్నీ కొరొలెంకో వినే వున్నాడు.

ఈ పరిస్థితులిట్లే యింకెంతో కాలం కొనసాగ వీలులేదని గోర్కీయే గ్రహించేడు. తనూ, ఓల్గా విడిపోవడమే మంచిదనీ, శ్రేయస్కరమనీ అతడు అప్పటికే అనుకుంటున్నాడు. అతను ఓల్గాను ప్రేమిస్తూన్నా, ఆమె చిలిపితనం, బాహ్యాడంబరం, విద్యాభావశూన్యతా గ్రహించకపోలేదు. ఇద్దరివీ వేరువేరు లోకాలు, వేరువేరు మార్గాలు. అతని సాహిత్య కృషిపట్ల, గ్రంథపఠన పట్ల, మానవసేవాపరాయణత పట్ల ఆమె కెట్టి సానుభూతీ లేదు. కనీసం అర్థం చేసుకోడానికీ, అతని కృషినీ, భావాల్నీ గౌరవించడానికీ కూడా ఆమెకు శక్తిలేదు.

చివరకు గోర్కీ, ఓల్గా శాశ్వతంగా విడిపోయేరు. 'సమర్స్కయా గెజతా' సంపాదకవర్గంలో పనిచేయ రమ్మని గోర్కీని కొరొలెంకో ఆహ్వానించేడు. పిటిషన్‌లు, అపీళ్లు రాయడం, బిళ్ళలంటించడం, కోర్టుకు హాజరు కావటం,-పగలల్లా యీబాధ. ఇంక రాత్రంతా ఆకొయ్యకొంపలో నల్లులూ, కత్తెరవెదలు, బొద్దీగలతోను యుద్ధం; సంసారం గడవడం యెట్లా అని నిరంతరం ఆరాటం.- ఈ బాధలతో విసిగివున్న గోర్కీ, యీమాదిరి జీవితాన్నుంచి విముక్తి యెప్పుడు దొరుకుతుందా అని చూస్తున్నాడు. వెంటనే అంగీకరించి సమారా పట్టణానికి వెళ్లిపోయేడు.

సమారా నగరంలో గోర్కీ జీవితం పెద్ద మార్పు పొందింది. అంతవరకూ అతని కధలు కొద్దిగా పత్రికల్లో ప్రచురించబడినా, అతని వృత్తి చెప్పాల్సి వస్తే,-అదివరకటి రకరకాల పనులుగాక,-చాలీచాలని జీతపురాళ్ళతో జీవించే ఒక ప్లీడరు గుమాస్తా అనే చెప్పాలి మరి కాని, సమారా నగరంలో అతను రచయితగా, జీవితాన్ని మొట్టమొదటిసారి ప్రారంభించేడు.

మామిన్ శిబిర్యాక్, గారిన్ మైఖలోవ్‌స్కీ మొదలైన సుప్రసిద్ధ రచయితలుకూడా 'సమర్‌స్కాయా గెజతా' లో తమ కధల్ని ప్రచురిస్తూండే వారు. ఆ పత్రికలోకి వీరందరితో బాటుగా యిప్పుడు గోర్కీ రచనలు కూడా యెక్కినాయి. ప్రతి ఆదివారం సంచికలోనూ గోర్కీ కధ ఒకటి పడేది. పాఠకులంతా దానికై యెదురు చూసేవాళ్ళు. గోర్కీ, తరగని తన అనుభవాలనే కధావస్తువులుగా తీసికొని, అద్భుతంగా చిత్రించేవాడు. బందిలాగు శిక్ష, సంకెళ్లు, ఒక శీతకాలపు రాత్రి,- మొదలైన కధలన్నీ అతని అనుభవాలనుంచి తీసినవే.

అంతేగాక స్థానిక విషయాల్ని గూర్చి విమర్శిస్తూ వ్యంగ్య 'లేఖాపత్రాల్ని' రచించేవాడు. ట్రామ్ సర్వీసును గూర్చి, మునిసిపల్ పార్కు, నగరరౌడీలు, ధాన్యవ్యాపారులు, నాటకశాల, ధర్మహాస్పిటల్, మునిసిపల్ కౌన్సిలు వగైరాలలోని లోపాల్ని గూర్చి, నిర్మొహమాటంగా, ఖండితంగా వ్రాసేవాడు. వీటిని 'యగూదిల్ ఖ్లామిదా' అనే మారుపేరుతో వ్రాసేవాడు. ఒకసారి గారిన్ మైఖలోవ్‌స్కీ, గోర్కీ యిద్దరూ కలుసుకోడం తటస్థించింది. గారిన్ నిర్మొహమాటంగా అన్నాడు : "మీరు లేఖాపత్రాల్ని వ్రాయడంలో అంత నేర్పరులుగారు. మీదగ్గర హాస్యధోరణి, మోటుగా - అప్రయత్నంగానే ఛమత్కరించే స్వభావం వుంది. కాని, ఆ చాతుర్యాన్ని యేవిధంగా నేర్పుగా ప్రయోగించి, దెబ్బకొట్టాలో తెలియదు." గోర్కీకి కూడా తన లేఖాపత్రాలు

అంత గొప్పగా లేవని తెలుసు. ఇట్లాటి 'ఫీచర్ రైటింగు' (టుమ్రీలు రాయడం) అంటేనే అతననేవాడు: "దాని తగులబెట్టిన పనిలేద్దూ!"

గోర్కీ కథలలో వున్న విశేషం 'లేఖాపత్రాల్లో' కొరవడినా, వాటి పనినవి నెరవేర్చేవి. సమారాలో తిరుగులేని అధికారం చెలాయించే ధాన్యపు వ్యాపారుల్నీ, పశువుల వర్తకుల్నీ, వారి కుట్రల్నీ బైటపెట్టి వాళ్ళ నగ్నస్వరూపాన్ని అవి చూపేవి. ఈ ఆయుధంతోనే పేదలైన కార్మికుల్నీ, బీదల్నీ, సేవకుల్నీ, అనాథల్నీ సమర్థిస్తూ వుండేవాడు.

సమారాలో వున్నంతకాలం గోర్కీ ఏకాంతజీవితాన్నే గడిపేవాడు. వోల్గాతీరాన్నే వున్న చిన్నయింట్లో వుంటూ నిరంతరం గ్రంథపఠన చేస్తూండేవాడు. గాఢాంధకారంలోంచి దారి తెలుసుకుని బైటపడి తన ముందు దారి తెలుసుకున్నవాడు ఎట్లా యేకాగ్రంగా చేయిదాటిన కాలాన్ని కూడదీయాలని పనిచేస్తాడో ఆమాదిరిగా అవిరామంగా పని చేసేవాడు.

సమారాకి వచ్చిన కొత్తలోకూడా అతని రాతల్లో పదస్ఖాలిత్యాలు దొర్లుతూండేవి. కాని, తీవ్రకృషి సల్పి, యీలోపాన్ని దిద్దుకో గలిగేడు. లెర్మాంటోవ్, బరిటిన్‌స్కీ మొదలైన కవుల పద్యాలన్నీ కంఠస్థం చేసేడు. షేక్స్పియర్, గెథే, డికెన్సు, మపాసా, థాకరే, హ్యూగో మొదలగు విదేశీయుల రచనలన్నీ స్వభాషలో చదివేడు. అప్పటి కింకా రష్యాలో ప్రజారక్తిని పొందియుండని ఫ్లాబర్ట్, స్టెన్‌ధాల్ మొదలైన ఫ్రెంచి రచయితల రచనలీతనికి నిరంతర స్నేహితులు. రష్యన్ రచయితల గ్రంథాలన్నీ కొట్టినపిండిగా వున్నవే. చిన్నతనంలో విద్యాభ్యాసం గావింపని లోపం క్రమంగా అధిగమించి, అతని రచనలు, ఆత్మవిశ్వాసంతో నిండి తొణికిసలాడీవి. రోజుల తరబడిని యింట్లోంచి కదలకుండా ఏదో రాస్తూనో, చదువుతూనో వుండి పోయీవాడు. అతని గదిలో ఒక యినపమంచం, పుస్తకాల షెల్ఫులు, కాగితాల కట్టలతో

నిండిన దేవదారు టేబిల్ ఒకటీ. యింతే ఆతని సామాను. పగలుచాలక చాల రాత్రి వరకు కూడా పనిచేస్తూనే వుండీవాడు.

వాజ్నిసెన్‌స్కీ వీధిన పోయీవాళ్లు తెల్లవారుఝామున కూడా గదిలో దీపంవెలుతురులో కాగితాలలో మునిగిపోయివున్న గోర్కీని చూసే వాళ్ళు. జుట్టు చెల్లాచెదరుగా మొహం అంతాపడి, దృష్టిని రాతమీదే కేంద్రీకరించి. ఉదయిస్తూన్న సూర్యకాంతిలో దీపం వెలవెలబోతూన్నా గమనించని ఆ యువకుడే గోర్కీ.

గోర్కీ సమారాకు వచ్చినప్పటికి స్థానిక జర్నలిస్టులు ఒక పెష్కోవ్‌ని గూర్చి వినివున్నారు. అతడు కోసక్కు ఆఫీసరు. సైబీరియానుంచి పీటర్సుబర్గుకు గుర్రంమీదే ప్రయాణంచేసి ప్రఖ్యాతుడైనాడు. 'సమారా స్కాయా గెజెతా' సంపాదక వర్గంలోని కాహ్వానించబడినవాడు ఆఫీసరు పెష్కోవ్ గాదనీ, బికారీ పెష్కోవ్ అనీ స్పష్టీకరించాల్సి వచ్చింది।

ఒక సంవత్సరములోనే గోర్కీ ప్రతిభ వెల్లడియై, అతని కీర్తి రష్యాఅంతటా వ్యాపించింది. ప్రతి పట్టణంలోనూ పత్రికాధిపతులాతన్ని తమతమ పత్రికల్లోకి తీసికోవాలని ఉవ్విళ్ళూరేవాళ్ళు. 'నిఝనీగ్రాడోస్కీ లిస్టోక్' పత్రికనుంచి కూడా ఆహ్వానం వచ్చింది. గోర్కీ తిరిగి తన స్వస్థలానికి నొవోగ్రాడ్‌కి వచ్చేసేడు.

8 వ ప్రకరణము

## కీర్తి

నొవోగ్రాడ్ పూర్తిగా మారిపోయింది. ఇదివరలో వీధుల్లో వెడుతూంటే బళ్ల యిరుసుకి పెట్టే కొవ్వూ, కేబేజి పులుసూ, ఎండుచేపలూ ఇల్లాటివాటి వాసనలే వేసేవి. వాటికి తోడుగా యిప్పుడు, కొత్త వార్నీషు రంగులు, తారువాసనలు కలిసినాయి. ప్రతీచోటా కొత్త యిళ్ళు అలంకరిస్తూన్నారు; తారు రోడ్లూ, ప్రక్క చప్టాలూ నగరమంతా నిర్మిస్తున్నారు.

రష్యా అంతా కొత్తగా బైలుదేరే యంత్రపరిశ్రమలతో శోభగా వుంది. 'అఖిలరష్యా పారిశ్రామిక ప్రదర్శనం' నొవోగ్రాడ్‌లో ఆయేడు ఏర్పాటు చేస్తున్నారు. రష్యాలోవి పెట్టుబడిదారుల శక్తినీ సామర్ధ్యాన్నీ యూరోపుకు చాటాలనీ, వివిధపారిశ్రామిక వస్తువులను ప్రజల్లో వ్యాప్తం చేయాలనీ దాని ఆశయం.

పట్టణం వెలుపల బీదల మురికి కూపాల నానుకునేవున్న ఓ పెద్ద బయలులో వందలకొద్దీ గుడారాలు చూస్తూండగానే లేచేయి. కొన్ని కోణాకారంగా, మరికొన్ని అంతస్థులుగా, రకరకాలుగా అలంకరించబడి, వస్త్రాలు, నారవస్తువులు, బొమ్మలు, రంగుల పింగాణీసామాన్లు, బుటేదారీ దుస్తులు, ఫోర్కులు, చర్మములు, ఒకటేమిటి రకరకాల వస్తువులతో నిండి వున్నాయి. వ్లాడిమిర్ గుబర్నియా నుంచి ప్రత్యేకంగా ఎగ్జిబిషన్‌కోసం రప్పించిన గోపాలురు పొట్టేలు కొమ్ము బూరా లూదుతూన్నారు. రష్యన్ జాతీయ దుస్తుల్లో వున్న ఒక యెర్రజుట్టు మనిషి చిరుగంటలను లయప్రకారం మ్రోగిస్తూ "జయము! జయము! మన జారు చక్రవర్తికి!" అనిపిస్తున్నాడు. బంగారుతో చేయబడిన రెండు తలల గ్రద్ద, ఈ ఎగ్జిబిషన్ మీద తళతళా మెరుస్తూంది. పైన ఆకాశంలో ఓ పెద్ద గాలి గుమ్మటం ఎగురుతూంది.

రెండో నికోలస్ చక్రవర్తి ప్రదర్శనం ప్రారంభించేసేడు. అతని గౌరవార్థమై కొవ్వొత్తులతో దేవతార్చనమందిరాన్ని నిర్మించేరు. రంగు రంగుల సీసాలతో విజయతోరణాల్ని కట్టేరు.-సబ్బుతో చక్రవర్తి కుటుంబీకుల విగ్రహాల్ని తయారుచేసేరు.

ఆ ప్రదర్శనం దేశసంపదకీ, పాలకుల దివాలాకోరుతనానికీ కూడా కొలబద్దగా వుంది.

కుటీర పరిశ్రమల్లో తయారుచేసిన 'పియానో' ఒకటి ప్రదర్శించేరు. దానిలో తీగలకు మారుగా యెద్దునరాల్ని అమర్చేరు. పాత బండీలా, యిటూఅటూ ఊగుతూ, దడదడ-కటకట శబ్దాల్ని చేస్తూందది!

మరో గొప్ప మేధావి ఒకయంత్రాన్ని (యిదీ దేశీయమే!) ప్రదర్శించేడు. అతని వినీతాభిప్రాయం ఏమంటే, యీ యంత్రం యింజనీరింగులోనే మహావిప్లవాన్ని తెచ్చి తీరుతుందని. చివరకది హిమప్రళయానికి పూర్వం వుండదగిన చిన్న రెండు చక్రాలబండీ అని తేలింది.

సబురిజిస్ట్రారుగా పనిచేసి రిటైరయిన ఓ అసామీ తానే కనిపెట్టేనంటూ ఓ తమాషా సాధనాన్ని ప్రదర్శించేడు. దానితో గుర్రాలమీది జోరీగలను పట్టుకోవచ్చునని అతనంటాడు. దాన్ని గుర్రాలమీద ప్రయోగించేసరికి వాటికి పిచ్చిపట్టినట్లు గంతులూ, ఎగురులూ ప్రారంభించేయి!

సజీవంగావున్న 'వాల్‌రస్' అనే సముద్ర జంతువునీ, పావ్‌లోవ్ పారిశ్రామికులు తయారుచేసిన ఫోర్కులు; పాయికానాల్లో ఉపయోగించే పింగాణీ తొట్లూ, ఇతరసామగ్రీ, యిట్లాంటివే యెన్నో చూపించేరు. కాని, వ్రూబెల్ అనే సువిఖ్యాత రష్యన్ చిత్రకారుడు వ్రాసిన కాన్వాసు చిత్రాన్ని ప్రదర్శనంలో పెట్టనీలేదు!

ప్రదర్శన ప్రేక్షకులు కోరితే గాలిగుమ్మటంమీద ఆకాశంలోనికి పోవచ్చు. చాలమంది పోగై చోద్యంగా చూస్తూన్నారు, గుమ్మటాన్ని.

ఓ ముసలి వర్తకుడు పిల్లిగడ్డం ఆడించుకుంటూ, అందరితరఫునా వకాల్తా పుచ్చుకున్నట్లుగా సంభాషణ ప్రారంభించేడు.

"ఈ యేర్పాటు చేసినందుకు మేమంతా సంతోషిస్తున్నాము. ఐతే, మరి.....మీరు యీ గాలిగుమ్మటాన్ని ఒదిలిపెడితే దేవుడిదగ్గిరికి పైకి యెగిరిపోగలదా? ఉఁహుఁ? వెళ్ళదంటారా? సరే, ఐతే, మేము ఆకాశంలో దిక్కూ తెన్నూ లేకండా దేవుళ్లాడ్డం ఎందుకూ అంటా? కలి ప్రేరేపణ కాకపోతే యీ అఘోరింపేమిటంటా?"

ప్రదర్శన విశేషాలతో పేపర్లన్నీ నిండిపోయినాయి.

కోణాకృతిలో కట్టిన వెదురుపేళ్ళ అల్లిక కుటీరాలూ, రంగుసీసాలూ, కాగితాలూ, గాజులూ, వ్లాడిమిర్ గోపాలుర కొమ్ముబూరాలు, పావ్లోవ్ ఫోర్కులూ, యీ సరుకంతా,- పత్రికా విలేఖరులు - సంపాదకులు అభిప్రాయంలోనేలెండి.-జార్ సామ్రాజ్యపు వైభవాన్నీ, బలాన్నీ ప్రదర్శిస్తూన్నాయనీ, వేనోళ్ళ చాటుతూన్నాయని తెగరాసి పారేశాయి, పత్రికలు!

గోర్కీ పత్రికకూడా ప్రదర్శనాన్ని గూర్చి కొన్ని వ్యాసాలు వరుసగా ప్రకటించింది. అవి అతనే వ్రాసేడు. సమారా పత్రికలో ట్రామ్ సర్వీసునుగూర్చీ, పార్కునుగూర్చీ రాసినట్లుగాదు. యిప్పుడు యావత్ రష్యానూ ఆకర్షించిన ప్రదర్శనాన్నిగూర్చి రాయాలి; రాసేడు. అవి ప్రదర్శనాన్నీ, దేశంలోని ధనిక ఉద్యోగవర్గాన్నీ, ప్రభుత్వాన్నీ తూర్పారబట్టి, నగ్నంగా చూపించేయి.

* కుటీరాలు, నూనెలు, బంగారు, విగ్రహాలు, తివాచీలు, తోలుపని, నబ్బులు,-యివన్నీ ప్రదర్శించేరు బాగానేవుంది. కాని, వీటిని తయారు చేసినవాళ్లెవళ్ళు? వాళ్లేపరిస్థితుల్లో వీటిని తయారుచేస్తున్నారు? వాళ్ళ

* మన దేశంలోని వివిధ వస్తుప్రదర్శనాలు చూస్తూంటే మీకీ విషయాలు గుర్తుకు రావూ?

జీవితం ఏమిటి? అని కూడా అతడు అందరికీ చూప ప్రయత్నించేడు. కుటీరాలు కట్టి, అలంకరించే కూలీల బ్రతుకేమిటి? నూనెలు గానుగాడే వాళ్లు, బంగారుతీసే గనికూలీ, తోళ్ళు ఊరబెట్టి పదునుచేసేవాళ్ళు, నబ్బు చేసేవాళ్ళు -వీళ్ళు జీవితాల్ని ఎట్లా గడపుతున్నారు? గోర్కీకి యీవృత్తి యేదీ తెలియనిదికాదు. అంతా స్వానుభవమే. ఆ వ్యాసాల్లో మానవులుగా పుట్టి, జంతువులుగా జీవిస్తూన్న, యీ పేద కష్టజీవుల్నిగూర్చి కళ్ళకి కట్టినట్లుగా రచించిడు, గోర్కీ.

ఈ రోజుల్లోనే 'స్టెప్పీలో' 'కానోవలోవ్' 'మానవులుగా జన్మించిన పశువులు' మొదలైన కథలు వ్రాసి ప్రకటించేడు. ఇవన్నీ ఈ సమయం లోనే వ్రాసి, ప్రకటించడంలో గోర్కీ ఉద్దేశ్యం ఒకటే -పెద్ద బడాయిగా దేశవైభవాన్ని ప్రదర్శిస్తూన్న యీ ఎగ్జిబిషన్‌కి వచ్చి మూగుతూన్న లక్షలాది ప్రజలకు "అదిగో! ఈ ఆడంబరానికి క్రింద యేముందో చూడండి! మీకు దగ్గరలోనే ఒకప్పుడు మానవులుగా జన్మించినా, నేడు బహుహీనస్థితిలోవున్న కోట్లాది సోదరుల్ని చూడండి! బికారులు, ద్రిమ్మరులు, బిచ్చగాళ్ళు, త్రాగుబోతులు, వ్యభిచారులు, ఏపనీలేనివాళ్ళు, ఏపని చేయనివాళ్ళూ,-వీళ్ళందర్నీ చూసి, మీరేమంటారు? ఈ తప్పెవరిది?" అని హృదయాలకి బట్టేటట్లు సూటిగా చెప్పాలి. ఈ తప్పంతా చదువుకున్నవాళ్ళదీ, ధనికులదీ మాత్రమేగాదు. అధికారులదీ, చక్రవర్తిదీ,-ప్రధానంగా యీ మహాపాపం అంతా! అని నొక్కిచెప్పదలచేడు.

* * * *

గోర్కీ యీ సమయంలోనే జబ్బుపడ్డాడు. ఆకలి, బీదతనంలోనూ గడిపిన కౌమార జీవితం, శీతవాతాతపవర్షములకు గురియౌతూ, వెన్ను విరిగే చాకిరీచేస్తూ, ద్రిమ్మరిగా దేశాటనం చేయడం, పొట్టలో దూరిన తుపాకిగుండూ, ప్రస్తుతం రచయితగా అతడు రాత్రింబగళ్లూ

అవిరామంగా పనిచేయడం.- యివన్నీ కలిసి అతని ఆరోగ్యాన్ని పీల్చేశాయి.

క్షయ చిహ్నాలు కనిపిస్తున్నా, గోర్కీ తన రచనావ్యాసంగం, గ్రంథ పఠనం మానలేదు. క్రమంగా అతని ఆరోగ్యం మరీ అధ్వాన్నస్థితిలోకి పడుతూంది. గోర్కీ తిరిగి కోలుకోడం అసాధ్యమని యెందరో మిత్రులు కూడా భయపడనారంభించేరు. డాక్టర్లు గాలిమార్పుకి దక్షిణానికి వెళ్ళాలన్నారు. క్రిమియాలో కొంతకాలం ఉండి, అక్కణ్ణించి యుక్రేన్‌లోని 'మన్యులోవ్కా' అనే చిన్న గ్రామంలో మకాంపెట్టేడు, గోర్కీ.

ఈ ప్రశాంత గ్రామంలో గోర్కీకి చాల అభివృద్ధి కనిపించింది. అక్కడి వాతావరణమంతా అతనికి యెంతో ఆహ్లాదకరంగా వుందనిపించింది. పెద్దపార్కు. పురాతన వృక్షముమీది తొర్రలోని ఉలూక కుటుంబం, చేపలతో నిండిన చిన్ననదీ, రాత్రి 'కంగ్' మని కొట్టే చర్చి గంటలూ,-ఒకటేమిటి. ఆ గ్రామంలో ప్రతిఒక్కటీ గోర్కీ మనసుకి ఉల్లాసాన్నే కలిగించేవి.

క్రిమియా, మన్యులోవ్కాల నివాసంవల్ల గోర్కీ తిరిగి ఆరోగ్యాన్ని సంపాదించుకోగలిగేడు. నొవోగ్రాడ్‌కి వచ్చేక తిరిగీ సాహిత్య వ్యాసంగంలో ఉరికేడు. తన కథల్నీ, స్కెచెస్‌నీ రెండు సంపుటాలుగా కూర్చేడు. ఆ పుస్తకాల్ని ప్రచురించేవాళ్లు దొరకడానికే కొంతకష్టం అయింది. ఏవో చిల్లరపత్రికల్లో మాత్రమే అంతవరకూ గోర్కీ రచనలు పడినాయి. అటువంటపుడు వాటిని ప్రచురించడానికి యెవరికేనా జంకు వుండకమానదు.

ఈ చిన్న సంపుటాలు రెండూ యెట్టకేలకు వెలువడినాక, ప్రజలు వాటి నత్యాతురతతో స్వీకరించేరు. సాహిత్య ఆకాశంలోని యీ నూతన తారను అందరూ మెచ్చుకోనారంభించేరు. గోర్కీ పుస్తకాలు వేలకొద్దీ అమ్ముడుబోతున్నాయి.

రష్యన్ ప్రజాజీవితంలోని చీకటికోణాల్నీ, మురికి పురుగులోడి రోగ గ్రస్తమైవున్న పుండ్లలాంటి ప్రమాద ప్రదేశాల్నీ విద్యుత్కాంతులు ఒక్క సారిగా వెలుతురులోనికి తెచ్చినట్లైంది. వెలుతురు, గాలి, వేడిమి తాకి యింతవరకూ మరుగున వున్న యీ దృశ్యాలుచూసి ప్రజలు విభ్రాంతు లయ్యేరు. ఈ ప్రపంచంలో యిటువంటి మానవులున్నారా? అనిపిం చింది. అతడు యేమీ దాపరికం, గుంభన చేయలేదు. అంతేగాదు. "అయ్యయ్యో! అంతా పాడుకాలం వచ్చిందోయ్! బాబూ! ధర్మం నశించిందోయ్!" అని శోకన్నాలు పెట్టే ధర్మపన్నాలూ గావవి. నిరాశ, నిస్పృహ, నిస్సత్తువతో గూడిన మాటలూగావు గోర్కీవి. న్యాయం, ధర్మం, మానవత్వం,- వీటియందు అతని అచంచల విశ్వాసం, చివర కివి జయించితీర్తాయనీ, జీవితమే సిద్ధాంతం అయితీరుతుందనీ అతని వాణి దిగంతాలకి వినిపించేలా యెలుగెత్తి ఘోషించింది.

ధర్మవేత్తలు, న్యాయపరులు, నీతివంతులు, సర్వజ్ఞులు అనబడేవాళ్లు చెప్పిన ధర్మపన్నాలూ, అరణ్యరోదనలూగావు, గోర్కీ రాతలు! అతని మాటల్లో జీవం, విశ్వాసం నిండి తొణికిసలాడుతూ, చదువరుల హృద యాల్ని కదిలించేస్తున్నాయి.

గోర్కీ మొదటి రెండుపుస్తకాలు అతని కీర్తినే తెచ్చినయ్.

ఈ నూతన సాహిత్యకారుని పేరు యితర సమకాలీనులైన కవి సామ్రాట్టుల, సార్వభౌముల పేరులతో కలిపి ఉచ్చరించబడ నారంభిం చింది. టాల్‌స్టాయ్, చెకోవ్ మొదలైన అతిరథ మహారథులతో గోర్కీ తన రథాన్ని ముందుశ్రేణిలో నిలబెట్టేడు.

9 వ ప్రకరణము

## మిటిఖ్ దుర్గం - నొవోగ్రాడ్ జైలు.

"ఏకచ్ఛత్రాధిపత్యం యొక్క ద్విశిరోగృధ్ర చిహ్నం కేవలం సామ్రాజ్యంయొక్క రాజలాంఛనమే గాదు; సజీవమై నిరంతరం రక్త పిపాసువైన క్రూర పక్షికూడా అదే।"

(గోర్కీ : 'పనితనం - బాతాఖానీ')

గోర్కీ కీర్తి బహుతీవ్రంగా నాలుగుమూలలా వ్యాపించిపోయింది. జార్ చక్రవర్తి ప్రభుత్వాని కిది ఆందోళనాకారణంగా త్వరలోనే తయారైంది. గోర్కీ తమకు సహజ శత్రువని అధికారులు తెలుసుకున్నారు. ఈ యువరచయితకీ, రష్యా ప్రభుత్వానికీ మధ్య యుద్ధం ప్రకటించబడింది. ఇందులో చాటుమాటు యేమీలేదు. అంతా బహిరంగమే. ఈ యుద్ధమే నిరంతరాయంగా యిరవై దీర్ఘసంవత్సరాలకాలం నడిచింది.

టిఫ్లిస్ నగరంలో పోలీసులు అవినాశియేవ్ అనే విప్లవకారి కార్మికుణ్ణి అరెస్టు చేసేరు. అతని గదిని వెతికినప్పుడు ఒక ఫొటోగ్రాఫ్ కనిపించింది. దానిక్రింద "ప్రియమైన ఫెద్యా అవినాశియేవ్‌కి, మాగ్జిమిచ్ జ్ఞాపకార్థంగా" అని వ్రాసివుంది. ఈ 'మాగ్జిమిచ్' యెవరో కూపీతీసేరు, పోలీసువాళ్ళు.

నొవోగ్రాడ్‌లో గోర్కీని అరెస్టుచేసేరు. అతన్నికూడా టిఫ్లిస్‌కి తెచ్చేరు. రాజకీయ ఖైదీలకై ప్రత్యేకించబడిన మిటిఖ్‌దుర్గంలో యితన్ని బంధించేరు. (1898 ఏప్రిలు)

జైలుకొట్టులో పచారుచేస్తూ, తనను యీ దుర్గంలో ప్రత్యేకంగా యెందుకు నిర్బంధించి, బాధిస్తూన్నారా? అని గోర్కీ ఆలోచించేవాడు. కిటికీలోంచి దూరంగా పాషాణ నిర్మితమైన కోటగోడలూ, బురుజులూ కూరానదిలోని బురదనీటి ప్రవాహాన్నీ, నదీతీరాన్నున్న కొయ్యయిండ్లనీ చూస్తూ రోజులు గడుపుతూన్నాడు.

వార్డరు తాళాలు చప్పుడు చేసుకుంటూ, వసారాలో తిరుగుతూండే వాడు. ఎప్పుడేనా వాడికి విసుగు కలిగిందా ఖైదీలని తిట్టుకుంటూండే వాడు. "మీరిల్లాగే, యిక్కడ యింకో పదేళ్ళు పాతుకుపోవాలి!" వాడి మాట చలవని చాలమంది పదేమిటి, యిరవైయేళ్ళు కూడా అందులోనే పాతుకుపోయి. చివరకక్కడే మట్టి ఐపోయేవాళ్ళు. కాని, గోర్కీమీద నేరం ఋజువు చేయలేకపోయేరు పోలీసులు. అంచేత గోర్కీ త్వర లోనే విడుదలపొంది, నొవోగ్రాడ్‌కి వచ్చేసేడు.

అప్పటినుంచి అతనిమీద పోలీసు నిఘావేసింది, ప్రభుత్వం. గోర్కీ నివసిస్తూన్న రెండంతస్థుల కొయ్యయింటిచుట్టూ విడ్డూరపు మనుష్యులు తిరుగుతూండేవాళ్ళు. ఓ ఆసామీ యెదురుకుండానే ఓ కొయ్య బెంచీమీద కూర్చుని ఆకాశంకేసిచూస్తూన్నట్లేనటిస్తూండేవాడు; మరోగ్రంధసాంగుడు ఓ పాతపేపరు పుచ్చుకొని, సమీపంలోనే వున్న దీపస్థంభాన్ని జేర్లబడి, అది పఠించడంలోనే మునిగిపోయి వుండేవాడు; యింకో జట్కావాలా గుమ్మాని కెదురుగానే బండీ నిలబెట్టి, కునికిపాట్లు పడేవాడు. అతడు గోర్కీకి గాని, అతని యింటికి వచ్చిపోయేవాళ్ళ కెవరికైనాకానీ, యెక్కడికైనాసరే, మారుమాటాడకండా బండీ కట్టేవాడు. కిరాయి యివ్వకుండా కూడా కట్టడానికి వాడికేమీ అభ్యంతరం లేదుసుమండీ, చెప్పొద్దూ, ఏమాటకామాటే. మరొకరికైతేనా, అబ్బే. ఛస్తే వాడు బండి కట్టడుగాక కట్టడు. అది వాడియిష్టం.' మనలో మనమాట, సుమండీ, యీ ఆకాశదృష్టివాడూ, పత్రికాపాఠకుడూ, జట్కావాడూ,- వీళ్ళంతా ఆ బాపతే. ఏదీ? సి. ఐ. డీ వాళ్ళంటామే, ఆబాపతు!

వీళ్ళు గాదు యింకో అంతమందున్నా గోర్కీ యింటికి వచ్చేవాళ్ళని లెక్కపెట్టగలరా? అసంఖ్యాకజనం, యెల్లవేళలా గోర్కీ యింటికి వస్తూపోతూనే వుండీవాళ్ళు. అతని గదిలో వస్నెట్సోవ్, లెపీటన్ మొదలైన సుప్రసిద్ధ చిత్రకారులు వ్రాసిన పటాలు గోడలకి వ్రేలాడు

తూండేవి. అక్కడ కూర్చుని వచ్చేవాళ్ళతో మాట్లాడుతూండేవాడు గోర్కీ. నటకులు, మేస్త్రీలు, కళాకారులు, విదేశీయులు, యాత్రీకులు, విద్యార్థులు, కార్మికులు, హైస్కూలు పిల్లలు, రకరకాల జనం ప్రవాహంగా వస్తూ పోతూండేవాళ్ళు.

నొవోగ్రాడ్ నుంచి యల్. వి. శ్రీదిన్ అనే స్నేహితుని కారోజుల్లో గోర్కీ రాసిన జాబు చూస్తే, అతని దినచర్య కొంతమటుకు అర్థం అవుతుంది.

"నన్ను కలుసుకోడానికి రోజూ ఎంతోమంది వస్తూంటారు. ఒకడేదో పుస్తకం కావాలంటాడు. ఇంకోడు పద్యాలు, పాటలూ చదువుతాడు.... అప్పుడే ప్రవాసశిక్ష పూర్తిచేసుకుని వచ్చిన ప్రెస్ కార్మికుడు నన్ను చూసిపోడానికి వస్తాడు. ఆ తర్వాత వైస్-గవర్నరు భార్య యేవో నిషిద్ధ కరపత్రాలు తీసికొని వచ్చేది. ఆ వెనకాలే కుట్టుపనిచేసే ఆమె వచ్చింది.. ఆమెకేసు వాయిదా దగ్గర్లోకి వచ్చిందిలే....ఆ తర్వాత స్థానిక ఫిరంగి దళం బ్రిగేడు కమేండర్ వచ్చేడు, తన పటాలంవాళ్ళకి యేదో నాటకం యేర్పాటుచేయమని. దేవుణ్ణి గూర్చి హృదయం విప్పి మాట్లాడుకోవాలి ఒక్కమాటని అడుగుతూ ఆ వర్తకుడున్నాడే 'బుగ్రోవ్' అతడు వచ్చేడు. డ్రమాటిక్ క్లబ్బు ప్రశిడెంటు స్మెల్లింగ్ కూడా నాకోసమే వస్తాడు. అతడో పిప్పళ్ళ బస్తాలా వుంటాడు. తత్కాలోచితమైన దుస్తులు వేసుకు వెళ్ళలేదని గత సంవత్సరమే నన్ను అతడు కబ్లు బైటికి పంపించేసినవాడు। తనమాట వినని ఆడవాళ్ళకి కొస్త సాధక బాధకాలు చెప్పి ఒప్పించమంటూ అతడు నన్ను బతిమాలుకుంటాడు. నేనెవరికీ యేదీ లేదని ఎప్పుడూ చెప్పను. వైస్ గవర్నరు భార్య సాయంతో ప్రెస్ కార్మికుణ్ణి గవర్నమెంటు ప్రెస్‌లో పనికి కుదిర్చేను. అతనక్కడ కార్మికులకు సంఘం, స్టడీ సర్కిలూ పెట్టి తంటాలు పడుతూన్నాడు. వాళ్ళకి కావాల్సిన పుస్తకాలూ గట్రా వర్తకుడు బుగ్రోవ్

వున్నాదుకాదూ, అతడిదిపూచీ. క్లబ్బులో ఆడవాళ్ళకి సలహా ఇవ్వడానికి నాకేం బరువాయేమిటి? వాళ్ళ తిన్నవాళ్ళూ దర్జీ ఆమెకి సాయపడి, సహకారపద్ధతులమీద దుస్తుల అంగడి పెట్టించేరు. పటాలంవాళ్ల కోసం నాటకాలు యేర్పాటు చేసినందుకుగాను జనరలు క్రిస్టమస్ పండుగుల్లో ఆశ్వికశిక్షణా కాలేజీ ఆటస్థలాన్ని ఉచితంగా యిచ్చేడు. పైగా వాళ్ళచే బ్యాండుకూడాను."

నొవోగ్రాడ్‌లోని బీదలపిల్లల నిమిత్తం గోర్కీ క్రిస్టమస్ పండుగుల్లో ఒక చిన్న విందు యేర్పాటుచేసేడు. దానికి ముందునుంచీ అతని గది బహుమతులతోనూ, పేకేజీ పెట్టెలతోనూ నిండిపోయివుంది. అతని యిల్లంతా తానులుతానులు బట్ట. అదంతా కత్తిరించి, గబగబా దుస్తులు తయారు చేస్తున్నారు, దర్జీలు.

ఈ యేర్పాట్లన్నీ చూస్తూ గోర్కీకి కడుపు నిండిపోయింది. క్రిస్టమసు వృక్షం పెద్దదిగా తయారుచేసేరు. పచ్చటి ఆకులూ, రంగురంగుల బట్టలూ, ఎలక్ట్రిక్ లైట్లూ.- అదంతా యెంతో అందంగా వుంది.

ఆ రోజున ఐదువందల పిల్లలు వచ్చేరు. కార్మిక పేటల్లోని పిల్లలు నానా కంగాళీగానూ ఉన్నారు. దిగువ బజారు వీధుల్లోంచి అనాధ బాలుర పటాలం "గోర్కీ పటాలం" యెర్రజెండా యెగరేస్తూ వచ్చి చేరుకుంది; ఆ పిల్లల్ని చూస్తూంటే గోర్కీ కళ్ళలో విచార రేఖలు తాండవించేయి. అతని హృదయం ద్రవించి, కళ్ళలో నీటిచుక్కలు మెరిసేయి.

"వరుసలుగా టేబిల్సుమీద అమర్చి యుంచిన బహుమతుల్ని చూస్తే దిక్కుమాలిన ఆ చిన్న బిడ్డలకి, యెంతో ఆశ్చర్యం కలిగింది. హాలులో క్రిష్టమస్ వృక్షం, పచ్చని ఆకుల్లో రంగురంగుల ఎలక్ట్రిక్ దీపాలు వెలుగుతూంటే విస్ఫారిత నేత్రాలతో చూస్తూ, చెట్టపట్టాలు వేసుకుని దానిచుట్టూ గిరగిరా తిరుగుతూ ఆడుకుంటున్నారు. అంతా అదో రకంగా

దగ్గుతూన్నారు. వాళ్ళ దగ్గులో దీనత, అనారోగ్యం, ఆకలి, దారిద్ర్యం ప్రతిబింబిస్తూన్నాయి. జీవితమంతా చాకిరీచేసి, అలిసిపోయిన ముసలి వాళ్ళ దగ్గులావుంది వాళ్ళదగ్గు. చెట్టుచుట్టూ నిశ్శబ్దంగా, గంభీరంగా తిరుగుతూంటే వాళ్ళ కళ్లలో యేవో ఆశలు. కలలు ప్రస్ఫుటంగా కాన వచ్చేవి. వాళ్ళని చూడ్డానికే నాకదోలాగ వుంది. ఆ నాడు ఎంతో ఖేద పడ్డాను."

"ఒక్కొక్కరికే బహుమతులిచ్చేశాం. ఒక్కో పెద్దరొట్టి, పౌనున్నర వుండే స్వీట్లు సంచీ, ఒక జతబూట్లూ, యిజారూ, చొక్కా, టోపీ, దుప్పటీ, ఒకకోటూ,- యివన్నీ యిచ్చేము. అవి పుచ్చుకుంటూనే చాల మంది ఆనందాతిశయంతో యేడ్చేశారు. వాట్లని గుండెలికి అద్దుకుని కౌగలించుకుంటూ, మూలమూలకి పరుగెత్తిపోయేరు కొందరు. మరి కొంతమంది అక్కడే చతికిలపడి, ఆతురతగా నోట్లో పిప్పరమెంట్లు కుక్కుకో నారంభించేరు."

గోర్కీ పల్లెటూరి పిల్లలకోసం మరో తమాషా బహుమతీ కని పెట్టేడు. బొమ్మల పత్రికలు కత్తిరించి, అల్బములుగా తయారు చేసేవాడు.

"వాళ్ళు దేన్నీ చూసివుండరు, పాపం! దీంట్లో పట్టణాలు, నదులు, వంతెనలు, మేడలు, వాడలు, గొప్పగొప్ప స్త్రీ పురుషులు,- అందర్నీ చూస్తారు. అవేమిటో! ఎవరేం చేసేరో? అంతా తెలుసుకోవాలను కుంటారు. తెలిసిందీ? అంతేచాలు. వాళ్ళచేత ఆ జిజ్ఞాసే యెంతో పని చేయిస్తుంది."

పెద్దవాళ్ళ విషయం కూడా గోర్కీ మరిచిపోలేదు. ప్రజలు అంటుం టారే 'బికారీలు' అంటూ, వాళ్ళవిషయం! ఆ నగరంలో యెత్తైన గుండ్ర స్థంభాలున్న ఓ పెద్దయిల్లుండీది; దాన్నంతా 'స్థంభాల యిల్లు' అనేవాళ్ళు.

ఇక్కడ యాచకులు, నిరుద్యోగులూ, బికారులూ, గృహదూరులూ ఐన జనానికి శరణ్యం యేర్పాటు చేసేడు. వాళ్ళ ఉపయోగానికో లైబ్రరీ, పియానో,- యిట్లాంటి సౌకర్యాలు కూడా యేర్పాటు చేయించేడు. 'స్థంభాలయింటి'కి వచ్చినవాళ్ళకి తాముకూడా మనుష్యులమే అన్న సంగతి మళ్ళీ స్ఫురణకి వచ్చేది.

క్రిస్టమస్ వృక్షం, బొమ్మల ఆల్బమ్‌లు, స్థంభాలయిల్లూ,- యీ రకం కార్యక్రమం అంటే పోలీసువాళ్ళకి అంత గాభరాలేదు. గోర్కీ యీ పని చేసి వూరుకుంటే వాళ్ళు కూడా అంతగా పట్టించుకునేవాళ్ళేకాదు. వచ్చిన చిక్కేమిటంటే, గోర్కీ తరచుగా 'సొర్మోవో'కి వెడుతూండేవాడు. నొవోగ్రాడ్‌లో యంత్రాగారాలూ, ఫాక్టరీలు, కార్మికులూ వుండే పేట అదే.

ఇక్కడే రహస్య మీటింగులు జరుగుతూండేవి. సోషల్‌డెమోక్రాట్ల పత్రిక 'ఇస్త్రా'ని తెప్పించి, అంతా కూర్చుని చదువుతూండీవాళ్లు. లెనిన్ యీ పత్రికలో యెన్నో వ్యాసాలు రాస్తూండేవాడు. హఠాత్తుగా యేపోలీసువాళ్లో దాడిచేస్తే మింగేయడానికి వీలుగా ఆ పత్రికని పిండి కాగితం, (మన పూతరేకులవంటి కాగితం) మీద అచ్చువేసేవారుట!

గోర్కీ యింటికి సొర్మోవో కార్మికులు వస్తూనే వుండీవాళ్లు. సలహాల కోసం, పుస్తకాలు, డబ్బుకొరకు వచ్చేవాళ్ళందరికీ గోర్కీ విరివిగా యిచ్చి పంపుతూనే వుండీవాడు.

1901 లో గోర్కీ పీటర్సుబర్గుకి వెళ్ళేడు. అక్కడ పోలీసులు, విద్యార్థుల ఊరేగింపును రక్తపాతం చేసి, పశుబల ప్రయోగంతో చెదరగొట్టడం చూసేడు. ఈ దౌర్జన్యాన్ని తీవ్రంగా ఖండిస్తూ, గోర్కీ ఒక వ్యాసం ప్రచురించేడు. ఈ హింసాకాండకి జవాబుదారీ నిరంకుశ ప్రభుత్వానిదే అని ఖండించి రాసేడు.

ఈ సంఘటనయొక్క ప్రభావంక్రిందే రాసిన గీతం "తుఫాను పక్షి గీతం" అనేది. దాంట్లో,-

"తుఫాన్! త్వరలో తుఫాన్ పాపంలా బ్రద్దలౌతుంది!"

ఈ గీతం దేశంఅంతటా అందరినోళ్ళలోనూ మార్మోగింది.

తిరిగి నొవోగ్రాద్‌కు వెళ్లేటప్పుడు గోర్కీ పత్రికేతులతో రాలేదు. ప్రెస్ లేని యిబ్బంది తీరడానికై ఒక డూప్లికేటింగు మెషీన్‌ను కొని, రహస్యంగా పోలీసుల్ని కన్నుగప్పి తెచ్చి స్నేహితులకి యిచ్చేడు.

"ఓఖ్రంకా",- రష్యాలో సి ఐ డి. వాళ్ళకిదేపేరు లేండి.- యెల్లాగో యీ మిమియోగ్రాఫ్ మెషీన్ సంగతి పసికట్టేరు.

రాజద్రోహ నేరంక్రింద గోర్కీని అరెస్టుచేసి, నొవోగ్రాడ్ జైలులో నాలుగోనెంబరు గోపురంలో బంధించేరు. అతని ఆరోగ్యం బాగులేకున్నా, ప్రత్యేక కక్షతో గోర్కీని అతికఠినంగా చూసేవాళ్ళు. బహు ప్రమాదకరమైన నేరస్తునిగా అతన్ని ప్రభుత్వం పరిగణించింది. అతని జాబులన్నీ నిలిపివేయబడినాయి.

గోర్కీ అరెస్టు, కఠిన నిర్బంధం దేశమంతటా తీవ్ర అసమ్మతిని రేపినాయి. రష్యా అన్నిభాగాలనుంచీ అసమ్మతి తీర్మానాలు, సభలు, జాబులూ, టెలిగ్రాములూ ప్రభుత్వంమీద కురిసేయి. టాల్‌స్టాయ్ ప్రభుత్వ చర్య అమానుషమూ, అనాగరకమూ అని ఖండిస్తూ వ్రాసేడు. గోర్కీని యెట్టిషరతులూ లేకండా వెంటనే వదలాలని ఖండించి చెప్పేడు.

ప్రజాభిప్రాయానికి ప్రభుత్వం లొంగక తప్పింది కాదు. జైలునుంచి విడుదలచేసి, అతనియింట్లోనే అతన్ని నిర్బంధించి వుంచేరు. హాల్లోను, వంటింట్లోనూ కూడా పోలీసువాళ్ళని కాపలాపెట్టేరు. ఓ పోలీసువాడు, అస్తమానూ అతను చదువుకునే గదిలోకి అనుజ్ఞ తీసికోకండానే ప్రవేశించి, గోర్కీని యేదో చర్చలోకి యీడ్వాలని యత్నించేవాడు.

గోర్కీ తిరిగి తన సారస్వత వ్యాసంగంలో మునిగేడు. రాత్రిప్పు చాలసేపు మేలుకుని, యేదోరాస్తూనే కూర్చునేవాడు. అందువల్ల పోలీసు వాళ్ళకి అనుమానం మరీ జాస్తీ అయింది.

"గోర్కీ బహు తీవ్రంగా యేదో చేస్తూన్నాడు. రాత్రిప్పుకూడా మేలుకునే వుంటున్నాడు" అని పై అధికారులకి రిపోర్టు రాసిపారేసేరు।

ఓరోజున గోర్కీ బజారులో వెడుతూ, బుగ్రోవ్ అనే చిన్నవ్యాపారిని కలుసుకొన్నాడు. బుగ్రోవ్ అన్నాడు :

"నువ్వు కాలాన్ని వృధాచేస్తున్నావు। నీ పనేమిటి? సంఘటనల్నీ, చరిత్రనీ లిఖించడమే నీపని. కొనకివచ్చి, పక్వంఅయ్యేలా చేయాల్సింది నువ్వు కానేకాదు.... విప్లవమే ఆ కర్తవ్యాన్ని నెరవేరుస్తుంది...."

నిజమే। గోర్కీ: చరిత్ర లిఖించటమే గాక సంఘటనల్ని కూడా పక్వస్థితికి తేడానికి తోడ్పడుతూన్నాడు. అతనికి విప్లవకారులతో సంబంధాలు మరీమరీ బలపడుతున్నాయి. సొర్మోవో కార్మికులికి గోర్కీ అధికాధికంగా సాయం చేస్తూన్నాడు.

పోలీసులికీ, గూఢచారులికీ, వాళ్ళ తొత్తులుకీ గోర్కీమీద అధికారం చెలాయించేందుకు వీలుగావడం లేదు. నొవోగ్రాడ్ పోలీసుఅధికారి పీటర్స్‌బర్గ్‌కి రిపోర్టు రాసిపారేశాడు :

"గోర్కీకి కార్మికుల్లో ఉన్న పలుకుబడివల్ల యేదోరోజున కొంప మునగక మానదు. దురంతసంఘటనల కిది దారితీయక తప్పదు."

అంచేత ప్రభుత్వం నిశ్చయించుకుంది, గోర్కీని సొర్మోవో కార్మికులికి దూరంగా వుంచాలని. నొవోగ్రాడ్ నుంచి బహిష్కరిస్తూ ఆజ్ఞలు జారీచేసేరు. "అర్జమాస్" అనే చిన్నపట్టణంలో వుండాలనికూడా ఆజ్ఞ అయింది. అది గాఢనిద్రలో మునిగివున్న ఓ పురాతన గ్రామం. మత బోధకులూ, సంకుచితభావాలుగల విద్యావంతులూ, రిటైర్డు ఉద్యోగులూ. వీళ్ళే అక్కడి జనాభాలో అధికసంఖ్యాకులు.

ఈ నిర్బంధచర్యలనంతా విరసించేరు. లెనిన్ దీన్ని ఖండిస్తూ పత్రికల్లో స్టేటుమెంటు యిచ్చేడు :

"భావరచనా స్వాతంత్ర్య మొక్కటే ఆయుధంగాగల ఒక మహా కవిని, యూరోపులోని గొప్ప రచయితల్లో ముఖ్యుడైన గోర్కీని, యే నేరం, విచారణా, శిక్ష విధించకండానే యీ విధంగా బాధించడం రాక్షసకృత్యం."

అసలే గోర్కీ ఆరోగ్యం బాగులేదు. జైలులో అది మరీచెడిపోయింది. ఈసారి మరీ అధ్వాన్నంగా వుంటూంది. అతని పరిస్థితి యేమీ బాగులేదనీ, వెంటనే గాలిమార్చి, దక్షిణాన కొన్ని నెలలపాటు వుండాలనీ డాక్టర్లు అన్నారు. ప్రభుత్వంమీద ఒత్తిడితెచ్చేరు, గోర్కీ స్నేహితులెందరో. టాల్‌స్టాయ్ కలుగచేసుకున్నాడు. కొద్దినెలలు క్రిమియాలోని "యాల్టా"లో వుండడానికి ప్రభుత్వం అనుమతించింది.

గోర్కీ వెళ్ళిపోతున్నాడని తెలిసి, విద్యార్థులూ, కార్మికులూ వీడ్కోలు యివ్వాలని బ్రహ్మాండంగా యేర్పాట్లు చేస్తున్నారు. ట్రెయిన్ బైలుదేరడానికి చాల ముందుగానే స్టేషనంతా జనంతో నిండిపోయింది. విప్లవగీతాలు పాడుతూ జనం గోర్కీతో బండి దగ్గిరికి వచ్చేరు. పోలీసులకి మహా మంటగా వుందిగాని ఏంచేస్తారు? ఇద్దరు సాయుధుల్ని అతని పెట్టె గుమ్మంలో కాపలావేసి, ట్రెయిన్‌ను వెంటనే టైం కాకుండానే వదిలేయాలని హుకుం జారీ చేసేరు. పొగలు గ్రక్కుతూ ట్రెయిన్ స్టేషన్‌నుంచి బైలుదేరుతూంటే "గోర్కీ వర్ధిల్లాలి! నిరంకుశత్వం నశించాలి!" అనే కేకలు ఆకాశాన్ని బ్రద్దలుచేసేయి.

* * * *

గోర్కీ క్రిమియాలో వుండగానే "ఎకాడమీ ఆఫ్ సైన్సెస్" అతన్ని ఒక సమావేశంలో గౌరవసభ్యునిగా యెన్నుకుంది. అప్పటికే రెండు

సార్లు జైలు కెళ్ళినవాణ్ణి యీ విధంగా గౌరవించడం చూసి, ప్రభుత్వం సహించలేక పోయింది. జార్ చక్రవర్తికి యీ ఉత్పాతాన్ని రిపోర్టు చేసేరు. గోర్కీ యెన్నికపడిన పేపరుకట్టింగుమీద జారు నికోలస్ రిమార్కు వ్రాసేడు :

"స్వబుద్ధి మర్యాదను దాటిపోయిన పని!"

విద్యాశాఖామంత్రికి చక్రవర్తి యిట్లా వ్రాసేడు :

"........ప్రస్తుతపు గందరగోళాల్లో, యీ రకం మనిషిని గౌరవ సభ్యుడుగా ఎకాడమీ ఆఫ్ సైన్సెస్ యెన్నుకుంది. ఈ వ్యాపారం చూస్తే నాకు పరమాసహ్యంగా వుంది."

చాలు! ఇది చాలు. ఎకాడమీ ఆఫ్ సైన్సెస్ సభ్యుడుగా గోర్కీ ఎన్నిక రద్దు చేయబడింది. ఎకాడమీ కూడ ధైర్యం చేసి, యీ దురంత చర్యని యెదిరించ లేకపోయింది. పిరికిగా మౌనందాల్చింది. ఎకాడమీ లోని యిద్దరు రచయితలు మాత్రమే ధైర్యంగా యీ అనవసర జోక్యాన్ని యెదిరించేరు. ఆంటన్ చెకోవ్, వ్లాడిమిర్ కొరొలెంకో,- వీళ్లిద్దరూ యీ చర్యకి నిరసన తెలుపుతూ, ఎకాడమీ యొక్క అసమర్ధతకి విచారిస్తూ, తమతమ గౌరవసభ్యత్వాలకికూడా రాజీనామా యిచ్చేరు.

జారుయొక్క నిరంకుశమైన చర్యకి తమకున్న పరమ అసహ్యాన్నీ, నిరసననీ తెలపడానికింతకంటె యేం చేయాలి?





10 వ ప్రకరణము

## నైటింగేల్లు - గూఢచారులు

క్రిమియానుంచి ఆరోగ్యం పొంది గోర్కీ అర్జమాస్‌కి తిరిగి వచ్చేడు. అదొక చిత్రమైన ఊరు. అక్కడి మనుష్యులూ విచిత్రమైన వాళ్లే.

ఆ వూళ్ళో ఓ మంగలి షాపు వుండేది. దాని యజమాని బడాయిగా బోర్డు తగిలించేడు: "గడ్డాలు కత్తిరించబడును: సార్వభౌమాధికారం వల్ల యేర్పడిన రాజనాపితుడు." అతడు క్షవరం చేస్తూ మహా బడాయిగా చెప్పుకునేవాడు :-

"మా వూరేమిటండీ.— యెక్కడేమి జరిగినా మాకేం ఫర్వా లేదు. కొన్నిచోట్ల వరదలు వస్తాయి; మరికొన్నిచోట్ల భూకంపాలు వస్తుంటాయి. ఏదో ఒకటి వస్తుంటుంది. కాని, మా వూరో? ఖదేరావ్! ఇంతెందుకూ కలరా చూడండి. చివరకి దానిక్కూడా మా వూరు రావడానికి గుండెల్లేవు!"

అర్జమాస్‌లోనూ విప్లవోత్సాహం మిన్ను ముట్టే రోజు లుండేవి. కాని, యిప్పుడవిగతించేయి. ఆరోజులు,-జారు అధికారాన్ని ధిక్కరించి, స్టెపాన్ రాజిన్, ఎమిల్యాన్ పుగచోవ్‌ల జెండా క్రింద ఉత్సాహంగా ప్రజలు పరాక్రమించిన రోజులు వెళ్ళిపోయినయ్.

ఆనాటి మోర్డావియన్, ఛువాష్ కోసక్కులు అరిభయంకరులుగా విజృంభించి, దేశానికి తమ రక్తంతో తర్పణలు చేసి, పురాతన చెర్చి ఆవరణలలోని సమాధుల్లో మట్టితో తమ బొమికలు కలిపి యే నాడో గతించేరు. ఆ నాటి తిరుగుబాట్లు, ఉరిశిక్షలూ కూడా ప్రజలు మరచిపోయేరు. యోధుల సమాధులమీదా, ప్రజల మనస్సుమీదా యిప్పుడు పాకుడు పట్టేసింది. ఇప్పుడా పట్టణంలో వర్తకులు, బ్రహ్మచారిణులు,

'గౌరవనీయులైన' పెద్దమనుష్యులు,— వీళ్ళే వున్నారు. అర్జమాస్ సమాజం నేడెంతో ప్రశాంతంగా, విశ్వసనీయంగా, రాజభక్తియుతంగా వుంటూంది. తమ వ్యాపారా లేమిటో, తమ పన్లేమిటో, అంతేగాని అక్కడి సజ్జనులు రెండో గొడవే పట్టించుకోరు. కుందేలు చర్మాలు, పందికొవ్వు,—యిల్లాంటివి యెగుమతి చేస్తూ; కప్పల బెకబెకలువింటూ; ఐదు విహారాలు, ముప్పైఆరు చెర్చీలు, వీటి ఘంటాధ్వానాలకి శిలువవేసి కొంటూ, చెర్చి ప్రచురించే 'యెపర్షియాల్నియీ విదోమోస్తీ' పత్రికను మాత్రమే చదువుతూ; దొంగలు పడతారేమోననే భయంతో గుండెలు చేతబట్టుకుని వుంటూ; ప్రతి రాత్రీ తమ చిన్నయిండ్ల తలుపులు, కిటికీలు గడియలువేసి బహు భద్రంగా బిగించుకుని కాలక్షేపం చేస్తున్నారా పట్టణవాస్తవ్యులు.

ఇక్కడి 'ప్రశాంత' వాతావరణంలో గోర్కీని పడేస్తే, చప్పగా వుండ కేం చేస్తాడని పోలీసుల ఆశ. ఐనా ఓమూల వాళ్ళకి భయంగానే వుంది, యీ వూళ్లోకూడా యేం గొడవలు బైలుదేరుతవో అని. పట్టణం లోని పోలీసు సూపరింటెండెంటుకి ప్రభుత్వం రహస్యంగా ఆజ్ఞలు పంపింది:-

"త్వరలోనే మీ పట్టణానికి అలెగ్జీ మాగ్జిమోవిచ్ పెష్కోవ్ (ఎమ్. గోర్కీ) అనే ఆసామీ వస్తాడు. అతడు నిఘాలో వున్నవాడు. అక్కడే కొంతకాలం వుంటాడు. అత డక్కడికి చేరగానే గట్టిగా బందోబస్తు చేసి, నిఘాలో వుంచు. పెష్కోవ్ని యెవరైనా కలుసుకోవడం తటస్థిస్తే, యే తగువులూ లేకుండా అవసరమైన జాగ్రత్త తీసికోవాలి."

గోర్కీ విశాలమైన ఓ కొయ్య యిల్లు తీసికొని, అందులోకి వచ్చేడు. దానిచుట్టూ చిన్న తోటా, అందులో ఓ ముసలిమద్దిచెట్టూ వుంది. వసంత కాలం అప్పుడే ముగియవస్తూంది. క్రిమియాలో వుండి వచ్చిన మీదట యిక్కడ ప్రతిచెట్టూ ఆహ్లాదకరంగానే వుంటుంది. క్రిమియాలో సము

ద్రపు గాలికి చెట్ల ఆకులు కూడా అదోమాదిరిగా వాడిపోయి. వివర్ణంగా వుంటాయి. ఆగ్రమాస్‌లో చెట్లు పచ్చగా కనుల పండువుగా వుండేవి.

చుట్టూవున్న అడవిలోకి గోర్కీ తరచుగా షికారు వెడుతూండేవాడు. అక్కడ 'పల్లపు మడుగు' అంటూ ఓ రమ్యప్రదేశంలో గంటలకొద్దీ కూర్చునేవాడు. అతను కూర్చునేచోట అన్నీ తెల్లమద్ది చెట్లే. ఓ చిన్న మొక్కని తట్టుతూ, "ఈ మొక్క ఒక్కటే చాలు క్రిమియా ప్రకృతి సౌందర్యాన్ని తలదన్నడానికి!" అంటూండేవాడు, ప్రేమగా, ముద్దుగా.

పచ్చని చేలూ, తిషా నదీ, నదిలోని రకరకాల చేపలూ,- యివన్నీ కూడా అతని కాహ్లాదకరంగానే వుండేవి. కాని పోలీసులు మాత్రం యితన్ని ప్రతి అడుగుకీ వెంటాడుతూనే వుండేవాళ్లు; ఇక్కడినుంచే చెకోవ్‌కి రాసిన జాబు చూడండి :

"ఇక్కడంతా ప్రశాంతంగా, విశ్రాంతిగా, ఆహ్లాదకరంగా వుంది. గాలి యెంతో చక్కగా వుంటూంది. అన్నీ తోటలే. ప్రతీతోటలోనూ నైటింగేళ్ళు రాగాలాపన చేస్తూనే వుంటాయి. చెట్లమీద పాడే నైటింగేళ్ళుంటే, క్రిందపొదల్లో నిశ్శబ్దంగా పోలీసు గూఢచారులు దాగి వుంటారు! నైటింగేళ్ళు అన్ని తోటల్లోనూ వున్నాయి; పోలీసువాళ్ళు మాత్రం ఒక్క నా తోటలోనే వున్నారు, అనుకుంటా. చీకట్లో, నా యింటి కిటికీల క్రింద కూర్చుని, నేను రష్యాలో రాజద్రోహాన్ని యెట్లా వ్యాపింపచేస్తూన్నానో తెలుసుకుందామని తొంగి తొంగి చూస్తుంటారు! కాని, వాళ్ళకి ఏమీ కనిపించదు. మహవిసుగుగా వుండి, కోపంతో పందుల్లా ఘుర్ఘురిస్తూంటారు. మా యింట్లోవాళ్ళు పీళ్ళ మొరుగులు విని బెదిరిపోతూంటారు."

గోర్కీ చేసిన ప్రతిపనీ పోలీసులు అనుమానంతోనే చూసేవాళ్ళు. ఎవడేనా బిచ్చగానికి గోర్కీ ఓ వెండినాణెం యిచ్చేవాడనుకోండి; వెంటనే ఓ పోలీసువాడు యెదటి కురికి, వాడిదగ్గర్నుంచి ఆ నాణెమును లాక్కుని

అటుత్రిప్పి, యిటుత్రిప్పి, పళ్ళతో కొరికి కూడా చూసేవాడు. గోర్కీ యే మాయనాణెములోన్నె ప్రజల్లో ప్రచారంలో పెడుతూన్నాడేమోనని వాడి భయం, అనుమానం!

ఒక్కోసారి గోర్కీయే, కిటికీక్రింద కూర్చున్న పోలీసువాడిని పిలిచే వాడు. ఇద్దరికీ చిత్రంగా సంభాషణ ప్రారంభమయేది:

"నువ్వు పోలీసువాడివి కాదూ?"

"కాదండి!"

"అబద్ధం చెపుతున్నావు; నువ్వు పోలీసువాడివే!"

"నేను పోలీసునికాదు, బాబయ్యా! దేవుడితోడు!"

"నువ్వు చాలకాలంగా పోలీసుపనిలో వున్నట్లు కనిపిస్తుంది."

"లేదు బాబుగారు! ఈమధ్యేనండి...."

అప్పుడప్పుడు మాత్రం సూపరెంటు దానిలోవ్,- అంత భారీవిగ్రహం ఆ వూళ్ళోనే లేదు,- గోర్కీ యింటిముందునుంచి వెళ్ళేవాడు. అతనిది పెద్ద కళేబరం; పీపాలావుంటాడు; నోట్లో పెద్ద 'పైప్'. గుర్రం మీద వీధిలో పోతూ, వెతుకుతూన్నట్లుగా గోర్కీ గదిలోకి చూసేవాడు. అతని కెంత ఆత్మవిశ్వాసమో తెలుసా? రష్యాలో విప్లవాన్ని గోర్కీయే గనక వ్యాపింపచేయడానికి కుట్ర చేస్తుంటే, తాను, సూపరెంటు దానిలోవ్ దాన్ని కనిపెట్టాగలడు, మొగ్గలోనే త్రుంచివేయాగలడు! అబ్బో! సూపరెంటు దానిలోవంటే యేమనుకున్నారు! హ! హ! హ!

కాని, పాపం సూపరెంటు మహాశయుని ఆత్మవిశ్వాసం కేవలం అనవసరం, అసంగతమూను! కిటికీలక్రింద మామూలుబట్టలతో యెంత మంది సి.ఐ.డీల్ని కూర్చోబెట్టినా, డొంకల్లో పోలీసుగూఢచారు లెందరు దాగి కనిపెడుతూన్నా, గోర్కీచేసే విప్లవ ప్రచారం ఆగదు. అతడు అర్జమాస్‌లో వున్నంతకాలం కూడ ప్రజాఉద్యమాన్ని బలపరుస్తూ, పాల్గొంటూనే వున్నాడు.

ఎట్లాగ? అర్జమాస్‌లో వున్నవాళ్ళంతా ఒక్క మతాచార్యులు, వర్తకులు, చిన్న ఉద్యోగులూ మాత్రమేనని ప్రభుత్వం అనుకుంది. కాని, అక్కడే ప్రతి ప్రభుత్వమూ పొరబాటు చేస్తుంది. బీదలూ, కూలీలూ, వాళ్ళదృష్టిలో మనుష్యులలోకి లెక్కరారు! అర్జమాస్‌లో యీ బాపతు కష్టజీవులకూ యేం తక్కువలేదు. టానరీ కార్మికులు, జోళ్ళు కుట్టేవాళ్ళు, జీనులు చేసేవాళ్ళు,- వీళ్ళక్కడ జాస్తి. ఈ చమారీలనుగూర్చే లెనిన్ రాసేడు: "వీళ్ళు యజమానికి పధ్నాలుగు గంటలు చచ్చేలా చాకిరీచేస్తే, గంజికి చాలని కూలిడబ్బులు యిస్తారు. అందువల్లనే వీళ్ళు తెల్లగా పాలిపోయి, బలహీనంగా వుంటారు. వీళ్ళలో మరణసంఖ్య జాస్తీ. యీ తరగతివాళ్ళు త్వరత్వరగా క్షీణించిపోతూన్నారు."

పాలిపోయి, శుష్కించిన యీ చమారీలు గోర్కీ యింటికి తరుచుగా వస్తుండేవాళ్ళు. గార్డనుగా కాపలా కాస్తూన్న పోలీసువాళ్ళ కనుగప్పే చమారీలు నిత్యం గోర్కీ యింటికి వచ్చేవాళ్ళు. అర్జమాస్‌లోనే గోర్కీ బహు సాహసంగా ఒక విప్లవ కార్యాన్ని సాగించేడు. ఆ పట్టణ సమీపంలోనే వున్న 'పొనీతయేవ్ విహారం' ప్రతీఘాతుకభావాలకు పట్టుగొమ్మగా వుండేది. దాన్నిచేరే ఒక సారాఅంగడి వుంది. దాన్ని యేటా ప్రభుత్వం పాటపెడ్తుంది. నొవోగ్రాడ్ విప్లవకారులు గోర్కీతో ఆలోచించి, ఆ సారాదుకాణాన్ని పాడ నిశ్చయించేరు. విప్లవకారులకోసం యే పోలీసువాడు, లైసెన్సు సారాదుకాణంలో, అందులోనూ ఆ మారుమూల పట్టణంలో, తత్రాపి ముసలి మతాచార్యులుండే విహారానికి ప్రక్కనే వున్న ఆ సందుగొందిలో వెతుకుతాడు? విప్లవకారులు అక్కడుంటారని కలలోకూడా యెవడూ అనుకోడు!

ఏర్పాటు సక్రమంగానే సాగింది. లిబిడేవ్ అనే వడ్రంగి, నొవోగ్రాడ్ విప్లవకారుడు, ఆ సారాదుకాణానికి యజమానిగా నియమించబడ్డాడు. ఆ వడ్రంగి రోజూ, సన్యాసులకీ, స్వాములకీ, యాత్రికులకీ వోడ్కా అమ్ము

తూండీవాడు. ఈ బాపతు జనం ప్రతి పండుగకీ, ఉత్సవానికీ, సెలవులకీ అక్కడికి గుంపులుగా చేరుతూండేవాళ్ళు. వెనకాల గదిలో ఓచిన్న ప్రెస్‌ను స్థాపించి పని జరుపుకుపోతున్నారు, విప్లవకారులు ! ఇక్కడ అచ్చువేసిన కరపత్రాలు ఆ ప్రాంతమంతటా పంచిపెడుతూనే వుండీవారు.

చాలకాలంవరకూ పొనీతయేవ్‌కా మీదికి అధికారులదృష్టి పోనేలేదు! చివరకి వాళ్ళు దాన్ని తెలుసుకున్నారంటే అది కేవలం కాకతాళీయమే! ఓ రోజున సారాదుకాణంలో దొంగలు పడ్డారు. ఈ దొంగతనం సంగతి పోలీసువాళ్ళ చెవుల పడింది. ఇంక వాళ్ళు వచ్చితీరుతారనీ, దొంగతనం జరిగిన స్థలాన్ని పరిశీలిస్తారనీ అందరికీ తెలుసు. కాని, పోలీసులు వచ్చే లోపుగానే అక్కడ అచ్చుఆఫీసు వగైరాలు ఆనవాలులేకుండా మాయమైనాయి. దుకాణదారు డసలే గైరుహాజరు ! పోలీసులువచ్చి అంతా వెతికి బుర్ర గోక్కుంటూ వెళ్ళిపోయేరు.

పొనీతయేవ్‌కా రహస్యం యెవరికీ తెలియనేలేదు. ప్రెస్‌ను భద్రంగా కాపాడుకోగల్గేరు, విప్లవకారులు !

ప్రతి రాత్రీ తెల్లవార్లూ కూడా గోర్కీ గదిలో దీపం గంటలా వెలుగుతూనే వుంటుందని నూపరెంటు దానిలోవ్‌కి నిత్యం రిపోర్టులు వెడుతూనే వున్నాయి. ఈ సంగతేమీ సూపరెంటుగారికి నరిపడలేదు.

"అనుమానితుడు సరిపడా నిద్రే పోడు. తెల్లవార్లూ యేదో చేస్తూన్నాడు."

కాని, సూపరెంటుగారి యిష్టానిష్టాలు యెవరికి గావాలి ?

గోర్కీ అహోరాత్రులు రాస్తూనే వున్నాడు. అది ఒకనాటకం. "దీనిని నేనెంతో ప్రీతిపూర్వకంగా చూస్తున్నాను. దీనిని పూర్తి చేయకుండా వుండడం అసంభవం. అట్లే చేస్తే నేనొక పెద్దనేరం చేసినవాణ్ణి అవుతాను" అంటూ, దీన్నిగూర్చే గోర్కీ, చెకోవ్‌కి ఓజాబులో రాసేడు.

## 11 వ ప్రకరణము

# మాస్కో - ఆర్టు థియేటరులో

మాస్కోలోని ముఖ్యమైన పాత థియేటర్లలో మాలీ. కోర్షు మొదలైనవెన్నో వుండేవి. నాటకం ప్రారంభం అవుతుందనగా 'ఆర్కెస్ట్రా' మ్రోగుతూంటే బరువైన యెర్రటి చెంకీగుడ్డ తెరలు, (బంగారు పనితనం చేసినవి) మెల్లిగా పైకి లేచేవి. అంతా 'ఒపెరా' లో మాదిరిగానే. ఆరోజుల్లో నటకులు గుభీలుమని నేలని మట్టుతూ, వదవడా వదరుతూ మాట్లాడేవాళ్ళు. ఏ రివాల్వరు పేల్చడమో, కత్తి ఝళిపించడమో వున్న పాత్రలు ధరించాలని అంతా తాపత్రయపడుతూండేవాళ్ళు. ప్రేక్షకులు చప్పట్లు కొడుతూ, ఈలలు వేస్తూ, పెద్ద గొంతుతో మాట్లాడుతూ, సిల్కుబట్టలు గలగల లాడిస్తూ, బూట్లు టకటక మనిపిస్తూ నానాగొడవ చేసేవాళ్లు.

ఇప్పుడు నూతన థియేటరులో నిశ్శబ్దతయొక్క అవసరం అంతా గుర్తించేరు. తెరలు యిప్పుడు కిరకిరలాడుతూ పైకి లేవవు; పుస్తకంలోని పుటలలా రెండు వైపులకూ తెరుచుకుంటాయి. రంగస్థలంమీది మనుష్యులు తమ భావాలను కళ్లెం బిగబట్టి వుంచడం నేర్చేరు; ఊరికే అనవసర అంగవిన్యాసాలు చేయడం మానేసేరు. ఒక్కొక్క సమయంలో ప్రేక్షకులూ, నటకులూ కూడ నిశ్శబ్దంగా చిత్తరువుల్లాగ వాన చినుకుల చిటపటలనో, ఉషఃకాలపు పక్షిరుతాలనో, వీధినిబోయే బండి చప్పుడునో, గడియారపు 'టిక్ టిక్' నో వినడం పరిపాటి అవుతూంది. ప్రేక్షకు లిప్పుడు చప్పట్లు కొట్టడం, హుషార్ చేయడం లేదు; 'వన్సుమోర్' లు అసలే వినిపించడం లేదు.

ఈ థియేటరులో నటకులంతా యువ వయస్కులే. చాలమంది ఎమెచ్యూర్సు. దీనిలో బహుసమర్థుడైన నటకు డొక కెల్లిగ్రఫీ టీచరు.

(అందంగా రాయడం నేర్పేవాడు) దీనికి అర్టుధియేటరు అని పేరెట్టేరు. కళయం దత్యంత గౌరవాభిమానాలు గలవారు దీన్ని సృష్టించేరు.

గోర్కీ మాస్కోకు వెళ్ళినప్పు డొకసారి యీ అర్టు ధియేటరుకి వెళ్ళేడు. చెకోవ్ రచించిన నాటకం 'వాన్యా మామ' అందులో అప్పుడు ఆడుతున్నారు.

వాన్యా మామ చిఠా పుస్తకాలు ముందేసుకూర్చోడం; వాఫుల్ మెల్లిగా గైటర్ తీగలు 'ఝుం ఝుం' మనిపిస్తూండడం; తన గదిలో యేకారణంవల్లనో వ్రేలాడుతూన్న ఆఫ్రికా మ్యాపును చూస్తున్న డాక్టరు ఆస్ట్రోవ్‌ని; యెవ్వరూ పియానో వాయించటాన్ని సహించని ప్రొఫెసర్ శిరిబ్ర్యాకోవ్‌ని; మనం దినమూ చూసే జీవితఘట్టాలే రంగస్థలంమీద అనవకుంఠితము లవుతూంటే గోర్కీ ముసలమ్మలాగ యేడుపు ప్రారంభించేడు.

గోర్కీ ఆ రాత్రి యింటికి వచ్చేడు. నోట మాట లేదు. నెత్తిమీద యేదో దెబ్బతాకి దిమ్మతిరిగిపోయినట్లుగా చూపులే గాని, మాట లేనే లేదు. చెకోవ్‌కి వెంటనే కూర్చుని జాబు వ్రాసేడు. ఈ జాబు గోర్కీ లేఖిని నుంచి వెలువడిన వాటిలో బహుభావబంధురమైనది :

"ఈ నాటకం చూడ్డంతోటే వెంటనే స్పష్టంగా దీనివల్ల నీ మనస్సులో కలిగిన భావసంచలనాన్ని చెప్పలేవు. పాత్రలవైపు చూస్తుంటే నా శిరస్సును మొండి రంపంతో మెల్లిగా, తాపీగా రెండు చెక్కలుగా యెవరో కోస్తూన్నట్లే అనిపించింది. రంపపు పళ్ళు వెనక్కీ ముందుకీ వెడుతూ చివరకి నా హృదయకుహరాన్ని కూడా నిర్దయగా వ్రక్కలు చేస్తూనే వున్నాయి. చివరకి నా హృదయంకూడా ఒక్క పెద్ద బాధా సూచకమైన మూలుగుతో, చెక్కలై కుప్పగా కూలింది. నా మటుక్కి నా కది ఒక గొప్ప అనుభవం ఔను! 'వాన్యా మామ' నాటకకళలో నవ్యమూ, నూతనమూ, విశిష్టమూ కూడాను.

"ఆఖరి అంకంలో డాక్టరు చాలసేపు మౌనం తర్వాత నోరు విప్పి ఆఫ్రికాలో యెంతవేడిగా వుంటుందో చెపుతూంటే. నీ కళాకౌశలానికి నాహృదయం వణుకుతూ అంజలి అర్పించిందంటే ఆశ్చర్యమేముంది? ప్రజల దుర్దశకి భయమూ, మన శూన్య. యెడారి జీవితానికి యేడ్పూ వచ్చి వణికిపోయేను."

ఈ నాటకశాలకు తరచుగా రావడానికి అవకాశం లేకుండా, ఎక్కడో దూరంగా నొవోగ్రాడ్‌లో వుంటూన్నందుకు గోర్కీ వగచేడు.

ఈ నాటకబృందాన్ని చూసే అవకాశం గోర్కీకి మళ్ళీ జూలై 1902 లో చిక్కింది. క్రిమియాలోని యాల్టాలో, ఆరోగ్యం నిమిత్తమై చెకోవ్ వుంటూండీవాడు. అతనికి చూపడానికే ఆ బృందం అక్కడ కొన్ని ప్రదర్శనాలు యేర్పాటు చేసింది. గోర్కీ, టాల్‌స్టాయ్‌కూడ ఆరోగ్యం కొరకు కొసమయంలో అక్కడే వున్నారు.

అది వసంతఋతువు. చెకోవ్‌యొక్క సుధాధవళమైన వసంతకుటీరోద్యానమందాతడు పెంచుతున్న పువ్వులమొక్కలు మంచి పూత బట్టినాయి. చెకోవ్, గోర్కీ లిద్దరూ తీరికగా కబుర్లు చెప్పుకుంటూ పట్టణవీధుల్లో తెల్లటి చప్టాలమీద నడుస్తూండేవాళ్ళు. రాత్రి అయేసరికి ఆర్టు థియేటరు నాటకాలకి పోయి చూస్తూ కాలక్షేపం చేసేవాళ్లు.

అప్పుడే చెకోవ్, గోర్కీని ఒక నాటకం రాయమని ప్రోత్సహించేడు. ఆర్టు థియేటరు బృందంకూడా వేడుకుంది

ఇప్పటికి అర్జమాస్‌లో వుంటూ, ఆ అవకాశాన్ని నాటకరచనకై ఉపయోగించాలని గోర్కీ నిశ్చయించేడు. తనకు నాటకరంగం క్రొత్త. ప్లాటు తయారు చేసేడు. బెస్సిమినోవ్ కుటుంబం యొక్క కఠినజీవితాన్ని చిత్రిస్తూ గోర్కీ మొదటినాటకం 'ఫిలిస్టైన్స్' (శిష్టులు) రచించేడు. దీని కొరకై రాత్రింబగళ్ళు పనిచేసేడు. అతని కిది చాల కష్టం

ఐపోయింది. నాటకరూప రచనలో అతను చేయితిరిగినవాడు కాదు. రాసి, మళ్ళీ రాసి, యిట్లాగే యెన్నో మార్పులు చేసేడు.

ఒక గొప్ప సాహిత్యవేత్త నాటకరచన విషయంలో యేమన్నాడంటే, "మొదట్లో అయిదంకాల కష్టాంతనాటకం రాయి; ఓసంవత్సరం పోయేక దాన్ని మూడంకాల నాటకంగా మార్చు; యింకో సంవత్సరం పోనిచ్చి దాన్ని ఏకాంక సుఖాంత నాటికగా కత్తిరించుకో; మరో సంవత్సరం గడవనిచ్చి. యీ ఏకాంకికను పొయిలో పారేయ్।........"

గోర్కీ యీ సలహానే అనుసరించేడు. కాని తన నాటకాన్ని పొయిలో మాత్రం పారేయలేదు. కాని, దానిపట్ల అతనికి తృప్తికలగలేదు. అదంతా ఊకదంపుడుగానూ, వికారంగానూ వుందని అతని భావం. చకోవ్‌కు దీన్నిగూర్చి జాబురాస్తూ,—

"నాకు అదేమీ నచ్చలేదు. శీతాకాలంలో మళ్లీ యింకోటి రాస్తా. నా దృష్టి నంతనీ దానిమీదే వుంచుతా. అదీ బాగులేకపోతే ఊరుకోను. ఇంకో డజను రాస్తా. నే కోరినది సాధించి తీరుతా। నా నాటకం చిన్నదిగా, చక్కగా, మనోహరమైన గీతికలా వుండాలి."

అర్టు థియేటరువాళ్ళు ఆదే చెకోవ్ నాటకాల్లోని యీ 'సంగీతం' వుందే అదే అందరి మనస్సుల్నీ ఆకర్షించేది. మామూలు మానవసంభాషణే అందులోని సంగీతం। ఇదంతా అవలోడన చేసుకుని, గోర్కీ తన నూతన నాటకరచన నారంభించేడు.

'శిష్టులు' లో గోర్కీ తన చిన్ననాటినుంచీ యెరిగివున్న మానవుల్ని చిత్రించేడు, పట్టణాల్లో చిన్నయిళ్లలో వుంటూ, కుండలూ, గిన్నెలూ, బట్టలు, సామోవార్‌లు, దేవతావిగ్రహాలూ వగైరా సంపాదించిన వస్తువులతో నిండిన కొయ్యపెట్టెలూ, మంచాలు,—యిల్లాంటి వాట్లమధ్య ఉక్కిరి బిక్కిరిగా నివసిస్తూండే వాళ్ళే యీ 'శిష్టులు'. వాళ్ళజీవితం అందులో చిత్రితమైంది

ఈ కొత్తనాటకంలో నొవోగ్రాడ్‌లోని కోటీశ్వరుల వీధిలోవున్న నిరుపేదలైన బికారుల జీవితాన్నీ, కాజాన్‌లోని అద్దాలమేడలోని వాళ్ళ జీవితాన్నీ చిత్రించేడు.

1902 లో క్రిమియాలో వుండగానే ఓనాటి సాయంకాలం తన భవిష్యత్ కథావస్తువునిగూర్చి ఆలోచించేడు; కథానాయకుడు ఒక బికారీ, ఒకప్పుడు ఒక ధనికకుటుంబంలో బట్లరుగా వుండి, జీవితపు ఒడుదుడుకుల్లో డాస్ హౌస్ (త్రాగుడు కొంప) వాతావరణంలో పడి, మళ్ళీ దాన్ని వదలలేని వాడాతడు. అతని ఆస్తి అంతకీ ముఖ్యమైనది ఒక మెడపట్టీ. ఇదొక్కటే అతని పూర్వాశ్రమాన్ని గుర్తుకు తెస్తుంది. ఆ మెడపట్టీ బిగుతుగా వుండేది. అందులో ప్రతి ఒక్కడూ ప్రతి యితరుణ్ణీ అసహ్యించుకునేవాడే. ఆఖరి అంకంలో వేసవికాలం వస్తుంది. రంగం అంతా సూర్యరశ్మితో నిండిపోతుంది. డాస్‌హౌస్ వాసులు తమ మురికి బొరియను వదిలేస్తారు. ఒకరొకరిమీదవున్న ద్వేషాల్ని మరిచిపోతారు. ఇదీ, గోర్కీ రచించిన నాటకంలోని యితివృత్తం. దీనికే అతడు 'నికృష్ట జీవితం' అని పేరెట్టేడు.

ఇందులోని పాత్రలన్నీ గోర్కీ తన జీవితంలో సహచరులుగా గడిపిన వారివే. బజారుల్లో, రోడ్లమీద, పడవల రేవుల్లో, ఒకే ప్రక్కమీద పండుకునీ, రాత్రిళ్ళు చలిమంటలదగ్గర చుట్టూ కూర్చునీ,—భుజాలు భుజాలు రాచుకుంటూ తిరిగినవే. ఉదా: సతీన్‌ను తీసికొందాం. పోస్టుమాష్టరుగా పనిచేసి, ఏదో నేరంచేసి జైలుశిక్ష ననుభవించినవాని ననుసరించే యీపాత్ర సృష్టించేడు. ఇతడు నొవోగ్రాడ్ వీధుల్లో తిరుగుతూ, చొక్కా కూడా లేకుండా, కనిపించిన స్త్రీలనే ఫ్రెంచిభాషలో అడుక్కుంటూండేవాడు. అతన్ని చూస్తూనే యేదో విశేషం వుందనీ, ప్రేమబికారి ఐవుంటాడనీ తోస్తుంది. స్త్రీలు యిట్టే మనసు కరిగి అతనికో కానిడబ్బు యిచ్చేవాళ్లు.

'నికృష్ట జీవితం' రాయడం కాగానే అర్టు థియేటర్‌లో పఠనానికి యేర్పాటు చేసేరు. గోర్కీయే యీనాటకాన్ని చదివేరు. అన్నా చనిపో తూంటుంది. లూకా ఆమెకి ఊరడింపుమాటలు చెపుతూన్నాడు. ఈరంగా నికి వచ్చేటప్పటి కాతని కంఠం రుద్ధమైపోయింది. కంటినీరు గోటితో చిమ్మేశాడు నటకులంతా ఊపిరి బిగబట్టి వింటున్నారు. ఆత్మ సంయ మనం చేసుకుని, మళ్ళీ చదువ ప్రయత్నించి, రెండుమూడు మాటలు మాత్రం చదువగల్గేడు. అంతే. మళ్ళీ కంఠం రుద్ధమై బావురుమనేశాడు।

ఈ నాటకం ఆడడానికి ప్రభుత్వం అనుజ్ఞ యివ్వడానికి నానాఅవ స్థలూ పెట్టింది. అతని రాతప్రతినిండా నీలిపెన్సిలుతో గీతలు పెట్టేసేరు. సెన్సారువాళ్ళు. 'ఫిలిస్టైన్స్' లో 'వర్తకుడు రోమనోవ్ భార్య' అనే మాట వీల్లేదన్నారు. ఎందుకంటే రోమనోవ్ అనేది చక్రవర్తి కుటుంబ నామానికి వర్తించేట్లా ధ్వనిస్తుందిట! రోమనోవ్ తీసేసి ఇవానోవ్ పెట్టేదాకా వాళ్ళు ఊరుకోలేదు!....

'ఫిలిస్టైన్స్' నాటక ప్రదర్శనానికి ముందు డ్రెస్ రిహార్సల్సుకే హాలు చుట్టూ పోలీసు, అశ్విక సైన్యం కాపలా పెట్టింది ప్రభుత్వం! ఏదో మహాయుద్ధమే జరుగుతూం దనుకుంటారు గాని నాటకం రిహార్సలని యెవరూ అనుకోరు. ఇంక నాటక ప్రదర్శనంలో నటీ సూత్రధారులకి బదులుగా పోలీసు ఆఫీసర్లే స్టేజీమీద. గోర్కీని గౌరవించడానికి యీ స్టేజిమీదే విద్యార్థులు ప్రదర్శనాలు చేస్తారేమోనని వాళ్ల అనుమానం!

నాటకంలో 'నిల్' అనే పాత్ర వుంటుంది. అతడొక యువకరైల్వే కార్మికుడు. అతనంటాడు, స్టేజిమీద :—

"మనిషి ఓప్రక్కనే పడుకున్నప్పుడు విసుగెత్తితే రెండో ప్రక్కకు ఒత్తిగిలుతాడు. కాని, ఆ మనిషే తన జీవితం పట్ల విసుగ్గా వుంటే గొణుగుతా డంతే. ఆ తర్వాత కొంచెం ప్రయత్నం చేసి, ఒత్తి గిలుతాడు!"

ఈ మాట లాత దంటూంటే ప్రజలు కోలాహలంగా చప్పట్లు కొట్టేసేరు.

'నికృష్టజీవితం' మరీ మెప్పుల్ని పొందింది. ప్రజలనుంచి.

"అబద్ధాలు,-యీ మాటలోనే వుంది. బానిసలు-యజమానులు.-వీళ్ళ మతం అంతా." అంటా దందులో సతీన్. ఈ వాక్యాన్ని స్టేజిమీద ఉచ్ఛరించరాదని సెన్సారు నిషేధించింది. కాని నాటకంలోని మూలభావాన్నీ, ముఖ్యసందేశాన్నీ నలిపి నాశనం చేయలేక పోయింది, ప్రభుత్వం.

ఆ నాటకంలోని ప్రతివాక్యమూ, ఏ సామాజిక విధానం క్రింద మానవుల్లో అత్యధిక సంఖ్యాకులు జీవించడానికి హక్కు కూడా లేకుండా చేయబడుతున్నారో, ఆ విధానం మీదే నిప్పులు చెరుగుతూ, దాన్ని దగ్ధపటలం చేసింది. ఏ సామాజిక విధానం, ఎందరో మానవుల్ని, 'ఒకప్పుడు మానవులుగా వున్న జంతువుల' క్రింద మార్చేస్తూందో, ఆసామాజిక విధానం ఒక పెద్ద 'అబద్ధాన్ని' 'బూటకాన్ని' పునాదిగా చేసుకుని నిర్మించబడిందనీ, ఆ బూటకాన్ని కూకటివేళ్ళతో పెల్లగించేయాలనీ, యీ నాటకం యిచ్చే సందేశమని చూసినవాళ్ళంతా బాగానే గ్రహించేరు.

'నికృష్టజీవితం' మొదటి ప్రదర్శనం రోజు రాత్రి ప్రేక్షకులు గోర్కీని బ్రహ్మాండంగా పొగడుతూ ప్రదర్శనాలు గావించేరు. 'గోర్కీ స్టేజి మీదికి రావాలి' అని ఒకటే గోల. ఆశ్చర్యంతో, విస్తుబోతూ గోర్కీ స్టేజిమీదికి వచ్చేడు. ఆ కంగారులో గోర్కీ నోట్లో సిగరెట్టు తీయడం మరిచే పోయేడు !....

ప్రదర్శనం మాత్రమే గాక నాటకం కూడా ప్రజల హృదయాల్ని చూరగొంది.

## 12 వ ప్రకరణము

## మూడు విప్లవాలు

"నువ్వు కాల్చాలి, జనరల్! ఎడతెగకుండా కాలుస్తూనే వుండాలి!" (జార్ నికోలస్ *II*, వ్లాడివాస్టోక్ కమాండెంటు జనరల్ కజ్బెక్‌తో సంభాషణలో.)

'తుపాను పక్షిగీతం' లో చెప్పినట్లుగా తుపాను చివరకి రానే వచ్చింది. 1905 లో రష్యన్ ప్రజల రక్తం పుష్కలంగా ప్రవహించింది. ప్రజల రక్తంతో చక్రవర్తి భవనం యెదుటి చతుష్పథం, మంచూరియాలోని సుదూర పర్వతశ్రేణులు, పోలీసుస్టేషన్ల ముంగిళ్ళు, మంచుతో కప్పబడ్డ రోడ్లు, నీలిరంగు ఓడదెక్కులు కూడ రక్తంతో ప్రక్షాళితము లైనాయి.

సంవత్సర ప్రారంభంనుంచీ గందరగోళాలుగానే వున్నాయి. జనవరి 9 తేదీని పోలీసు రహస్య యేజంటు, ఫాదర్ గేపన్, పీటర్స్‌బర్గు కార్మికుల్ని బ్రహ్మాండమైన ఊరేగింపుతో 'వింటర్ పాలెస్' కి నడిపించేశు. కార్మికులు చక్రవర్తికి పిటిషన్ రాసి తీసుకు వెళ్లేరు. దాంట్లో,—

"ప్రభువువారి పాదసన్నిధికి, మీబిడ్డలమైన మేము, పీటర్స్‌బర్గ్ కష్టజీవులం,—మా భార్యా బిడ్డలు, మా వృద్ధ జననీజనకులు,—మేము, నిరాధారులమై, అనన్యగతికులమై, న్యాయాన్నీ, రక్షణనూ కోరి తమ సన్నిధికి వచ్చేము.

"ప్రభూ! మేమీ అవస్థలను యింక భరించలేకున్నాము. మా ఓరిమి నశించింది. ఈ బాధలను సహించుట కంటె మరణించుటే మేలను స్థితికి వచ్చేసేము."

రెండు లక్షల మంది స్త్రీ పురుషులు, నిరాశులై, పీడితులై, రక్షణ దొరకుతుందేమోననే ఆశాలేశంతో, చక్రవర్తి శరత్ప్రాసాదంలో, తమ్మును పీడించే యీ దోపిడిగాళ్ళనుంచి రక్షణ దొరుకుతుందని వెళ్లేరు.

ప్రభుత్వమూ, చక్రవర్తీ కూడా యీ రీతిగా ప్రజలు వస్తారని ముందే యెరుగుదురు. సైన్యాలకి సిద్ధంగా వుండమని ఆర్డర్లు జారీ అయినాయి. జారు బంధువుడే గ్రాండ్‌డ్యూక్ వ్లాడిమిర్ అనే అతడు రాజదర్బారులోనే ప్రకటించేడు: "రాజకుటుంబం రక్షించబడాలంటే ప్రజల రక్తబలి కావాలి!" అతణ్ణి సైన్యాధికారిగా నియమించేరు.

గోర్కీ కూడా ఆ రోజున ప్రజలతో బాటుగా వీధుల్లోనే వున్నాడు. కాల్చమనేదానికి ఆజ్ఞ యిస్తూ బూర ధ్వని యమకింకరుల గొంతులా వినిపించింది. ఆ రోజు మరువరానిది. భయంకరమై పిడుగులా ఫెళఫెళ ప్రజలమీద విరుచుకు పడింది.

ప్రజలు భయపడలేదు. ఉద్రేకపూరితులై పోయేరు. వారిలో వున్న కొంచెం ఆశా యింకి పోయింది; రాజభక్తి లేశం నాశం అయింది. తుపాకి కాల్పులకి సమాధానంగా ప్రజలు నినాదాలు యిస్తున్నారు:

"దుర్మార్గులారా! మీరు ప్రజల్ని నాశం చేయలేరురా!"

"ప్రజకి మరణం లేదురా! మీరూ అనుభవిస్తారులే!"

"మీరు కాల్చిందీ రోజున ప్రజల్ని కాదు, రాజభక్తినిరా!" చక్రవర్తి తమకి యేదో కరుణ చూపుతాడని, ఆ రోజు ఉదయం కూడా ప్రజలకి ఆశవుంది. అందుకనే చేతుల్లో పిటీషన్లు, శిలువలు, దేవతావిగ్రహాలు తీసుకు వెళ్లేరు. ఆశకాస్తా నశించింది. మధ్యాహ్నం నుంచీ ఆయుధాల కోసం వెతికేరు. ఉన్నట్టుండి ఆయుధాలు యెక్కడ దొరుకుతాయి? అంచేత చేతికి దొరికిన దల్లా తీసుకున్నారు. రాళ్లూ, యిటుకలు, కొయ్యలు, పాషాణాలు పట్టుకున్నారు. ఫాదర్ గేపన్ దొరక్కుండా పలాయనమంత్రం పఠించేడు. పిటీషనర్లు పోరాటానికి తయారైనారు. మొదటి రష్యన్ విప్లవంలో నాందీ ప్రస్తావన జరిగింది.

గోర్కీ యింటికి తిరిగి వచ్చేడు. అతని శరీరం, మనస్సూ భగ్గున మండిపోతున్నాయి. "రష్యన్ ప్రజలకూ, యూరపుదేశాల పౌరులకూ విజ్ఞప్తి" చేస్తూ, ఒక కరపత్రం వ్రాసేడు.

ఆ రోజున పీటర్సుబర్గు వీధుల్లో జరిగింది అదివరకే ఆలోచించి బుద్ధి పూర్వకంగా చేసిన దారుణ హత్యాకాండ అనీ, దీనికి బాధ్యుడు జారు చక్రవర్తి అనీ, దీనికి తగిన ప్రతీకారం జరగాలనీ, రాజరికాన్ని కూల ద్రోయడానికి బహిరంగంగా ప్రజలు పోరాడాలనీ హెచ్చరిస్తూ కర పత్రాన్ని ముగించేడు.

ఈ కరపత్రం వ్రాతప్రతి ప్రభుత్వం చేతుల్లో చిక్కింది. రహస్య పోలీసులికి గోర్కీ దస్తూరీ కొట్టిన పిండే ఆయెను. జనవరి 11 తేదీని గోర్కీని అరెస్టు చేసేరు. పీటర్ అండ్ పాల్ దుర్గంలో అతన్ని బంధించి వుంచేరు. ఇందులో గొప్ప నేరాలు చేసిన వాళ్ళకే గాని ప్రవే శంలేదు.

రాత సాధనాలు యిమ్మని పదేపదే పిటిషన్లు పెట్టగా చివరకి అనుజ్ఞ దొరికింది. ఈ జైలులో వుండే "సూర్యసంతానం" అనే నాటకాన్ని రాసేడు. దీనిమీద జనవరి తొమ్మిదవ తేదీ సంఘటనల ప్రభావం స్పష్టంగా కనిపిస్తుంది. అందులో ఒకపాత్ర నోట గోర్కీ అనిపిస్తాడు:

"ఏదైనా కఠోరమైన, కటువైన మాటగాని, ధ్వనిగాని విన్నానంటే, ఏదైనా యెరుపు కంటికి కనిపించిందంటే, నా మనస్సు నెవరో కోస్తూ న్నట్లు బాధ కలుగుతూంది; నామనోనేత్రం యెదుట ఆ భయంకరమైన జనసమూహం, రక్తప్లావితమైన ముఖాలు, యెర్రని నులివెచ్చటి రక్తపు మడుగులు,—ప్రత్యక్షమవుతాయి...."

గోర్కీకి కేవలం భయభ్రాంతత్వమేగాదు మిగిలింది. ఇందులో అనేక చమత్కృతుల్ని కూడా జొప్పిస్తాడు. అవి చదువుతూంటే గోర్కీయే నవ్వకుండా వుండలేక పోయీవాడు. ఈ ఖైదీ యేమిటో ఊరికే నవ్వుతాడని వార్డర్లకి అనుమానం వేసింది. జైలు గవర్నరును పిలుచుకొచ్చేరు........

అంతకి ముం దొకసారి గోర్కీని నొవోగ్రాడ్ జైలులో నిర్బంధించి నపుడు రష్యా అంతటా ప్రజాందోళన లేచింది. ఈసారి పెట్రోగ్రాడ్ జైలులో పెట్టగానే యూరోపంతటా నిరసన చూపేరు.

"గోర్కీ ఒక్క రష్యాకే చెందిన వాడనుకుంటున్నారా? అతడు ప్రపంచం యొక్క పెన్నిధి" అన్నాడు అనటోల్ ఫ్రాన్స్ పారిస్‌లో ఒక పెద్ద సభలో మాట్లాడుతూ.

ఫ్రాన్సు. జర్మనీ, పోర్చుగల్, ఇటలీ. బెల్జియం.-యింకెన్నో దేశాల నుంచి అతని అరెస్టును ఖండిస్తూ. జార్ ప్రభుత్వానికి టెలిగ్రాములు. పిటిషన్‌లు వర్షంలా కురిసేయి. ఫ్రెంచి శాస్త్రజ్ఞుడు పీరీ క్యూరీ. ప్రసిద్ధ శిల్పి అగస్టీ రోడీ. సోషలిస్టు నాయకుడు జీన్ జ్యూరిస్. చిత్రకారుడు క్లాడీమోనెట్.-యింకెందరో జగత్ప్రసిద్ధులు గోర్కీని విడుదలచేయా లని ప్రకటించేరు. వీరందరూ గోర్కీ మిత్రులే. కాని రష్యన్ ప్రభుత్వం మాత్రం బుద్ధిహీనతను వెల్లడిస్తూ, గోర్కీని. "నిఝ్ని-నొవోగ్రాడ్ పట్టణపు కూలీ" అనే పేర్కొనేది।

దుర్గంలో అతన్నొకసారి ప్రశ్నించేటపుడు ఒక ఆఫీసరు గోర్కీతో,- "నీ అరెస్టు యెక్కడ చేసేమోగాని కందిరీగలతుట్టని రేపినట్లే ఐన దయ్యా। యూరోపంతా ఒకటే గొడవ।" అన్నాడట. ఇతడే ఏడు సంవత్సరాలకి పూర్వం గోర్కీని మిటిఖ్ దుర్గంలో (టిఫ్లిస్) ప్రశ్నిం చినవాడు........

తిరిగి ప్రభుత్వం ప్రజాభిప్రాయానికి లొంగక తప్పిందికాదు. తల వంచి, గోర్కీని మూడోసారి ఖైదునుంచి విడుదల చేసేరు.

ఈ జైల్లో వుండడమే తటస్థిస్తే గోర్కీ బతికి వుండేవాడు కాడు. అసలక్కడ ఆ రాతిగోడలే మనుష్యుల్ని మింగేస్తాయి. ఒక నెలరోజు లుంచే సరికే గోర్కీ రక్తం కక్కుకో నారంభించేడు.

'అరక్త భానువారం' అనే పేర 1905 జనవరి 9 తేదీని రష్యన్ ప్రజలు పిలుస్తారు. ఆ నాటి సంఘటనల్ని ప్రజలు మరిచిపోలేదు. తిరుగుబాటుకి యేర్పాట్లు చేసుకుంటూన్నారు. సంవత్సరం ఆఖరికి తిరుగుబాటు రానే వచ్చింది. మాస్కో కార్మికులూ సమ్మె చేసేరు. పరిస్థితులు తీవ్ర రూపం దాల్చేయి. "కోసక్కులు వస్తున్నారు!" అనే కేక వింటేనే చెదిరి పారిపోయే ప్రజలు యిప్పుడు వాళ్లనే యెదిరించి పోట్లాడుతున్నారు. 1905 విప్లవం తీవ్రస్థితిలో వుంది.

గోర్కీ మాస్కోలో నివసిస్తూ (1905 డిసెంబరులో) ఆయుధాలు కొనడానికి డబ్బు ప్రోగుచేస్తున్నాడు. అశ్వికశిక్షణా పాఠశాలకి యెదురుగా వున్న గోర్కీ మేడ ఒక మిలిటరీ క్యాంపులా వుండేది రైఫిళ్లు, రివాల్వర్లు, చేతిబాంబులు,—యివన్నీ, పోగుచేసి, దళాలకి పంచేవారు. "చట్టబద్ధులుగా" జీవించే పౌరులు కొందరు కూడా అక్కడ కాపురముండేవారు. గోర్కీ గదిలోంచి తుపాకి చప్పుళ్ళు విని వాళ్ళు భయంతో విభ్రాంతులై పోయేవాళ్ళు! గోర్కీకి అంగరక్షకదళంగా యేర్పడిన కకేషియన్ విద్యార్థులు ఆతని గదుల్లో తుపాకి గురి కాల్చడం ప్రాక్టీసు చేస్తూండేవాళ్ళు.

కార్మికులు వీధుల్లో బారికేడ్లు నిర్మించడం; సైనికులు రైఫిలు కాల్పులతో వీధులు తుడిచి పెట్టడం; క్రాస్నయా ప్రెస్నయా ప్రాంతాన్నంతా ఫిరంగి గుండ్లతో దంచి వదలడం; యిదంతా గోర్కీ స్వయంగానే చూసేడు. మాస్కో తిరుగుబాటు అణిచివేయ బడింది. కాని విప్లవం చల్లారలేదు.

గోర్కీ కార్మికులకు వ్రాసిన లేఖయొక్క కాపీలు రైపుచేసి రష్యా అంతటా పంచి పెట్టేరు. దానిలో యిట్లా వుంది :—

"కార్మికవర్గం ఓడిపోలేదు. ఏవో కొద్దిపాటి నష్టాలు కలిగినాయంతే. నూతన ఆశలతో విప్లవ వర్గం బలవత్తరమైంది. విప్లవ బలగం కూడా

అమేయంగా విస్తృతం అయింది.........రష్యన్ కార్మికవర్గం కడపటి విజయం వైపు శీఘ్రంగా ప్రయాణం చేస్తూంది. ఒక్క కార్మికవర్గమే నైతికబలం, ధర్మబలం, ఆత్మవిశ్వాసం గలిగి వుండగలదు. నేను చెప్పేది యదార్థము. మర్యాదగల, నిష్పక్షపాత బుద్ధిగల చరిత్రకారులు దీని నిజాన్ని అంగీకరించే తీర్తారు. ఆరోజు దగ్గరలోనే వుంది."

మాస్కో తిరుగుబాటుకు ముందే 1905 నవంబరులో గోర్కీ మొదటిసారి లెనిన్‌ను కలుసుకున్నాడు.

రష్యన్ ప్రజల కే యాదార్థ్యాన్ని గోర్కీ చెప్పేడో, దానినే లెనిన్ కూడ మరొక రీతిగా చెపుతున్నాడు. దీని యాదార్థ్యాన్ని చరిత్రకారుల కంటే ముందే చరిత్ర ఋజువు చేసింది.

* * * *

గోర్కీ అరెస్టుకై వారంటు జారీ అయినదని అతని మిత్రులు హెచ్చరించేరు. అతడు వెంటనే విదేశాలకి పయనమయేడు. జర్మనీ, ఫ్రాన్సు, ఆ తర్వాత అమెరికాకు వెళ్లేడు. న్యూయార్కులో వుంటూ అనేక మీటింగుల్లో మాట్లాడుతూ, కరపత్రాలు వేస్తూ, పత్రికలకు వ్రాస్తూ, జారు ప్రభుత్వాన్ని తూర్పారబట్టేవాడు. విదేశీబ్యాంకులు రష్యన్ ప్రభుత్వానికి అప్పు యిచ్చి, విప్లవోద్యమాన్ని నాశనం చేయడానికి యత్నిస్తూన్నాయనీ, అట్టి దుర్మార్గం జరగనీయకుండా అమెరికా ప్రజాభిప్రాయాన్ని కూడగట్టాలనీ కృషి చేసేడు.

అమెరికాలో వుంటూనే అతడు సాహిత్యకృషిని సాగించేడు. అడిరోండక్సులో ఒక తోటలోని కొయ్య కుటీరంలో వుంటూ గోర్కీ సుప్రసిద్ధమైన నవల 'అమ్మ' ను రాసేడు.

ఈ నవలలోని పాత్రలన్నిటినీ అతడు నొవోగ్రాడ్‌లోని సొర్మోవో కార్మికులనుంచే తీసుకున్నాడు. అందులోని పావేల్ వ్లాసోవ్, తల్లి

విలోవ్నా. యిద్దరూ పీటర్ జలోమోవ్ అనే కార్మికుడూ అతని తల్లీను. సొర్మోవో కార్మికులు 1902 మే డే ఊరేగింపులు చేసినందుకు జలోమోవ్‌ను జైలులో పెట్టేరు. అతని తల్లికూడా విప్లవోద్యమంలో పాల్గొనేది బ్రహ్మచారిణి లా వేషం వేసుకుని ఆమె నొవోగ్రాడ్ ప్రాంతం అంతటా విప్లవవాఙ్మయం పంచుతూండేది.

ఈమెయే గాక కదమొత్సేవ్‌ల కుటుంబం ఒకటి. విప్లవకుటుంబమే అది. వాళ్ల తల్లిని యూఫాలో విచారణ చేసేరు. కుమారుడు జైలు నుంచి తప్పించుకునేందుకు అతనికి బాంబుల్ని రహస్యంగా అందించిందామె. వాటితో గోడలు బ్రద్దలు గొట్టి పారిపోయేడు. వీళ్లేగాక యిటువంటి మాతాపుత్రుల్ని డజన్ల మందిని ఆత డెరుగును. వీళ్ళలో చాల మంది నాతడు స్వయంగానే యెరుగును.

'అమ్మ' యొక్క ప్రాముఖ్యతను గుర్తించిన ప్రభుత్వం మొదటి భాగం ప్రచురించిన పత్రిక కాపీలన్నీ స్వాధీనం చేసుకుంది. రెండో భాగం వికృతంగా తయారయేలా సెన్సారుచేసి ప్రకరణాలికి ప్రకరణాల్నే తొలగించేసింది.

ఈ సారి గోర్కీమీద ప్రభుత్వం కోర్టుద్వారా చర్యలు ప్రారంభించింది. పీటరుబర్గు మునిసిపాలిటీ పత్రిక 'విదొమోస్తీ' లో ఒక ప్రకటన పడింది : "పీటర్సుబర్గు కోర్టు జారీచేసిన వారంటుమీద పోలీసువారు విఝ్నీ-నొవోగ్రాడ్ గృహాలంకారికుల గిల్డుకి చేరిన అలెగ్జీ మాగ్జిమోవిచ్ పెష్కోవ్ అనే కూలివానిని హాజరు కమ్మని ఆజ్ఞాపిస్తున్నారు." కాని, అదృష్టవశాత్తూ 'కూలివాడు' గోర్కీ వీళ్ళకిఅందనిచోట వుండిపోయేడు.

విదేశాల్లో జారు ప్రభుత్వానికి వ్యతిరేకంగా పనిచేసిన తర్వాత యింక స్వదేశానికి వెళ్ళేందుకు ఆశలు లేవాతనికి. అందుచేత గోర్కీ యిటలీ తీరంలో వున్న కాప్రీ ద్వీపంలో నివాసం యేర్పాటు చేసుకున్నాడు.

ఈ కాలంలోనే గోర్కీకి లెనిన్‌తో గాఢమైత్రి యేర్పడింది. 1907 లో రష్యన్ సోషల్ డెమోక్రాటిక్ పార్టీ అయిదో కాంగ్రెస్ లండన్‌లో జరిగింది. దానికి రమ్మని లెనిన్ గోర్కీని ప్రత్యేకంగా ఆహ్వానించేడు.

రోజూ నాలుగు చక్రాల బండిలో లండన్ బైటవున్న ఒక కొయ్య చెర్చిలో జరుగుతూన్న మీటింగుకి వెళ్ళేవాడు గోర్కీ. అంతకంటె తగిన మీటింగు స్థలం వాళ్ళకి లండన్‌లో దొరకలేదు!

గోర్కీ ఓ ప్రక్కగా స్థంభానికి జేరబడి సభలో జరుగుతూన్న చర్చల్ని వింటూ, చూస్తూ, గంటల తరబడిగా కూర్చునేవాడు. ఆ కాంగ్రెస్‌లో మెన్షివిక్‌లకూ, బోల్షివిక్కులకూ వాదోపవాదాలు బహు తీవ్రంగా రోజులు తరబడిని సాగినాయి.

"........చివరకి వేదిక దగ్గరికి గబగబా నడుస్తూ వచ్చేడు వ్లాడిమిర్ యిలిచ్. వేదిక నెక్కి 'కామ్రేడ్సు' అని కంఠ్యంగా ఉచ్చరిస్తూ, ఉపన్యాసాన్ని ప్రారంభించేడు. మొదట్లో యేమీ బాగా మాట్లాడటం లేదనిపించింది. కాని, మరుక్షణంలోనే, నేనూ అందరికి మల్లేనే ఆ ఉపన్యాసానికి ముగ్ధుడనై కూర్చుండి పోయేను. పాలసీకి సంబంధించిన చిక్కు సమస్యలమీద అంత సులభంగా మాట్లాడడం నేనదివరకు విననేలేదు. వాగాడంబరం కోసం, లేని బలం తెచ్చుకోడం కోసం అతడు ప్రయత్నించనేలేదు. ఎంత స్పష్టంగా, అరటిపండు ఒలిచి పెట్టినట్లుగా, ప్రతి మాటా స్పష్టంగా, సరిగా అర్థం అయేలా తూచివేసినట్లు మాట్లాడేడు."

లెనిన్ మొదటి ఉపన్యాసం విని, గోర్కీ యిచ్చిన అభిప్రాయం యిది. అది మొదలు యీ యిద్దరికీ స్నేహం బలపడింది.

లెనిన్, గోర్కీని కాప్రీకి వచ్చి కలుసుకున్నాడు. తన రాజకీయాల నుంచి కొద్ది రోజులు మనసు మరల్చుకుని, లెనిన్ గోర్కీతో చద

రంగం ఆడుతూ, చేపలు పడుతూ, కొండల్లోకి షికారు పోతూ, బయళ్ళ మీది ముళ్ళపొదలు, పచ్చని పూలూ చూస్తూ, కాలం గడిపేవాడు.... సాయంత్రం సమయాల్లో గోర్కీ తన దేశాటనల్ని గూర్చి గాధలుగా చెపుతూంటే, లెనిన్ ముగ్ధుడై వింటూ చిత్తరువులా వుండిపోయేవాడు.

కాప్రీలోని పల్లెవాళ్లు లెనిన్‌తో యెంతో స్నేహం చేసేసేరు. లెనిన్ వెళ్ళిపోయేక వాళ్ళు గోర్కీని రోజూ లెనిన్‌న్ని గూర్చి అడుగుతూనే వుండేవాళ్ళు.

"జార్ అతన్ని పట్టుకోలేదు కదూ?"

గోర్కీకి తరుచుగా లెనిన్ జాబులు రాస్తూండేవాడు. అందులో గోర్కీ ఆరోగ్యాన్ని గూర్చీ, సాహిత్యకృషిని గూర్చీ పరామర్శిస్తూండేవాడు.

"శ్రామికవర్గ కళాకారుల్లో అగ్రేసరుడు, గోర్కీ" అనేవాడు లెనిన్. "ప్రపంచశ్రామిక వర్గోద్యమానికి అతడెంతో సేవచేసి యున్నాడు. ముందెంతో చేయగలడు. ప్రధమశ్రేణికి చెందిన అత్యుత్తమ సాహిత్యకారుల్లో, సాహిత్యం ద్వారా పీడితమానవలోకానికి అమోఘసేవ చేరిన వారిలో గోర్కీ ఒకడు."

1913 లో రష్యా ప్రభుత్వం గోర్కీమీద ఫిర్యాదులన్నీ ఉపసంహరించుకున్నపుడు, లెనిన్ సలహామీద గోర్కీ కాప్రీనివదలి రష్యాకు తిరిగివచ్చి, పీటర్స్‌బర్గ్‌లో నివాసం యేర్పాటు చేసుకున్నాడు. తర్వాత ఒక సంవత్సరానికే ఐరోపా యుద్ధం బ్రద్దలైంది.

యుద్ధాన్ని గూర్చి విప్లవ విద్యార్థుల్లో ఒకసారి మాట్లాడుతూ గోర్కీ యిట్లా అన్నాడు.

"యుద్ధరంగంలో ఒక జర్మనూ, ఒక రష్యనూ తలపడ్డారు. ఏకసమయంలోనే ఒక రొకరి బాయ్‌నెట్లు రెండోవాని గుండెల్ని చీల్చుకుని

పోగా, యిద్దరూ, ఆ దూకుడికి ఒకరిమీద ఒకరు పడి కౌగలించుకున్నారు. మృత్యువునూ, సోదర సైనికునీ కూడ ఏక కాలంలో ఆలింగనం చేసికొన్న వీళ్ళని చూస్తే, మనం ఏమనాలి? మతిమాలిన, అపకీర్తి భాజనమైన, పరస్పరవధోద్యోగంలో నిమగ్నులైయున్న రెండు సోదరజాతుల మతిహీనతనూ, దురదృష్టాన్నీ యీఉదాహరణ చాటడం లేదా?"

యుద్ధరంగంలోని సైనికుల మాట చెపుతూంటే గోర్కీ కంఠం రుద్ధమైపోయింది. కాని, వెనక సురక్షితంగా కూర్చుని, యితరులు చేస్తూన్న యుద్ధాల్లోని నీచ రాక్షసకృత్యాల్ని కూడా జాతీయగౌరవచిహ్నాలుగా చెప్పుకుని చంకలు కొట్టుకుంటూండే వ్యాపారస్థులు, విద్యావంతుల మనుకునే వాళ్ళమాటా వస్తే గోర్కీ అసహ్యంతో కోపోద్రిక్తుడయేవాడు.

ఒకసారి బహిరంగంగా మాట్లాడుతూ:

"ప్రపంచాన్నంతనీ తన ముట్టెతో కెళ్ళగించుతూన్న ఒక పెద్ద పందియొక్క పిచ్చిచేష్టల్ని మనం చూస్తున్నాము."

ఆరోజుల్లో గోర్కీ 'లిటోపిస్' (చరిత్రలు) అనే పత్రికను నడుపుతూ, సామ్రాజ్యవాద యుద్ధానికి వ్యతిరేకంగా వ్రాసేవాడు. ఈ పత్రికలోనే మొదటిసారిగా మైకోవ్‌స్కీ యొక్క "యుద్ధం - శాంతి" అనే గీతం ప్రచురితమైనది. ఆరోజులలో మైకోవ్‌స్కీ ప్రసిద్ధుడుకాలేదు. ప్రజ లాతని నొక సర్వదూషణాపరునిగా (సాహిత్యంలో) నే చూసే వాళ్ళు. పసుపురంగు చొక్కా తొడిగి, సిల్కుటోపీ పెట్టి, కవి వేషంతో చెలామణి అవాలనుకునే యువకు డాతడని వారి అభిప్రాయం.

'యుద్ధం - శాంతి' అను గీతంలో "యుద్ధం మొగాన ఉమిసితి, నా గీతికా ఖండాల" అనన్నాడు మైకోవ్‌స్కీ.

యుద్ధం మూడో సంవత్సరం; శీతకాలం వచ్చింది. ప్రజల కష్టాలకి పరిమితేలేదు. ఆ శీతకాలం అనంతమేమో అనిపించింది. 'లిటోపిస్' కార్యాలయంలో ముఖ్యసంభాషణ యెప్పుడూ కూడా ఫాక్టరీల్లో, యంత్రాగారాల్లోని గందరగోళాన్ని గూర్చే వుండేది. 1917 ఫిబ్రవరిలో గోర్కీ "మనం ప్రకరణాంతానికి వచ్చేం. కథ ముగుస్తుంది" అన్నాడు. మరుసటి వారంలోనే "ద్నో" దగ్గర జార్ యొక్క సీల్రైయిన్ ఆపివేయబడింది. పిట్రోగ్రాడ్ నుంచి యుద్ధరంగానికి పోతూన్న చక్రవర్తిని నిలబెట్టి, ప్రజలు సింహాసనచ్యుతుని చేసేరు. జార్ రెండో నికోలస్ రాజ్యాధికారాన్ని వదలిపెడుతూ స్వయంగా పత్రం వ్రాసేసేడు. ఇది 1917 ఫిబ్రవరి లో.

గోర్కీ స్నేహితుడైన డి. డెస్నిట్స్కీ యిట్లా వ్రాసేడు: "1917 సంఘటనల తర్వాత గోర్కీ - లెనిన్ మొదటి సారిగా కలుసుకున్నపుడు జరిగిన విషయాలు నాకు యిప్పటికీ బాగా జ్ఞాపకం. సోషలిస్టు రివల్యూషనరీ కప్లాన్ లెనిన్‌ను చంపడానికి యత్నించిన తర్వాత కొద్దిరోజులకే యిది జరిగింది. లెనిన్ పడకమీదే వున్నా ఉల్లాసంగా వున్నాడు. చిరునవ్వుతూ, చేతులు రెండూ నలుచుకుంటూ 'ఊ! రావోయ్! చెప్పు! కానీయ్, నీమనసులో వున్న దేమిటో విందాం....' అంటూ గోర్కీని తొందరచేస్తున్నాడు."

"వీళ్ళని చూడ్డానికి స్వెర్డ్లోవ్ కూడా వచ్చి యీ మిత్రబృందంతో చేరేడు. లెనిన్ తనను చంపడానికి జరిగిన యత్నాన్ని వర్ణిస్తూన్నాడు. రివాల్వరు కాల్చడం, ఆపరేషన్, తర్వాత తను మంచం పట్టడం, రోగం, అంతా వివరంగా చెపుతున్నాడు. "అంతా యుద్ధం లాగేనోయ్! సరిగ్గా యుద్ధమే అనుకో! ఇదింకా అప్పుడే అయిం దనుకున్నా రేమిటి ?........"

"ఆ పూట కక్కడే భోజనం చేయమని పట్టుపట్టేడు. "ఈ జున్ను రుచి చూడండి, కొంచెం. రొట్టె తాజాసరుకు, ఎంతో మెత్తగావుంది, తినిచూడు. చెర్రీపళ్లు (రేగు) తిను. ఈ రోజే తెప్పించేము, అవి...." భోజనం ఎంతో పొదుపుగా వుంది. ఆ రోజుకి యింట్లో 'టీ' కూడా లేదని గృహస్థుకి తెలియదు. నేను చటుక్కున ఆఫీసులోకి వెళ్ళి, ఓ నొవోగ్రాడ్ స్నేహితుణ్ణి పంపి ప్రధానమంత్రికి టీ తెప్పించేను."

"లెనిన్‌కి తగిలిన గాయాన్ని గూర్చి ప్రశ్నిస్తూంటే గోర్కీ ముఖం మీద బాధ కనిపించింది. ఈ గాయాలవల్ల ఆరోగ్యానికీ, పనికీ యేమీ భంగం రాకండా వుంటుందన్నారుకదా, డాక్టర్లు? అని అడిగేడు."

"వ్లాడిమిర్ జాగ్రతగానూ, సునాయాసంగానూ చేతి నెత్తి, జాపి, ముడిచి, మళ్ళీ జాచేడు. గోర్కీ లెనిన్ కంఠెయెముక మీదుగా చేతితో స్పృశిస్తూ, చేతి నరాల్ని పరీక్షించేడు. గోర్కీకేసి పరీక్షగా చూస్తూ, లెనిన్ నిశ్చలంగా నిలుచునే వున్నాడు. తన స్నేహితుని దైహికదార్ఢ్యమును గూర్చి నమ్మకం కలిగించుకోడానికే గాదు గోర్కీ యీ పరీక్షకి పూనింది! భవిష్యత్తు నాశామయంగా చేస్తూ, తేజోప్రసరణ చేస్తూన్న, యీ నశ్వరదేహంలో కోట్లకొలది మానవుల ఆశయాలు, ఆశలు, శక్తీ, యెట్లా యిమిడి వున్నాయాయని పరీక్షిస్తూన్నట్లుంది! గోర్కీకి నమ్మకం కలిగినట్లే వుంది, చూస్తే!"

లెనిన్‌కూడా గోర్కీ ఆరోగ్యం విషయంలో యెంతో ఆదుర్దా కనబరచేవాడు. 1921 లో గోర్కీ ఆరోగ్యం పాడైనపుడు, అతన్ని విదేశాలకి ఆరోగ్యానికై పొమ్మని లెనినే బలవంత పెట్టేడు. గోర్కీ మళ్ళీ యిటలీకే వెళ్ళి, యీ తూరి సొర్రెంటోలో నివసించేడు.

ఇటలీలో వుంటూనే సోవియటు భూమిలో జరుగుతూన్న సంఘటనల్ని బహు జాగ్రత్తగా పరిశీలిస్తూ, మాతృభూమితో తన బంధనాల్ని బలపరుచుకుంటూండేవాడు.

1928 లో అతనికి షష్ఠిపూర్తి ఉత్సవాలు సోవియటు రష్యా అంతటా కోలాహలంగా జరిగినాయి. అతడా సందర్భంలో యిటలీ నుంచి స్వదేశానికి మరలి వచ్చేడు.

1932 లో గోర్కీ సాహిత్యకృషి యొక్క నలభయ్యో వార్షికోత్సవం జరిగింది. 1892 లో అతని మొదటి కథ ప్రచురితమైన సంగతి గుర్తుందా ? ఈ సందర్భంలో సోవియటు యూనియన్ కమ్యూనిస్టుపార్టీ కేంద్రకమిటీ గోర్కీని అభినందిస్తూ తీర్మానించింది.

"మాగ్జిమ్ గోర్కీ పేరు సోవియటు ప్రజలకు యెంతో ప్రీతి పూర్వకంగా హృదయాల్లో భద్రపరచుకో దగినది. అంతేగాక యిత డొక మహాకవిగా, విప్లవకారుడుగా, నిరంకుశత్వా న్నెదిరించి పోరాడిన వీరుడుగా ప్రపంచమంతా గౌరవిస్తుంది."

లెనిన్‌తో స్నేహం వల్ల యితడు విప్లవ కార్యక్రమంలో వ్యగ్రుడవుతూ వచ్చేడు. తర్వాత స్టాలిన్‌తో స్నేహం వల్ల సోవియటులోని సాహిత్యక్షేత్రంలో కృషి చేసేడు. అతని ఆధిపత్యాన యెన్నో పత్రికలు ప్రారంభించ బడినాయి; మరెన్నిటినో ఆతడు సంపాదకవర్గంలో వుండి నడుపుతూ వచ్చేడు.

"ఫాక్టరీల, యంత్రాగారాల చరిత్ర" "అంతర్యుద్ధ చరిత్ర" అను మహాగ్రంధాలకు గోర్కీ సంపాదకుడుగా వున్నాడు. సోవియటు రచయితల సంఘ కార్యక్రమాన్ని నడుతూ వచ్చేడు.

గోర్కీ యెన్ని పనుల్లో మునిగివున్నా తన లేఖినిని మూలబెట్టలేదు. 'క్లిమ్ శాంఘిన్' అను తన నవలకు అనుబంధనవల రచించేడు; ఎన్నో వ్యాసాలు, నాటకాలూ రాసేడు. అతని నాటకాల్లోకి ఉత్కృష్టమైనదిగా యెంచబడే 'యెగోర్ బులిఛోవ్' యీ కాలంలో వ్రాసిందే.

కడపటి సంవత్సరంలో గోర్కీ తన స్నేహితులతో అంటూండేవాడు : "నేనింక నాలుగు పుస్తకాలు వ్రాసి తీరాలి, అదేమో తప్పదు.

ఒక్కొక్కటి వ్రాయడానికి రెండేళ్లు పడుతుంది. మొత్తం ఎనిమిదేళ్ళు చాలు" అతడు వృద్ధుడైనా జీవించి వుంటే యెంతో పనిచేయగలిగి వుండేవాడు. మరెందరో కథానాయకుల్ని సృష్టించి వుండేవాడు.

కాని 1936 జూన్ నెలలో యితడు హఠాత్తుగా జబ్బుపడ్డాడు. ఆ జబ్బు మొదటినుంచీ గడ్డుగానే వుంది. ఊపిరి బరువుగా వస్తూంది; నాడి కృచ్ఛ్రంగా వుంటూంది. అయినా వీటి నాతడేమీ పాటించలేదు. దేశీయ విషయాలలో సారస్వతగోష్ఠిలో నిమగ్నుడైన గోర్కీ వీటిని గమనించనేలేదు. ఎంతో కష్టంమీద మాట్లాడగలుగుతున్నాడు. ప్రాణవాయువు నెక్కించాల్సి వచ్చింది. ఆ స్థితిలోకూడా నూతన రాజ్యాంగ విధానాన్ని గూర్చి చర్చిస్తూ, అది ప్రకటించబడిన పేపరును చూపమని అడిగేడు. లెనిన్‌తో ప్రథమ పరిచయాన్ని జ్ఞాపకం తెచ్చుకునీ, స్టాలిన్ను గూర్చీ యెంతో ఉద్రేకంగా మాట్లాడేవాడు.

ఒళ్ళు తెలియని స్థితిలోకూడ, సంధించి నప్పుడుకూడా తననిగూర్చి గాని, శరీరబాధల్ని గూర్చి గాని ఒక్కమాట గూడ అనేవాడేకాదు. తన కవసానదశ సమీపించిందని అత నెరిగే వున్నాడు.

1936 జూన్ 18 తేదీని అతడికి స్పృహ తప్పిపోయింది. హీన స్వరంతో చాల కష్టంమీద మాటలు వస్తున్నాయి.—

"యుద్ధం వస్తూంది.........మనం తయారుగా వుండాలి...అజాగ్రతగా వుంటే ప్రమాదం........"

దీన్నిబట్టి అతడికి మనస్సంతా మాతృభూమిపై, తాను పోరాడి నిలబెట్టిన సోవియటు విధానం పైనే వుందని తెలుసుకో గలము.

జూన్ 19 తేదీ ఉదయాన్నే గోర్కీ చనిపోయేడు.

తర్వాత బైటపడిన విషయాలవల్ల గోర్కీని శత్రువులు విషం పెట్టి చంపేరని తెలిసింది. సోవియటు ప్రభుత్వాన్ని కూలద్రోయడానికై

ట్రాట్స్కీ, బుఖారిన్ మొదలైన ద్రోహుల అనుచరులే యితనికి విషం పెట్టించేరు. సోవియటు ప్రజలపై అత్యంత పలుకుబడిగల నాయకుల్ని చంపాలని వారి యత్నం. అందులో గోర్కీ ఒకడు. ఈ ద్రోహులకు ఫాసిస్టు రహస్య పోలీసు సాయం యిస్తూ వచ్చింది.

గోర్కీ మృతివార్త కార్చిచ్చులా సోవియటు భూమిలో వ్యాపించింది. ప్రజలంతా కన్నీరు విడిచి గోర్కీకి జలాంజలులు విడిచేరు.

"గోర్కీని విడిచిపోవడంలో మనం, ఆతని మిత్రులం, పాఠకులం, దీనులమైనాము. మన చరిత్రలో ఒక పుట, స్వర్ణాక్షర లిఖితమైనది శాశ్వతంగా త్రిప్పివేయబడింది. లెనిన్ మృతి తర్వాత గోర్కీదే మనకూ, ప్రపంచముకూ అత్యంత విచారకరమైనది."

మాస్కోలోని రెడ్ స్క్వేరులోని బ్రహ్మాండమైన సానుభూతి సభలో మోలటోవ్ అన్నమాట లివి।

# గోర్కీ: రచయిత - విప్లవకారుడు

పేద ప్రజలనుంచి బైలుదేరిన కవులగతి యెక్కడా అంత చెప్పుకో దగిందికాదు. రష్యాలో ఆసలే అంతంత! తన ఆత్మను ధనికప్రభువుల కమ్ముకోదలచిన ఆత్మద్రోహి ఐతే జీవించడానికి పట్టెడు కూటికి ఫర్వా లేదు. గోర్కీ విషయంలో కూడ యిదే జరిగింది ఈ విషయాన్నే గోర్కీ తన వివిధ వ్యాసాల్లో స్పష్టపరిచేడు.

సెమినరీలో (చెర్చిలోని ప్రాధమిక పాఠశాల) చదువుకొనే రోజుల్లో నాలుగువందల సార్లు బెత్తపు దెబ్బలు తిన్నాడు. పొమ్యలోవ్‌స్కీ: లెవిటోవ్, తన క్లాసు ముందరే చావకొట్టబడ్డాడు.—"నాశరీరం లోంచి ఆత్మని దుళ్ళకొట్టేశారు" అన్నాడు. రెషెట్నికోవ్‌ని పద్నాలుగేళ్ళ వయసులో కోర్టుకీడ్చి, రెండేళ్ళు ఖైదుశిక్ష విధించేరు. 'సెమినరిస్టు వ్యాసాలు' 'వర్తకుని సౌఖ్యం' 'పొడ్లిపోల్‌ట్సీ' మొదలైన అద్భుతరచనలతో రష్యన్ సాహిత్యానికి వన్నెబెట్టిన యీ సాహిత్యకారులు బీదరికం, అనామకత్వం అంటే ఏమిటో బాగా యెరుగుదురు. వీళ్ళందరూ పడుచుతనంలోనే యే మట్టిగుడిసెలోనో, యే అనాధశరణాలయంలోనో చని పోయేరు. వాళ్ళ స్మారకంగా మిగిలినవి వ్రాత ప్రతులు మాత్రమే. అవి చదివిన వాళ్ళకి నిరాశ, నిస్పృహలతో నిండిన ఆత్మహత్యా ప్రయత్నాన్ని సమర్ధించుకొనే వాదమా? అనిపిస్తుంది.

గోర్కీ జీవితం అంతకంటె కష్టములలో గడిచింది. తన పూర్వు లందరి కష్టాలూ, బాధలూ గుదిగుచ్చి గుత్తకి తీసుకున్నాడు గోర్కీ. పొమ్యలోవ్‌స్కీవలె కొరడాలతో బాధ పడ్డాడు; లెవిటోవ్‌లాగ బహిరంగంగా చావుదెబ్బలు తిన్నాడు. కుస్‌చేవ్‌స్కీ నీవామీదలాగా గోర్కీ వోల్గామీద పడవల రేవుల్లో కూలీగా పనిచేసేడు. గోర్కీ మొదటిసారి

ఫైదుకి వెళ్ళినపుడు అతడు పెద్దవాడే గాని సెమ్యోనోవ్ బేకరీలో పని చేసేటపుడు అతనికి పదహారు సంవత్సరాలే వయసు. ఏ జైలుకంటేనూ ఆ బేకరీ అధ్వాన్నంగా వుండేది.

నాలుగో యేట కలరా, ఎనిమిదో యేట మశూచికం వ్వద్దాడు. జోళ్ళ షాపులో పని చేస్తూన్నపుడు వేడి పులుసు పోసుకుని ఒళ్ళు కాల్చుకున్నాడు. ఇంటిదగ్గరా, యజమానులవల్లాకూడా యెప్పుడూ దెబ్బలే. ఒకసారి దెబ్బలు తిని పడిపోతే హాస్పిటలుకు తీసికెళ్ళేరు ; డాక్టరు ఆ బాలుని శరీరంలో విరిగిన నలభై రెండు పేళ్ళు తీసేడు. దేవదారు బరికెలతో చితుకకొట్టిన ఫలితమిది. అడవుల్లో తిరిగే టపుడొక వేటకాడు యితనిలోకి ఒక బారుగుళ్ళు వొదిలేసేడు। యుక్రేనియన్ గ్రామం ఖాండిబోవ్కాలో గుంపులు యితణ్ణి ప్రాణావశిష్టునిగా చేసేయి, వోల్గామీది క్రాస్నోవిదోవోలోని ధనికరైతులు కొంప తగులబెట్టినపుడు ప్రాణాలు కాపాడుకోడమే దుర్ఘటం అయిపోయింది. మర్గోసారి పడవలో పనిచేస్తూ, లోపలకి పడిపోయినపుడు ప్రమాదకరంగా దెబ్బలు తగిలేయి.

ప్రమాదకరమైన రోగాలు, రాక్షస తుల్యులైన ప్రజలు, దురదృష్టం, యిదే గోర్కీ చిరుతప్రాయపు జీవితంలో రుచి చూచింది.

జీవితం అతన్ని చిన్నతనంలోనే యెడాపెడా కొడుతూ వచ్చింది. చుట్టూవున్న స్త్రీ పురుషుల జీవితాలు యెంత దారుణంగా వున్నాయో అతనికి చిన్నతనంలోనే తెలిసింది.

బాల్యంలో స్నేహితులతో కలిసి ఊరిబైట ఒక రంపపుగోతిలో ఒక దుంగమీద కూర్చునేవాళ్లు. అలెగ్జీ చెపుతూంటే మిగిలిన బాలురు కలిసి పాడేవారు. అతడెప్పుడూ శోకగీతాల్నే యెంచి పాడేవాడు. గోతి చుట్టూ జనంచేరి వింటూ నిలబడేవాళ్ళు. ఈ శోకగీతాలే ప్రజలను ఆకర్షించేవి।

అత్యంత కష్టభూయిష్టమూ, బాధాకరమూ ఐన జీవితాన్ని గడిపి, చివరకి సాహిత్యరంగంలో దిగినపుడు గోర్కీ, నికృష్టజీవితాన్ని గడుపుతూన్న యీ పేదప్రజల స్థితిగతులు అద్దంలో కట్టినట్లు రచించడమేగాక ఉత్తమజీవికకై ప్రయత్నించమని వారిని యెలుగెత్తి ఉత్తేజపరచేడు.

అతనిలో రేకెత్తిన యీ ఆశాకిరణాలు ఎక్కడివి?

తండ్రినుంచి సంక్రమించిన వవి. మాగ్జిమ్ సవ్వాటియేవిచ్ జీవితంలో అన్ని కష్టాలనూ అనుభవిస్తూ, పల్లెత్తుమాట అనక, చిరునవ్వుతో, ఓరిమితో, 'జీవితం అంటే యింతే మరి!' అన్నట్లుగానే గడిపేడు. ఈ సహిష్ణుతను, ఆశను, అతని అమ్మమ్మ అకులీనా ఇవానోవ్నా ప్రోది చేసింది. తర్వాత నొవోగ్రాడ్‌లోని సత్రాల్లో, చావడులలో నివసించేటపుడు గ్రంధపఠన ద్వారా యీ జీవితసత్యాల్ని, గోర్కీ సంచయం చేసుకున్నాడు.

కష్టపరంపరల్లో, యీ నమ్మకం యెంతకాలం నిలుస్తుంది?

గోర్కీ సృష్టించిన వాళ్ళలో ఒక కధానాయిక, ముసలి ఐజర్గిల్ యిట్లా అంటుంది.

"ఒక మనిషి యేదైనా ఘనకార్యం చేయబూనినపుడు, అతడెల్లాగైనా జయించుకుని పైకి వచ్చి తీర్తాడు. తన సామర్ధ్యాన్ని అవకాశం వున్నపుడల్లా వెల్లడి చేస్తాడు. నీకు మాత్రం తెలియదా యేమిటి? మానవజీవితంలో వీరకృత్యాలు చేయడాని కెప్పుడూ అవకాశం వుంటుంది."

జీవించడమే ఒక వీరకృత్యమై పోయింది, గోర్కీకి. 'ఆ కష్టాలన్నిటినీ ఒక సారి అనుభవించి చూడాలి' అనుకున్నట్లుగా అతడు వాటిని నెత్తిన వేసుకుంటున్నాడా అనిపిస్తుంది, అతని జీవితం చూస్తే.

అనంతమైన తన పరిభ్రమణమార్గంలో కనిపించిన మానవులందరూ గోర్కీ నిశిత పరీక్షాదృష్టికి లోబడేవాళ్ళు. ముందుముందు వీళ్లు తన రచనల్లో పాత్రలుగా వస్తారని తెలిసి, బుద్ధిపూర్వకంగా వాళ్ళని పరిశీలిస్తున్నాడా అనిపిస్తుంది. దృష్టికి కనిపించినపుడు చూడడమే గాక వాళ్ళని వెతికి పట్టుకుని, వెంటాడి వేటగానిలా కూపీ లాగేవాడు.

ఒకసారి తన పరిభ్రమణల్లో గోర్కీ ఒక చిన్న పట్టణానికి వచ్చేడు. అదొక దిక్కుమాలిన ఊరు. కళాకాంతులు లేవు. అక్కడి పాడు హోటలుకి వెళ్ళి, యేదో తింటూంటే, చీనావాళ్ళ చొక్కా తొడుక్కుని ఓ ఆసామీ కనిపించేడు గోర్కీకి కుతూహలం కలిగింది. అంతామరిచి, అతణ్ణి అనుసరించ నారంభించేడు. వీధి తర్వాత వీధి హోటళ్లు, చెర్చికి,- యిట్లా అతన్ని వెంబడించి, అతడొక బొజ్జబలిసిన సోంబేరి అని తెలుసుకునీదాకా వదలలేదు. ఆ వూరులాగే అతడూ పీడకలలాంటి వాడని తెలిసిగాని తృప్తి జెందలేడు.

ఇట్టి ఆశాభంగాలు కూడ అతనికి యెంతో అనుభవాన్ని యిచ్చేవి. ప్రతి సంఘటననూ, దాని పాఠాన్నీ భద్రంగా మనసులో వుంచుకునే వాడు. వెనుకటి కవులు తమ కథానాయకులుగా, చివరకి పాత్రలుగా కూడ తీసికోడానికి స్వప్నేపీ యిష్టపడని వాళ్ళనీ, పండితులకు పనికి రాని పాత్రల్నీ, నదులూ, పాటలూ, బాటలూ,—వీటన్నిటినీ సాహిత్యం లోకి సాక్షాత్కరింపజేసి. సజీవములుగా లోకానికి ప్రదర్శించి, మానవ జీవిత మెంత బలవత్తరమైనదో చూపేడు.

రష్యా అంటే గోర్కీ అభిప్రాయం తెలుసుకోడానికి అత దొక పాత్రచేత అనిపించిన మాటలు చూస్తే తెలుస్తుంది :

"తమ్ముడూ! రష్యా మాట వచ్చింది గనక చెప్పాల్సి వచ్చింది.

రష్యావిషయంలో దేనినీ యాదాలాపంగా తోసిపుచ్చలేవు. ప్రతి ప్రాంతానికీ స్థలపురాణం వుండేతీరింది; ప్రతి మనిషిలోనూ ఆత్మకూడా అంతే."

. మోల్డావియా లోని చిట్టడవులు, కెర్‌ఘెంట్స్‌లోని అడవులు, యుక్రేన్‌లోని రాజబాటలు, కూబాఞ గ్రామాలు,—యివన్నీ గోర్కీ కళ్ళకి కట్టినట్లే వర్ణిస్తాడు. భుజాన వలాసం, చేత కఱ్ఱ గొని, పాదచారియై మెట్టినవేగదా ఆ ప్రదేశాలన్నీ.

అతనికి కీర్తైతే తొందరగానే వచ్చిందిగాని, కళాకుశలత లభించడానికి మార్గం మాత్రం సుదీర్ఘమూ, కంటకావృతమూ అయే వుంది.

గోర్కీ పదోయేటనుంచే దినచర్య వ్రాసేవాడు. ఇదే అతని ప్రథమ రచన. కానైతే దీనికి పాఠకుడు మాత్రం ఒకడే ఒకడు!

తర్వాత కాజాన్‌లో వుండగా, పదిహేనో యేటనే పద్యాలు వ్రాయనారంభించేడు. అతడల్లిన పద్యాలు పేలవంగా వుండేవి. గద్యరచనకు పూనుకొన్న తర్వాతకూడా అతడు యమకం, సుదీర్ఘ సమాసాలు చూసుకుని రచించేవాడు, మొదట్లో. అతనే చెప్పినట్లు 'అందంగా రాయడానికి ప్రయత్నించేవాణ్ణి. మొత్తం మీద చూస్తే'.

"సముద్రం నవ్వింది" అని రాసి, బాగానే వుందనుకున్నాడు. చాల రోజులదాకా, చక్కని మాటల పొందికకోసం అర్థాన్ని ఉపేక్షచేయడం, వస్తువుల్ని స్థానభ్రంశం పొందించడం, మానవుల్ని అపమార్గంలో చెప్పడం చేసేవాడు.

టాల్‌స్టాయ్, చెకోవ్,—వీరిద్దర్నీ గోర్కీ యెంతో గౌరవించేవాడు. వారి అభిప్రాయాలకెంతో విలువ నిచ్చేవాడు. వారిద్దరూ యువగోర్కీకి సలహాలిచ్చి, సరియైన దారిలోకి మరల్చేవారు.

గోర్కీ రాసిన 'ఇరవై ఆరుగురు మనుష్యులు' చదివి, టాల్‌స్టాయ్ అన్నాడట: "నీపొయ్యి వుండాల్సినచోట లేదయ్యా!" పరిశీలిస్తే

గోర్కీ వర్ణించిన రీతిగా వుంటే పొయ్యి మంటలు ఆ మానవులున్న స్థలానికి వెలుగు నియ్యవు।

చెకోవ్ ఒకపర్యాయం,—"తాతా। ఆమెకి మూడు చెవులు పెట్టే వోయ్। గడ్డం క్రింద ఒక చెవి, చూడు।" ఒక కథానాయికను గూర్చి, అన్నాడు. ఇవన్నీ వివరాలేఅనుకోండి. అయినా అప్పటికి గోర్కీలో ధారాళంగా రచన సాగించే నేర్పుగాని, కదళీపాకంగా చెప్పడంగాని లేదు. మాటల్ని యెంచి, తూచివేసే అలవాటూ లేదు. కళాకారునికి సత్యం, యాదార్థ్యం, సరళత,— యివి యెంత అవసరవస్తువులో అతడు ఆ తరువాతనే గ్రహించి, ఆచరణలో పెట్టేడు.

గోర్కీ మొదటి రచనల్లో 'మాల్వా' అనేది చదివి, చెకోవ్ యిట్లా అన్నాడట:

"చదివి చూడు। 'సముద్రం నవ్వింది.' అంతే ఆగేవు. అందంగా, చక్కగా వుంది గనకనా ఆగింది? అబ్బే, కాదు. ఆ తరువాతి భావం స్ఫురణకి రాకనే నిలిచి పోయేవు। హఠాత్తుగా సముద్రం 'నవ్వడం' ఎట్లాగ సాధ్యమో చెప్పు? అసలు సముద్రం నవ్వదు, ఏడవదు. సముద్రం హోరు పెడుతుంది, మెరుస్తుంది, తాకుతుంది:—టాల్‌స్టాయిని చూడు, ఎట్లా రాస్తాడో: సూర్యుడు ఉదయిస్తాడు, పక్షులు పాడుతాయి.........ఎవరూ నవ్వరు. ఏడవరు. సరళత - స్పష్టత యిదే అత్యంతం ముఖ్యమైన అలంకారం। తెలిసిందా?"

సరళంగా, స్పష్టంగా రాయడం.—అనే యీ కళను గోర్కీ చిరకాల కృషి, నిరంతర ఆచరణల ద్వారానే సాధించగలిగేడు. ఇతర రచయితల నుంచీ, ప్రజాసామాన్యం నుంచీ యెంతో నేర్చుకున్నాడు. అసలు భాషకే సృష్టికారులు ప్రజలు. ప్రజాసంఘంలో భావప్రకటనా సౌలభ్యానికై భాష అనే సాధనాన్ని తీర్చిదిద్దుకుంటూ ప్రజలే నిర్మించుకుంటూ వస్తున్నారు. పురాతన కవుల గ్రంథాలనూ, ఆధునిక మహాకవుల గ్రంథా

లనూ యెన్నోసార్లు తిరిగి తిరిగి చదివేవాడు. ఊకదంపుడుగా గాక వర్ణన, భావప్రకటన, భాషా సౌలభ్యం, రచనా సౌందర్యం, వీటిని ఆకళింపు చేసుకుంటూ బహుజాగ్రతగా చదివేవాడు.

టాల్‌స్టాయ్, చెకోవ్, లెస్కోవ్ మొదలైన ఆధునిక వాఙ్మయ నిర్మాతల గ్రంధాలన్నీ చదివేడు; విదేశీయులైన ఫ్లాబర్టు, డికెన్సు మొదలైనవారి గ్రంధానువాదాలన్నీ పఠించేడు. గ్రంథపఠనతోబాటుగా ప్రజా సామాన్యం యేరీతిగా తమ భావప్రకటన నెట్టి భాషతో చేస్తూందో పరిశీలనాదృష్టితో వినేవాడు. వర్తకులు, కూలీలు, సైనికులు, పడవలాగే వాళ్ళు, నటకులు, వంటచేసేవాళ్ళు, మేళగాండ్రు, నావికులు, బికారీలు, విద్యార్థులు,—రకరకాల ప్రజల్లో నివసిస్తూ, వాళ్ళ జీవితములు దగ్గర నుంచే చూస్తూ, వాళ్ళ స్వభావాల్నీ, భాషా ప్రవర్తనల్నీ అవగతం చేసుకున్నాడు.

నిరంతర సాధనచేసి గోర్కీ కళను సాధించగలిగేడు. సత్యం, సరళత, సౌందర్యం,—యివన్నీ విడదీయరానివై, పరస్పరం క్షీరనీర న్యాయంగా కలిసిపోతాయి. నిజమైన కళలో, సరళత - సత్యం,—యిదే సౌందర్యంగా అయి పోతుంది.

వాగర్థముల్ని సంప్రుక్త మొనర్చడంలో గోర్కీ నేర్పు అనన్యమైనది. అతని వర్ణనలు వస్తువుకెంతో సామీప్యంలో వుంది. వర్ణిత వస్తువును పాఠకుని కళ్ళముందు యధాతధంగా తెచ్చి నిలుపుతాయి.

అతని వర్ణన యెంత సహజమో చూడండి :

"మేమాతోటలో చెర్రీ చెట్లనీడని కూర్చున్నాము. ఆ మధుపుష్పి లతలు చెట్లమీద అల్లుకుని, కొమ్మలనిండా పూసల తోరణాల్లాగ తన యెఱ్ఱనిపండ్లతో అలంకరించి వున్నయ్. సాయంకాలం అయింది. చాలా ఉక్కగా వుంది. ఉక్క చూస్తే గాలివాన వచ్చేటట్లే తోస్తూంది. సముద్రఫేనంలాంటి మేఘశకలాలు తక్రధవళమైన ఆకాశంలో నురు

గులు కడుతూ పరిభ్రమిస్తున్నాయి. నీలి నీడలు తోటలో నడుస్తూన్నాయి. చెట్ల ఆకులు మేకచెవుల్లాగ నిష్కంపంగా వుండడం చూస్తే ఆశ్చర్యం వేస్తుంది."

కవియొక్క విశిత పరిశీలనా దృష్టితో (రవి గాంచనిచో కవి గాంచునే గదా) గోర్కీ తన పరిసరాల్లోని ప్రతి వస్తువునీ, సంఘటననీ సవివరంగా గుర్తుంచుకుని, మనోకోణంలో బహా భద్రంగా దాచుకునే వాడు.

గోర్కీ బాల్యంలోకూడ తన జ్ఞాపకశక్తితో అందర్నీ ఆశ్చర్యంలో ముంచేవాడు. అతని తాత 'అలెగ్జీ యేనుగవంటి జ్ఞాపకశక్తి గలవాడు' అనేవాడు. ఒకతూరి యెవ్రినోవ్ అనే హైస్కూలు పిల్లవాని దగ్గర పుస్తకంలో ఆస్ట్రేలియా పటాన్ని చూసి, ఒక్కసారి అడిగి పుచ్చుకుని పరిశీలించేడు. అంతే. ఆ పటంలోని ద్వీపాలు, నదులు, పట్టణాలు,— అన్నీ అతనికి కంఠస్థం ఐపోయేయి.

గోర్కీ బాల్యంలో చూసిన దేశములు, మానవులూ, పట్టణాలు, రోడ్డులూ, నదులూ, పర్వతాలూ, సముద్రాలూ, అరణ్యాలూ,—అన్నీ తన తర్వాతి జీవితంలో చక్కగా సజీవంగా చిత్రించేడు. రష్యా అంతా కకేషస్ మొదలు బాల్టిక్‌వరకు, మోల్డావియా మొదలు పసిఫిక్‌వరకూ దేశమంతా గోర్కీ రచనల్లో ఉజ్జీవితం అయింది.

చరాచర ప్రపంచమేగాక గోర్కీ కావ్యాల్లో మానవు లనుభవిస్తూన్న కఠోరమైన అన్యాయం, దారుణమైన వేదనా,—యివి కూడా ఉజ్జీవాన్ని పొందినాయి.

"నికృష్టజీవితం" అనే నాటకాన్ని స్టేజి చేసేటందుకు ఆర్టు థియేటరు కృషిచేస్తూ, డైరక్టరు గోర్కీ సాయం అడిగేడు. డాస్ హౌస్‌లో ఒక సీను వుంటుంది. డాస్ హౌస్‌ను తెరమీద చిత్రించడానికి ఒక ఫొటో

యేనా కావాలని డైరక్టరు గోర్కీని అడిగేడు. "ఫొటో తీయడానికి వీలే లేదు. అసలు సూర్యరశ్మి ఆయిళ్లలోకి జొరబడితేకాదూ? ఏ ఫ్లాష్ లైటో వేసి చూడాలి" అన్నాడు గోర్కీ. సూర్యరశ్మి జొరబారని యీ పాడుకొంపల్లో నికృష్టజీవితాన్ని గడుపుతూన్న లక్షల మానవుల జీవితాన్ని మొదటి సారిగా ప్రపంచదృష్టిలోనికి తీసికొని వచ్చిన గోర్కీ సంఘాన్ని ఒక్కసారి కదిల్చేశాడు.

బికారులుగా. తాగుబోతులుగా వున్న వాళ్ళ జీవితాలు నికృష్టమైనవే గావచ్చు. కాని, అంతకంటెనూ నికృష్టతరమైనవి ధనికుల, వర్తకుల జీవితాలని గోర్కీ చాటి చెప్పేడు.

అన్యాయం అనుభవించేవారి జీవితాలకన్న దానిని చేసేవాళ్ళ జీవితం మరింత భయంకరమైనదీ, నీచమైనదీ గాక తప్పదు.

బీదలు నివసించే పేటలూ, యిళ్ళూ కూడ పందుల గుడిసెలకంటె కనికిష్టంగానే వుండేవి. పోతే వాళ్ళజీవితం కూడా పందుల జీవితం కంటె మరేమీ మెరుగుకాదు. గోర్కీ కథలు, నవలలు, నాటకాలు అన్నిటిలోనూ కూడా 'పందుల్లా జీవిస్తూన్న' యీ మానవులే పాత్రలు. వాళ్ళ జీవితంలోని వెలుగు చీకట్లను అతడు అద్భుతంగా చిత్రించేడు. నికృష్టులైన వీరిలోనే మానవత్వం యెక్కడుందో కళ్ళకి గట్టినట్టు చూపుతాయి, ఆయన రచనలు.

గోర్కీ కేవలం రష్యన్ ప్రజాజీవితంలోని చీకటి కోణాల్నేగాక ఉదాత్త ఘట్టాల్నికూడా వర్ణించేడు.

బాల్యంలో నుంచీ కూడా 'సాహిత్యం యెందుకు?' అనే విషయంలో గోర్కీకి నిశ్చితాభిప్రాయా లుండేవి. పదహారోయేట కాజాన్ నగరంలో వుంటూ, ఒకసారి షేక్స్పియర్ మీద ఉపన్యాసం జరుగుతూంటే వెళ్లేడు. ఉపన్యాసకుడు చక్కని గొంతుతో, గంభీరంగా మాట్లాడు

తూన్నాడు. "ఆత్మను తృప్తిపరచు టొక్కటే సాహిత్య ప్రయోజనం" అన్నాడా, పండితుడు.

బేకర్‌గావున్న పెష్కోవ్ మాత్రం ఆ ప్రొఫెసర్ చెప్పినది అంగీ రించనేలేదు. తన డైరీలో యీ వాక్యాన్ని రాసి, దానిక్రిందే "ఇది పచ్చి అబద్ధం"అని వ్యాఖ్యానించేడు. ఆత్మని తృప్తిపరచడంకంటె అత్యున్నత మైన ఆదర్శం యింకోటి సాహిత్యానికి వుందనీ, అదే ఆత్మను మేలు కొలిపి, ఉజ్జీవింప జెయ్యడమనీ ఆతడు చెపుతూండీవాడు.

తర్వాత అతడు రచయిత ఐనాక తన పాత్రల్లో ఒకనిచేత యిట్లా అనిపిస్తాడు : "మనుష్యుల బుర్రల్లో కుమ్మరి పురుగుల్ని పెట్టి ఒది లెయ్యాలిరా; లేదా తృప్తిపడి, మాట్లాడకవూరుకుని అనదలై కూర్చుండి పోతారు."

పాఠకుల మెదడుల్లోకి గోర్కీ మాటలు కుమ్మరిపురుగుల్లాగే దొలుచు కుంటూ పోయేవి. అతని వాక్యాలు మనస్సును కుట్టేవి, ఉత్తేజపర్చేవి, కరిగించేవి.

# గోర్కీ - ఛెలియాపిన్

విప్లవ పూర్వపు రోజుల్లో (1895) గోర్కీ సాహిత్యరంగంలోకి ప్రవేశించిన కొత్తరోజుల్లో నొవోగ్రాడ్‌లో అతని యింటికి తరుచుగా ఒక విచిత్రవేషి వస్తుండేవాడు. ఇంగ్లీషు ఫాషన్‌లో కుట్టిన పొడుగాటి పైకోటూ, మెరిసిపోయే యెర్రటి కుళ్లాయీ,—యివి ఆవీధి కుర్రమూక నంతనూ ఆకర్షించేవి. అతడు వస్తున్నాడనగానే చుట్టుపట్ల జనం అంతా మూగుతారని తెలుస్తుంది, ఎందుకంటే సుప్రసిద్ధుడైన సంగీత వేత్త ఛెలియాపిన్ త్వరలోనే పాడుతాడని వాళ్ళకి తెలుసు. అందరి కంటె పోలీసువాళ్ళకి యిది కాలక్షేపంగా వుండేది.

గోర్కీ కాజాన్‌లోనే ఛెలియాపిన్‌తో స్నేహం సంపాదించేడు. బేకర్ పెష్కోవ్, కాబ్లర్ ఛెలియాపిన్,—యీ యిద్దరికీ మాంచి స్నేహం కుదిరింది. ఈ యిద్దరూ ఒక సారి అక్కడి నాటకశాలలో గాయకుల మేళంలో పనికోసం దరఖాస్తు చేసేరు. గోర్కీని తీసికొన్నారుగాని, ఛెలియాపిన్‌ను నిరాకరించేరు!

ఈ యిద్దరు కూలీలకీ ప్రపంచఖ్యాతి లభించింది. కాని, యిద్దరి మార్గాలూ వేరైనాయి. 1902 లో ఛెలియాపిన్‌ను గౌరవించడానికై సభ జరిగింది. అందులో గోర్కీని మాట్లాడమన్నారు. స్నేహితునికి అతడు పొగడ్తలు కాదు యిచ్చింది. సరియైన దాని చూచుకొమ్మని హితోపదేశం చేసేడు:

"నీవొక గొప్ప మేధావివి. రాలు కరిగించే నీ గాంధర్వం యిప్పుడు ధనికవర్తకుల భార్యల అలంకృత నాట్యగృహాల్లో, మురికిగుంటల్లో అమృతపు సోనల్లాగ వృధా అయిపోతూంది. దీనులు, దురదృష్ట వంతులు, నలిగిపోతూన్న వాళ్ళూ,—వీళ్ళని నీపాటలతో ఉత్తేజపరచు: వాళ్ళని మేలుకొలుపు. అప్పుడే నువ్వు గొప్పవాడవు అవుతావు నిజంగా."

షెలియాపిన్ యీ సలహాను పాటించనేలేదు. 1908 జూన్‌లో గోర్కీ కాప్రీలో వున్నప్పుడు షెలియాపిన్ కూడ అక్కడికి వచ్చేవాడు. ఒకసారి షెలియాపిన్, ప్రసిద్ధ రచయిత లియోనిద్ ఆంద్రియేవ్, సెరాఫినా విల్లా వరాండాలో కూర్చుని గోర్కీతో మాట్లాడుతూన్నారు. ఇంతలో ఒక యింగ్లీషువాడు ఒగుర్చుకుంటూ అడావిడిగా తోటలోకి వచ్చి, మెల్లెక్కి అక్కడే ఒక పడక కుర్చీలో ఉస్సురుమంటూ పడ్డాడు. అది ఉదయం. ఎండ చక్కగా కాస్తూంది. గోర్కీ భార్య, నట్టువరాలు ఆంద్రియేవ్నా ఆగంతుకుణ్ణి సమీపించి యెందుకు వచ్చేరని అడిగింది. అతడు పర ధ్యాన్నంగానే "హామ్, గ్రుడ్లు, జున్ను, పండ్లు, ఒక బాటిల్ ఛియాంటీ, సోడా వాటరూ" అని ఆర్డరిచ్చేడు.

ఆగంతుకుడు దీని నొక హోటలుగా భావించేడని గోర్కీ గ్రహించేడు, యీ సంభాషణ వినగానే, భార్యని సంజ్ఞచేసి పిలిచి, సేవకులచేత అతనికి కావలసినవన్నీ యిప్పించమని చెప్పేడు. తృప్తిగా అల్పాహారం పుచ్చుకుని, బిల్లు తెమ్మన్నాడు. అసలు విషయం తెలుసుకున్నాక అతడు యెంతో నొచ్చుకున్నాడు. కళ్ళనీళ్ళ పర్యంతం అయింది. ఎంతకాలం నుంచో మిమ్మల్ని చూడాలనుకుంటున్నానని పదేపదే అంటూ, జరిగిన దానికి నొచ్చుకుని, క్షమించమంటాడు.......మర్నాడే పశ్చాత్తాపతప్తుడైన అతిథినుంచి ఒక పెద్ద పూలగుత్తి వచ్చింది ఆంద్రియేవ్నాకి.

షెలియాపిన్ విప్లవం రాగానే విదేశాలకి వెళ్ళిపోయేడు. తా నే కష్టజీవులలో పుట్టేడో వారినే ద్రోహంచేసి, భోగలాలసతో పతితుడై, తన కళను అమ్ముకుని, ధనికుల బానిసగా అమెరికాలో తన జీవితాన్ని గడిపేడు!

గోర్కీ తన కవితను ప్రజలకే అంకితం చేసేడు. ఆ ప్రజలే ప్రపంచ చరిత్రలో అనన్యపూర్వమైన విప్లవాన్ని తెచ్చినపుడు, గోర్కీ తన

యావచ్ఛక్తినీ కూడ ధారపోసి, యీ విప్లవానికి తోడ్పడ్డాడు. మన యుగంలోని మహాపండితుడుగా గోర్కీ తన పాండిత్యాన్నీ, సృజనాత్మక శక్తినీ, అనుపమకళాసృష్టినీ యీ విప్లవం ద్వారా బయలుదేరిన నవ్యసమాజ నిర్మాణానికే ధారపోసేడు.

1928 లో స్వదేశానికి వచ్చినదాదిగా 1936 జూన్ 19 న చనిపోయే వరకూ గోర్కీ, సోవియటు యూనియన్ యొక్క సాంస్కృతిక జీవితానికి కర్ణధారిగా, కళాచార్యుడుగా పనిచేసేడు. మానవజాతి విముక్తికై నవ్యసమాజ స్థాపనకై తమ అమూల్య జీవితాన్ని అర్పించిన ధీరాధిధీరులైన మానవోత్తములతో సమాన ఉజ్జీగా నిలబడి మార్గదర్శకుడుగా, మేధావి వర్గానికి నూతన వెలుగుచూపిన పండితుడు, కవి, సంస్కారి, కళావేత్త, గోర్కీ మహాశయుడు.

## గోర్కీ - బిడ్డలు

ఈ లోకంలో మహాత్ములందరూ భవిష్యత్తును నిర్మించే దృష్టిలో నిమగ్నులై వుండడం వల్లనే, వారందరూ చిన్నబిడ్డలంటే యెంతో ప్రేమచూపుతారు. పసిపిల్లలపై ప్రేమ, ఆదరాభిమానాలు,-యివి గోర్కీ జీవితమంతలోనూ యెడతెగని సూత్రంగా ప్రదర్శిత మవుతాయి.

తాను చిఱుతప్రాయంలో పడిన బాధలు, అనుభవించిన కష్టాలు, అవి గోర్కీ యెన్నడూ మరువనేలేదు. తనవలెనే యెన్నోకోట్ల బాలబాలికల జీవితాలు అరణ్యకుసుమాలుగా రాలి నలిగిపోతున్నాయని అతడు నిరంతరం చింతిస్తూండేవాడు. ఏ కొద్ది మందికైనా చేయగల తాత్కాలిక సాయం చేయడంలో ఎప్పుడూ అతడు ముందడుగు వేస్తూనే, యీ సమస్యను పరిపూర్ణంగా పరిష్కరించి, పిన్నవయస్కుల జీవితాలకి శ్రీరామరక్షగా వుండగల సోవియటు విధానానికై, విప్లవానికై తన జీవితాన్ని ధారపోసేడు.

గోర్కీ బిడ్డలకోసం ప్రత్యేక రచనలు సాగించేడు. వాళ్ళ చదువు కోడానికై 'లేఖలు' రాసేడు. వాటి తాత్పర్యమును చెప్పడం కష్టం. ఆ లేఖల్లో రెంటి నిచ్చట ఉదహరిస్తాను :

ఒకటి విప్లవానికి పూర్వమే, కాప్రీనుంచి, బాకూలోని ఒక కిండర్ గార్డెన్‌లోని బిడ్డలకై వ్రాయబడింది.

"నేను మీజాబు చదివి యెంతోసేపు హృదయపూర్వకంగా నవ్వు కున్నాను. ఈతణ్ణింత ఆహ్లాదపరచిన సంగతేమై వుంటుందా? అని కాటోలు సముద్రంలోని చేపలన్నీ తలలు పైకెట్టి, నావైపు ఆశ్చర్యంగా చూసేయి! వాటికి తెలిపేలా, మీసంగతి వాటికి చెప్పేనులెండి. ఎక్కడో మరో సముద్రతీరంలో చక్కని మనుష్యులు నివసిస్తూన్నా రనీ, వాళ్ళింకా యిప్పుడు చాల చిన్నవాళ్ళేననీ, అయినా వాళ్ళు పెరిగి పెద్దవాళ్ళయే సరికి అద్భుత వ్యక్తులుగా తయారై తీరుతారనీ,— అందు కోసమే నాకు అంత సంతోషంగా వుందనీ వాటికి చెప్పేను!

"తలాతోకా తెలిసికోలేనంత పాడు దస్తూరీ నాదని మీరనకుండా, బాధ పడకండా వుండాలనే, యీజాబును టైపురైటరు మీద రాయించేను.

"మీ దస్తూరీ యింతకీ యెల్లా వుంటూంది! కొంచెంఆగండి చెపుతా. త్వరలోనే ఈ అక్షరా లన్నిటినీ క్రిందా మీదా పెట్టేసి. మార్చి పారేస్తాం, చూస్తూండండి. ఇప్పటి మాట కాదుగాని, ఓయిరవై యేళ్ళయినా పోయే కనే లెండి. అప్పుడు మీకు యివిచూపిస్తాను, ఒకప్పుడు యెట్లాంటి చిత్ర మైన మాటల్ని రాసే వాళ్ళమో! అని మీరు ఆశ్చర్యపడి తీర్తారు. నవ్వు కూడావస్తుంది!

"అయితే మాటవరస కడుగుతా చెప్పండేం? గుల్లం, మేలుకు. పది ఒకటి. సురోచనం, అంటే యేమిటో చెపుదురూ? రష్యన్ భాషతో మీరు చేసే టంత తమాషా చివరకి నేనుకూడా చెయ్యలేనని ఒప్పు కుంటా?"

"నాకు వచ్చినచిక్కు, యాట్. అక్షరందగ్గరే వచ్చింది. ఎవరితో టీ చెప్పకండేం, నాకు అక్షరాలు అన్ని కూడారావని. ఈ అక్షరం నన్ను నానా చిక్కులూ పెడు తూందంటే నమ్మండి. ఎప్పుడు దీన్ని రాయాల్సి వచ్చినా నలభై యేళ్ల వాణ్ణి నాలుగేళ్ల వాడిలా ఐపోతాను!

"చివరకి ప్యాత్. (అయిదు) పొద్‌న్యాత్ (లేచు) పొన్యాత్ (అర్థం చేసికొను) యివి రాసేటపుడు కూడా, యీ 'యాత్' తో కంగారు పడి పోతున్నాను. 'ప్యాత్' అని రాయడానికి బదులు 'పెత్' (పాడుట) అని రాస్తుంటాను!

"నాకు మిమ్మల్ని చూడాలని యెంతో యిదిగా వుంటుంది. అందరం కలిసి ఆడుకుంటూ, గంతులేయడం యెంతబాగుంటుంది? నేను యెంతో మంచి కథలు చెప్పగలను కూడా మీకు యెంచక్కా. నేను యిప్పుడు పిల్లవాణ్ణేమీ కాదు కాని, యిప్పటికీ వయసు హెచ్చినా శుద్ధ మొద్దుని మాత్రం గాలేదని చెప్పగలను. సామోవర్‌లో బొగ్గులు వేసి, అంటించి, నీళ్లు పోయడం మరచిపోతే యేమవుతుందో, బుద్ధిలేని సోంబేరి చేప యెరని యెట్లా మింగుతుందో,—యిల్లాటివే యింకెన్నో సంగతులు. తమాషాలు మీకు చూపగలను. నాకు పిల్లలతో ఆడుకోవడ మంటే యెంతో యిష్టం. చిన్నప్పటినుంచీ అలవాటు అది. నా పదోయేటనే మా చిన్నతమ్ముణ్ణి ఆడించాల్సి వచ్చేది. వాఁడు తర్వాత చనిపోయేడులే. ఆ పిమ్మట యిద్దరు చిన్నపిల్లల్ని చూడాల్సి వచ్చింది. నాకు యిరవై వచ్చేక వీధిలో పిల్లలందర్నీ పోగుచేసి ఆదివారాల్లో పొద్దుటే వెళ్ళి సాయంకాలం దాకా ఆడుకుని వచ్చేవాణ్ణి అడవుల్లో!

"అదంతా యెంతో బాగుండీది, తెలుసా? అరవైమంది పిల్లలు. అందరూ నాలుగు—పదీ యేళ్ళ మధ్యవయస్సు వాళ్ళే. అడవిలో తెగ గంతులేసి మళ్ళీ యింటికి రావడానికి కూడా ఓపిక లేనంతగా అలిసి పోయీవాళ్ళు!

"కాని, దానికి నేనూ తయారయే వచ్చేవాణ్ణి. తోలు పటకాలతో ఓకుర్చీ తయారుచేసి తెచ్చేవాణ్ణి. నడవలేని వాళ్ళని అందులో కూర్చో బెట్టి, వీపున కట్టుకుని, పొలాలమ్మట బడి, యింటికి వచ్చేవాళ్ళం. ఆ రోజు లెంతబాగుండీవి!"

"అది యెంతో సంతోషంతో గడిచిపోయిన కాలం. ఎప్పుడూ జ్ఞాపకం తెచ్చుకుంటూ వుంటాను. ఆ తర్వాత నేను రచన లారంభిం చేను. ఇదెంతో కష్టమైనపని, తెలుసా? ఐనా, నాకు యిదెంతో యిష్టం."

* * * *

రెండో జాబు; గోర్కీ పేరట సైబీరియాలోని "ఇర్కుట్స్క్" లో నిర్మించిన స్కూలు పిల్లలకి రాసిన దది.

"కామ్రేడ్ బసోవ్ వచ్చి, నాకు మీసంగతులన్నీ చెప్పేడు. తూర్పు సైబీరియాలో యెన్నో చక్కటి స్కూళ్ళు కడుతూన్నారని తెలిసింది. మీరెంతో అభివృద్ధి చెందుతూన్నారని తెలుసుకుని చాలా సంతోషించేను. మీలో యెంతో తెలివితేటలు, ఉపజ్ఞ—నివురు గప్పిన నిప్పులా వుందని తెలుసు నాకు."

"మీరెంతో కష్టపడి, శ్రద్ధగా చదువు కుంటూన్నారని విన్నాను. అల్లాగే చెయ్యాలిమరి, మీరు అభివృద్ధికి రావాలంటే. మనం శాస్త్రవిజ్ఞా నాన్ని యెంతో ప్రేమించాలి. ఎంచేతనంటే మానవునికి శాస్త్రవిజ్ఞానం కంటె వేరే ఆయుధ మేమున్నది? ప్రపంచంలోని కష్టజీవులు తమ అవిద్య, అజ్ఞానం వల్లనూ చెప్పలేనన్ని బాధలు, కష్టాలుపడి, ప్రతి ఫలాన్ని అనుభవించేరు. మీ తండ్రులు గొప్ప త్యాగాన్నిచేసి, స్వర్గ ద్వారాల్ని మీకోసం తెరిచేరు. అత్యున్నతమూ, అత్యుత్తమమూ ఐన శాస్త్రవిజ్ఞాన శిఖరాల్ని మీరు అందుకో గలరు. మీ తండ్రులు ప్రారంభిం చిన కార్యాన్ని, వారి బిడ్డలైన మీరు భక్తి శ్రద్ధలతో కొనసాగించాలి.

ఈ పద్దెనిమిదేళ్ళనుంచీ ధైర్యసాహసాలతో, వీరోచితంగా పనిచేస్తూ, పోరాడుతూ కార్మికవర్గం దేశానికి యజమానులైనపుడు శాస్త్ర సహాయంతో తమరేమి చేయగలరో మన తల్లిదండ్రులైన కష్టజీవులు ప్రపంచానికి ఋజువు చేసేరు.

"మనకి వేలూ, లక్షలూ డాక్టర్లు, టీచర్లు, యింజనీర్లు, పాటకులు, నటకులు, కవులు, రచయితలు, శాస్త్రజ్ఞులు,—యిల్లాగే యెన్నో రకాల నిపుణులు కావాలి. భూమాత గర్భంలో దాగివున్న, ప్రకృతిలో దాగివున్న అమేయసంపదలని పైకి తీయగల వాళ్ళుగా మనం అందరం తయారు కావాలి. ప్రజల స్వాస్థ్యాన్ని చెడగొట్టే పరాన్నభుక్కులుగాని, భూసారాన్ని పీల్చేసే కలుపుమొక్కలుగాని, పరోపజీవులైన బదనికలుగాని, పాడిపంటలకి చెరుపుచేసే క్రిమికీటకాదులు గాని మన దేశంలో వుండనేరాదు. మన దేశాన్నంతన్నీ చక్కగా నందనోద్యానంలాగ తయారు చేయాలి. చిత్తడినేలల్ని ముడుగుపారించీ, యెడారుల్లో నీటి వనరులుచేసీ, కాలువలు తవ్వీ, నదీ గర్భాలు లోతుచేసీ, కోట్లమైళ్ళు రోడ్లు నిర్మించీ, విశాలమైన అడవులు బాగుచేసీ,—భోగభాగ్యాల్ని నిర్మించుకోవాలి. మన దేశంలో, పంటలు తినీ, కరువు వ్యాపింపచేసే మిడతలదండ్లు వుండరాదు; జ్వరాల్ని వ్యాపింపచేసే దోమల్ని బైలు దేరనీయరాదు; వివిధ రోగాల్ని కలిగించే యీగల్ని వుండనీయరాదు; పశ్వాదులకి మహామారిగా వుండే కీటకాల్ని కూడా నాశనం చేయాలి. ఎలుకలు, చుంచులూ,—యివే మనకి యేటా కోటానుకోట్లు రూబుల్సు పంటను నష్టపరుస్తున్నాయి; మోల్సు, మర్మాట్లు, పొలం ఎలుకలు, ఉడతలు, కుందేళ్ళు,—యిల్లాటి జంతువులువల్ల యెంతో నష్టం కలుగుతూంది. చేయాల్సిన దెంతో వుంది. సోషలిస్టు సమాజాన్ని, నిజమైన చిత్త సంస్కారంగల మానవసమాజాన్ని నిర్మించి, అభివృద్ధిచేయడంలో మనస్సుకి సంతృప్తినీ, సంతోషాన్నీ కలిగించే పని యెంతో

చేయగలం. ఇంత కర్తవ్యం మీముందు వుంది. ఇందుకొరకై మీకెంతో శాస్త్రీయవిజ్ఞానం అవసరం."

ఇట్టి సంతోషకరమైన పనికొరకై, భవిష్యత్తును వర్తమానంగా, స్వప్నాల్ని నిజంగా మార్చడానికే యీ మహాకవి జీవించేడు, రచించేడు, పోరాడేడు, మరణించేడు.

# రష్యన్ సాహిత్యవేత్త మాక్సిమ్ గోర్కీ వాక్యాలలో....

"ఆత్మను తృప్తిపరచడమే సాహిత్య ప్రయోజనం అనడం అబద్ధం. ఆత్మను మేలు కొలిపి, ఉజ్జీవింప చేయడమే సాహిత్యం కనీసం చేయ దగింది."

"తృప్తి నల్లమందులాంటిది మనుష్యుల బుర్రల్లో కుమ్మరిపురుగుల్ని పెట్టి, వదలాలి. లేకపోతే తృప్తిపడి, కునికిపాట్లు పడుతూ, శక్తిలేని వాళ్లై మాట్లాడక అన్నిటికీ సహించి అనదలై పూరుకుంటారు."

"ఓగాయకా! నువ్వు అఖండమేధావివి. రాలు కరిగించే నీ గాంధర్వం యిప్పుడు ధనికురాంధ్ర అలంకృతనాట్యగృహాల్లో పడుపువృత్తి చేస్తూంది. మురికి గుంటల్లో అమృతపుసోనలు కురిస్తే ఏం ప్రయోజనం? దీనులు, దురదృష్టవంతులు, నలిగిపోతూన్నవాళ్లూ,—వీళ్ళని నీ పాటలతో ఉత్తేజపరచు. మేలుకొలుపు. అదే నీ కర్తవ్యం. నీ గొప్పదనానికి రాజ బాట కూడా అదే."

"తమ్ముడూ! రష్యా మాట వచ్చింది గనక చెప్పాల్సి వచ్చింది. రష్యా విషయంలో దేనినీ యాదాలాపంగా త్రోసిపుచ్చలేవు. ప్రతి అంగుళం మేరకీ స్థలపురాణమూ, ప్రతి మనిషిలోనూ ఆత్మా వుంది తీరినాయి యిక్కడ."

"విప్లవం అతి సహజమూ, ఉదాత్తమూ ఐన సంఘటన. మాతృ గర్భంలోని శిశువు పైకి వచ్చేందుకు ఆటునిటు కదిలే ప్రయత్నం వంటిదే అది।"

"రష్యన్ విప్లవకారుల్లో యే లోపాలుండనీ, వారితో సమంగా విశ్వ మానవ ప్రేమా, నిరవధిక త్యాగం, ఆత్మసౌందర్యం గలవారుండరనే చెప్పగలను."

"రష్యన్ ప్రజల్ని నేను బాగా యెరుగును. వాళ్ళని నేనేమీ పొగడ నక్కరలేదు. కావి, వాళ్లు ప్రపంచమానవవిజ్ఞానానికి వన్నెయు వాసియు తేగలరని చెప్తాను. చరిత్రలో అశ్రుతపూర్వమూ, గాఢమూ, ముఖ్యమూ ఐన ఉపజ్ఞనూ, త్యాగాన్నీ ప్రదర్శించి, అత్యుత్తమమైన ప్రజాతంత్రాన్ని తమ దేశంలో స్థాపించి తీర్తారు. అదే మానవజాతులకు కొన్ని తరాల దాకా ఒరవడిగా వుంటుంది."

"నిర్బంధాలవల్ల యెన్నో కష్టనష్టాలు కలిగినా కార్మికవర్గం ఓడి పోదు. నూతన ఆశలతో విప్లవ వర్గాలు యెంతో దుర్నిరీక్ష్యంగా తయా రవుతాయి. ఒక్క కార్మికవర్గమే నైతికబలం, ధర్మబలం, ఆత్మ విశ్వాసం గలిగి వుండగలదు. నిజాయితీ,నిష్పక్షపాతబుద్ధీ గల చరిత్ర కారులు అందరూ నే చెప్పే దానిలో నిజాన్నిఅంగీకరిస్తారు. ఆరోజు సమీపంలోనే వుంది."

"నీజీవితం వృధా పోలేదని తెలుసుకోడానికి నువ్వెంత ఆనందపడ తావు! నువ్వు ప్రజలకి సేవ చేయగలిగి నందుకు, నీ జీవితం ప్రజలకి అంకితమైనందుకు మహదానందం కలుగుతుంది. అట్టి ఆనందం ప్రతి ఒక్కరికీ కలగాలని నే కోరుతాను."

"మనం అనుకొనే చెడుగు దేనిలోనూ అనుషంగికంగాలేదు. కేవ లమూ బాహ్య భౌతిక పరిస్థితులవల్లనే మంచి చెడుగులు సంక్రమిస్తు న్నాయి ఎవరికైనా."

"బాహ్యపరిస్థితులకి లొంగి పడి వుండడ మంత ఆపద యింకోటి లేదు. మరోటైతే శరీరాంగాల్నే వికలం చేస్తుందిగాని యిది మనస్సునే, ఆత్మనే వికలం చేసేస్తుంది. ఇంతకి మించిన ఆపద మానవునికి వేరే ముంది ?"

"లోకంలోని సత్పురుషులంతా నిన్ను నలిపేయడానికీ, బురదలో తొక్కి నామరూపాల్లేకుండా చేయడానికీ నిరంతరం కృషిచేస్తూనే వుంటారు. అంచేత ఒక్క క్షణమైనా ఏమరివుండకు. వాళ్ల ఆశయం ఫలించకుండా చేయడంలో అప్రమత్తుడవై పనిచెయ్యి. నీకు తప్పక జయం లభిస్తుంది."

"అర్థశాస్త్ర సూత్రాల్ని బుద్ధితో గాక శరీరంతోనే గ్రహించేను. ఈ ప్రపంచంలో అధిక సంఖ్యాకుల పరిస్థితి నాకంటె భిన్నమైనదిగా లేనప్పుడు పెద్దపెద్ద పుస్తకాల్ని ఎవరికీ తెలియని మాటలతో రాయడంలో ప్రయోజనం నాకేమీ కనిపించదు. ఇంకోడికి లాభాల్నీ, సుఖాన్నీ చేకూర్చడంలో తన శక్తిని ధారపోసేవాళ్ళకి స్పష్టంగా కనిపించే సిద్ధాంతాలు బోధించడానికిరాసిన ఈపుస్తకాలు చూస్తే, ముంజేతి కంకణానికి అద్దమెందుకు ? అన్న సామెత ఊరికే పుట్టలేదని తెలుస్తుంది."

"మెత్తగానూ, ప్రేమగానూ మాట్లాడేవాళ్ళని చూస్తే నాకు అనుమానం. అంతూదరీలేని ఈర్ష్యాసూయలూ, క్రూరత్వమూ, అల్పలాభాలనార్జించడానికై నిరంతరం చేసే నీచ సంకుచిత పోరాటముగాక మానవ జీవితమంటే వేరేమీ కనిపించదు."

"నాగరక జీవితమంటే ఉద్రేకాల్నీ, ఉద్వేగాల్నీ అణచుకుని, పునః పునరాలోచనతో తనపని తాను చేసుకుని పోతూండడమే."

"పెద్దమనుష్యుల్లో వుండే స్వార్థం, సంకుచితత్వం, అసూయ, నైచ్యం, ద్రోహబుద్ధి నికృష్టమానవు లనబడేవాళ్ళలో కనిపించవు."

"సాహిత్యం మానవుణ్ణి ఉన్నతుణ్ణిగా చేస్తుంది. తన్నుదాను తెలిసి కొని, ఆత్మవిశ్వాసం పెంపొందించుకుని, సత్యం—న్యాయం కోసం పోరాడేటట్లు చేయగలిగి వుండాలి. మానవుల్లోని నైచ్యతను నిర్మూలించ డానికీ, ఉత్తమగుణాల్ని ఉత్తేజిత మొనర్చడానికీ సమర్థమైనదే సాహిత్యం అనీ చెప్పి తీరాలి. అధర్మం మీద క్రోధం, దౌర్జన్యానికి సిగ్గుపడడం, న్యాయ రక్షణకి ధైర్యం, సౌందర్యం అంటే పవిత్ర ప్రేమ,—వీట్లని మానవుల్లో విజృంభింపజేసేదే, ఉద్దీపింప జేసేదే నిజమైన సాహిత్యం."

"సౌఖ్యానుభవంలో సంతోషం, సంతృప్తి, ఆనందం లేవు. నిరంతరం ఆదర్శాలకోసం, ఆశయాలకోసం కృషి చేయడంలోనే, పోరాడడంలోనే ఆనందం వుంది. పాతజీవితం మెడ తిరగని యిరుకుల్లో వుంది. అందులో అభివృద్ధివిషయ మట్లుంచి మసలడానికే సందులేదు. దానిని బ్రద్దలు గొట్టి తుడిచిపెట్టెయ్యాలి. విశాలమై గాలి వెలుతురులు గల నూతన జీవితాన్ని నిర్మించుకోవాలి."

"ప్రస్తుతంలో చెలామణీలో వున్న మతాలు,—మోజెస్, క్రీస్తు, మహమ్మద్ మొదలైన వారందరి మతాలూ నేను నిరాకరిస్తాను. అవి మానవుల్లో పరస్పర విద్వేషాల్ని పెంపొందించి, అసహనాన్ని అభివృద్ధి చేయడమే గాక బైట యెక్కడో వున్నాయనుకొనే యేవో శక్తులకు మానవుణ్ణి బానిసగా చేస్తున్నాయి. ఈ భ్రాంతులు నాశనం కావాలి. అప్పుడే పరస్పర వైరుద్ధ్యాలు లేకుండా సామరస్యంతో తన సర్వశక్తులనూ అభివృద్ధి బొందించుకుంటూ, తోడి మానవు లభివృద్ధి పొందడానికి తోడ్పడుతూ వుండే నూతన మానవుడు జన్మిస్తాడు."

"సుఖ సంతోషాలతోబాటు కష్టం, దుఃఖం కూడా మానవజీవితంలో సహజమైనవే, తప్పనిసరైనవే అనడం అర్థం లేనిమాట. పాతయుగానికి జెందిన పీడల్లో యిదొకటి. నూతన మానవుడు యీ భావాన్నేగాక,

కష్టదుఃఖాల్నికూడా తన జీవితంలోంచి తుడిచి పారేయగలడు. తుడిచి పారేసి తీరుతాడు."

" 'ఆఁ! పోనిద్దూ! మేం బ్రతకటం లేదూ? మేమూ అందరికంటే బాగానే బ్రతుకుతూన్నాం. మాకు కొత్తావద్దు. ఏమీ వద్దు. ఏదో, మమ్మల్నిల్లా బ్రతకనిద్దురూ!' అనే యీ బాపతు మానవులే లోకంలో చాల మంది. కడుపులో చల్ల కదలని రకం అంటే వీళ్లే. వీళ్ల తత్త్వం వుందే అది సంఘానికి బహు ప్రమాదకరమైనది. ఈ తత్త్వాన్ని నిర్మూలించనిదే కొత్తదాన్ని దేన్నీ నిర్మించడం కష్టం."

"మీరు (రచయితలు) పద్ధతిని, విధానాన్ని, కౌశలాన్ని బాగా అలవరుచుకోవాలి. ఆ కౌశలం లేనిదే చివరకి చెప్పులుకూడా కుట్టలేమే. మన పూర్వకవుల గ్రంథాల్ని క్షుణ్ణంగా చదవాలి. వాళ్లంటే భయపడకండి. వాళ్ళు మీ భావాలనేమీ మార్చరు. పైపెచ్చు వాళ్లు మీ కౌశలాన్ని పెంపొందిస్తారు. మాటలతో కోటలు కట్టేవాళ్ళని చూసి కంగారు పడక్కరలేదు. సహజత్వం, సత్యం,-యీ రెండూ అమడలవంటివి. వాటికి మూడోసోదరి 'సౌందర్యం'. రచనలమీదే మీ కాలాన్నంతనూ వినియోగించుతూండండి."

"శైశవంలో వున్న రష్యన్ సాహిత్యం యెంతో సాధించాల్సివుంది. వెనకటి జీవితంలోని కుళ్ళునంతనీ, దౌర్భాగ్యానంతనీ కళ్ళకి గట్టినట్లు చిత్రించడం; ఒక నూతన జీవితాన్నీ, నవ్యమనోతత్త్వాన్నీ సృష్టించడంలో తోడ్పడ్డం; ప్రతి రంగంలోనూ వీరోచితంగా ధైర్యంగాపనిచేసి, స్వీయాభివృద్ధికై ప్రతి ఒక్కరూ కృషిచేసేటట్లు చేయడం,—యిట్లాటివే మన సాహిత్యం సాధించాల్సిన ధర్మాలు. నేనేమీ ధోరణులు బోధించడంలేదు. ప్రపంచమంతా కళావేత్తకి కావ్యవస్తువే. అతడెప్పుడూ వున్న వ్యవస్థతో, యదార్థపరిస్థితులతో, తనతో అతృప్తుడై వుండాలి. ఇది

ముఖ్యంగా గమనించండి. తనను గూర్చి, తన కృషిని గూర్చి కూడా అతృప్తుడై యే వుండాలి."

" 'నీ పొరుగువాణ్ణి ప్రేమింపుము!' అఁ! - ప్రేమించడం గాదు. పొరుగువాళ్ళని ప్రేమించాల్సిన సందర్భాలేమోగాని తీట వదలగొట్టాల్సిన సందర్భాలే హెచ్చుగా వుంటాయి."

"త్యాగం చేయండని ప్రజలకి బోధించడం వట్టి దగా. సామాన్య ప్రజ త్యాగం చెయ్యాల్సిందేముంది, ప్రాణాలు దక్క! అందర్నీ త్యాగం చేయమని 'నా కాయుష్యం - నా కారోగ్యం' అనుకుంటూండే పెద్దల్నేగాక కిమ్మనకుండా సర్వం త్యాగం చేసేవాళ్లని కూడా మనం చూస్తాం. ప్రజలకి తెలుసు యెవరి ననుసరించాలో!"

"నే నీ ప్రపంచంలోకి దేనితోనూ రాజీ పడడానికి రాలేదు. అన్నిటితోనూ తగవు పడ్డానికే వచ్చేను."

"కవీ! నీకాలాన్ని వృధా చేస్తున్నావు. సంఘటనల్ని, చరిత్రని లిఖించడమే నీపని. చివరకి పక్కానికి తేవాల్సింది నువ్వు కానేకాదు.... విప్లవమే ఆ కర్తవ్యాన్ని నెర వేరుస్తుంది."

"ఓరిమి! ఓరిమి గాడిదల సుగుణం. ఇతరులు పెట్టే బాధలకి లొంగి, సహించి, ఓరిమితో పడివుండడం మానవుణ్ణి నాశనం చేసేస్తుంది. ఓరిమి నిప్పులాగే ఆశ్రయ మిచ్చినవాళ్లనే దహించేస్తుంది. ఓరిమి గలిగి వుండండని బోధించేవాళ్ళు ప్రజల్ని కనుకప్పి గాడిదలుగా చేద్దామని చూస్తూన్నారన్నమాట."

ది 24-12-1948 తెలుగు స్వతంత్రలో యివి ప్రకటితములైనాయి. సం॥



**GORKI JEEVITAM** **Rs. 1/8**

Trans. by : JAGANMOHAN, M.
Pub : *VISWA SAHITYA MALA, Rajahmundry*



## సిద్ధముగానున్న గ్రంధాలు

| | | | |
|---|---|---|---|
| విప్లవ సందేశం (3 కూర్పు) | రు. 0 | 8 | 0 |
| లెనిన్ ఉపదేశాలు (2 కూర్పు, పామీదత్తు) | 1 | 0 | 0 |
| ప్రపంచ కార్మికోద్యమ చరిత్ర (2 కూర్పు ఒకేసంపుటి) | 1 | 4 | 0 |
| బలిదాన్ (సోవియట్ నాటకం) | 1 | 4 | 0 |
| సోవియట్ ప్రజాస్వామ్యం | 0 | 12 | 0 |
| నాద్యా (వివిధదేశాల కథలసంపుటి) | 1 | 0 | 0 |
| లెనిన్ జీవితకథలు (14 బొమ్మలతో - పిల్లలకు) | 1 | 0 | 0 |
| టాల్‌స్టాయ్ కథలు (పది కథలు) | 1 | 8 | 0 |
| గోర్కీ కథలు (ఆరు కథలు) | 1 | 8 | 0 |
| యక్షప్రశ్నలు (చిక్కుప్రశ్నలు - శాస్త్రీయ సమాధానాలు) | 1 | 8 | 0 |
| డిప్యూటీ ఛైర్మన్ (చీనా విప్లవ కథలు) | 1 | 0 | 0 |
| ప్రతీకార జ్వాలలు (నవల - 2 కూర్పు) | 1 | 0 | 0 |
| రాజ్యాంగ యంత్రం (లెనిన్ రచన, 2 కూర్పు) | 0 | 4 | 0 |
| ఇండియా (మార్క్సు, ఏంజిల్సు) | 1 | 0 | 0 |
| చీనా కథలు (ఆస్వాల్డ్ ఎర్డ్‌బర్గ్) | 1 | 0 | 0 |
| గోర్కీ జీవితం | 1 | 8 | 0 |



షరా : 1. ఏజంట్లకు 25% న్నూ, లైబ్రరీలకు 12½% న్నూ కమీషన్ యిస్తాము.
2. ఖర్చులు యేజంట్లే భరించాలి. ఆర్డరుతో అడ్వాన్సు పంపాలి.

విశ్వ సాహిత్య మాల,
అవంతీ ప్రెస్ బిల్డింగ్స్ - రాజమండ్రి.

